ఉత్తమ పుస్తకమాలిక ౩.

# రైతు
# రాజ్యాంగ నిర్మాణ
# సంఘము

# రైతు - రాజ్యాంగ నిర్మాణసంఘము

( డి. యం. హెమిల్టన్ )


అనువాదకర్త:

కల్లూరి చంద్రమౌళి

బి. యస్. సి.

(అబర్డీన్)



౧౯33

౧-౦-౦

# తొలిపలుకు.

ప్రాచీనకాలమునుండియు హిందూదేశమున వ్యవసాయము ప్రధానవృత్తి. రైతువెన్నెముక. గ్రామములు పాడిపంటలతోడను, ఫలవృక్షములతోడను కళకళలాడు చుండెను. కాని నేడు రైతు గర్భదరిద్రుడుగనుండి, ఋణభారముచే క్రుంగి కృశించిపోవుచున్నాడు. 'గ్రామములకు మరలుడు. కర్షకోద్ధరణమునకు గడంగుడు' అని నేడు దేశీయులెల్ల రేకకంఠముగ నుడువుచున్నారు. రైతు నుద్ధరింప బెక్కురు పెక్కుమార్గములు చూపిరి. ప్రభుత్వపు టుదాసీనతవలన నందెద్దియు నాచరణ సాధ్యము గాకున్నది. వ్యవసాయమును సక్రమమార్గముల నిర్వహించి, పంటల బెంపొందించుటకు వలయు పెట్టుబడి ధనము రైతులకడ లేదు పండినపంటలనైన సక్రమ క్రయములకు విక్రయించుటకు వలయు నేర్పాట్లంతకంటెను లేవు. ఋణభారమువలనను, నిర్మాణ శూన్యతవలనను, రైతు నిస్సహాయుడై ఏమియు జేయ జాలని దుస్థితియందున్నాడు. ఇట్టి స్థితినుండి రైతును తొలగించి, ఋణవిముక్తునిగను, స్వశక్తిపై నాధారపడి యుండునట్లుగను గావింపవలెననిన, నీ గ్రంథమున హేమిల్టన్‌గారు చూపిన విధానమునకంటె వేరొండుత్కృష్ట మార్గమును గాంచజాలము. హేమిల్టన్‌గారు తన విధానమును స్వయముగ వంగరాష్ట్రమున 'సుందరవన' ప్రాంతముల నాచరణమునందిడి, రైతుల యభి

వృద్ధి కెంతయు దోడ్పడెను. ఆదర్శనీయమగు గ్రామమును గానీ, రైతునుగానీ అటనే గాంచగలమనుటలో నతిశయోక్తి లేదు. ఈ విధానమును దేశమునందంతటను నెలకొల్పుట కుచిత సాధనసంపత్తిని రానున్న నూతన రాజ్యాంగనిర్మాణమునందిమిడ్చి, ప్రభుత్వము కార్యదీక్షకు గడంగుచో కొలది వత్సరములలోనే మన దేశము పూర్వమువలెనే పాడిపంటలతోడను, సిరిసంపదలతోడను తులదూగుచు, సర్వకళలతో శోభిల్లుచు మానవ కళ్యాణమునకు సర్వతోముఖముగ దోడ్పడును. నేడు లోపభూయిష్ఠములుగనున్న సహకారసంఘములు, సర్వవిధముల రైతునకు దోడ్పడి, తమ ధర్మమును నిర్వహించును.

నేనీగ్రంథమును 1931 వ సం॥ సెప్టెంబరుమాసముననే పూర్తిగావించియు నింతవఱకును ప్రచురింపజాలకపోయితిని. ప్రభుత్వము, సహకారసంఘములు, తదితర ప్రజాసంస్థలు నీ గ్రంథమున జూపబడిన విధానములను జరుప బ్రయత్నించుచో నా యాశయము నెఱవేఱినట్లే. గ్రంథమును విశాలదృష్టితో బఠించి, యిందలి గుణాగుణములు పాఠకులు నిర్ణయింతురుగాత!

మోపర్రు.
శ్రీముఖసంవత్సరాది

కల్లూరి చంద్రమౌళి,
అనువాదకుడు.

# పరిచయము.



"జీవనముకంటె వేరొండు భాగ్యము లేద"ని రస్కిను అర్థశాస్త్ర ప్రధాన సత్యమును ప్రకటించెను. ఆహారముగ మార్పబడినపుడే ధనమునకు విలువ యుండును. అనగా జీవితము యొక్క ఆవశ్యములు- ఆనుకూల్యములు- ఆహారము లనబడును. రక్త మాంసములుగ- ప్రాణముగ మార్పు చెందినపుడే ఆహారమునకు విలువగలుగును. ప్రాణము- చురుకుదనము గల శ్రమయే, దేశముయొక్క నిక్కమగు భాగ్యములు గాన మూలధనమునకు ప్రధానములై యున్నవి. నాణక రూపమగు పైకము (బంగారముగానీ, వెండిగానీ, కాగితపు నోట్లుగానీ,) మానవులచే పనిని జేయించు సాధనముగాన మానవుల శ్రమ ఫలితముల మారకము గావించుకొనుటకు మాత్రము వినియోగించును.

ప్రాణము ఉత్పత్తిని జేయు శక్తియు, మూలధనాధారములైయున్నది. కాలువలను బావులను త్రవ్వుట, గృహనిర్మాణము, వస్త్రములను తయారుచేయుట, బాటల నిర్మించుట మొదలగు ప్రయోజనకరములగు కార్యములను, ఆహారోత్పత్తిని గావించుటకు,

ఆరోగ్యవంతుడగు ప్రతీమానవునకు తగినంత ధనము నొసగు బ్యాంకుల విధానమే శాస్త్రసమ్మతమైనది. కాబట్టి ఇట్టి ప్రయోజనకరములగు కార్యములకును, తగిన వస్తు సామగ్రిని మారకము గావించి పంచిపెట్టు టకును గావలయు పరిమితిని మించి ప్రభుత్వము ధనము నచ్చొత్తించుటగానీ, ఋణమొసగుటగానీ జరుగరాదు. ఇంతకంటె నెక్కుడుగ ధనము నచ్చొత్తించినచో ధనము వృద్ధి (Inflation) గాంచును. తన్మూలమున వస్తువుల ధరలు పెచ్చుపెరుగును.

పాశ్చాత్యుల బ్యాంకుల విధానమున తమ ధనము నేకార్యములకు ఋణము నొసంగుచుండినదియు విచారింపకుండుట గొప్పలోపము. తమ ధనము వడ్డీతో సురక్షితముగ తిరిగివచ్చునా యనియే వారి ప్రశ్న. అట్లు వచ్చినచో నది ఆహారోత్పత్తికిగానీ మానవుల జీవిత సౌకర్యములకు గానీ, యుద్ధముల గావించి జీవితముల నాశమొనరించుటకుగానీ, జూదములకుగానీ, మఱియెద్దానికి వినియోగించినను పాశ్చాత్యుల బ్యాంకుల కభ్యంతరము లేదు.

హిందూదేశము చక్కని శాస్త్రి సమ్మతమగు బ్యాంకు పద్ధతిని వాంఛించుచో నది తన పరిశ్రమనంత టిని వృధాబోనీయక ఉత్పత్తికొఱకే పూర్తిగ వినియో

గింపవలయును. ఇట్టివిధానము పూర్తిగ బంగారముపై నాధారపడి యుండరాదు. ఏలన, ఈపద్ధతికి వలసినంత బంగారముమనకడలేదు. ఇది ప్రజాపరిశ్రమ సక్రమ విధానముపై నాధారపడి యుండవలయును. అపుడు ప్రతి ఆరోగ్యవంతుడును నిర్మాణ- ఉత్పత్తి కార్యములకు అక్కఱకు వచ్చుటచే, దేశమునకు పరిపూర్ణోత్పత్తియు, జీవితమును చేపడగలవు. హిందూ దేశోత్పత్తికారునకు ధనము తక్కువ వడ్డీ కొసగబడవలెను. తా నప్పుపుచ్చుకొను ధనమునకు నూటికి సంవత్సరమునకు రు 5-0-0 గాక రు 50-0-0 వడ్డీయగుచో తన లాభ మితరులకే చెందునుగాన తాను కష్టపడి పని చేయ నిచ్చగింపడు. అప్పుడు దేశము యొక్క ఉత్పత్తి, జీవితములు క్షీణించి నాశము గాంచును.

రిజర్వుబ్యాంకు చట్టమును సామ్రాజ్య శాసన సభ త్రోసివేసినందుల కెవరును కన్నీరుగార్ప నక్కర లేదు. ఏమన నిది హిందూదేశమునే లోపింప జేసినది. రిజర్వు బ్యాంకు కొంత పరిమితిగల బంగారమును సరఫరా చేయనెంచుట హిందూదేశమునకు నిష్ప్రయోజనము. హిందూదేశము తన యసంఖ్యాకులగు కార్మికులకు పనిని జూపవలయుననిన అపారమగు ధనము గావలసి యుండును. వ్యవసాయమే హిందూదేశమునకు

ప్రధానమగు వృత్తి. కాని యీ త్రోసివేయబడిన చట్టము ఈవృత్తికి అనగా దేశమున నాహారపదార్థముల నుత్పత్తిజేయుటకు, ధనమొసగు నేర్పాటు లేశమేనియు గావింపలేదు. ఇది యుత్పత్తికారులకుగాక వ్యాపారులకు మాత్రమే సంబంధించిన చట్టము. ఇదివరకే బ్యాంకుల సౌకర్యమును బొందుచున్న వ్యాపారుల కెక్కుడు సౌకర్యమును గావించి, లేశమేనియు బ్యాంకుల సౌకర్యములేని ఉత్పత్తికారుల కీషణ్మాత్రమైన గావింపలేదు. 235 కోట్లరూపాయలతో రిజర్వు బ్యాంకునువ్యాపారికొరకే నియమించి రైతును మార్వాడీలకును, షాహుకారులకు నొప్పగింప దలచినది. 'లార్డు లిన్ లిథ్‌గో' గారి ప్రభుత్వ వ్యవసాయ సంఘము 'రైతులకు ధనసౌకర్యమెట్లు గావింపవలయు'నను విషయమును ప్రకటింపక పూర్వమే యీ రిజర్వు బ్యాంకు బిల్లును త్వరితముగ నేల తీసికొని రావలయునో కారణము గోచరించుటలేదు. హిందూదేశము దీర్ఘకాలమునుండియు వాంఛించి యెదురుచూచుచున్నది హిందూదేశమున కంతటికిని ధనసహాయమును గావించు అఖిల భారత ధనాగారమునే (All India Bank) గాని, యెవరి శ్రమవలన సర్వమానవులు జీవించుచుండిరో అట్టి రైతునకు వినియోగింపని బ్యాం

కును మాత్రముగాదు. హిందూదేశ సౌభాగ్యము, కళ్యాణము రైతుల కళ్యాణముపైననే యాధారపడి యున్నవి. రైతు సౌభాగ్యసంపదలతో తులదూగిన దినముననే హిందూదేశము వికాసవంతమగును. రైతు గర్భదరిద్రుడుగ నుండుట వలననే రత్నగర్భయగు హిందూదేశము దుర్భర దారిద్ర్యము పాలబడినది. కాబట్టి హిందూదేశము యొక్క యీ ధన సమస్యను గమనించి, తదనుకూలముగ వర్తించు ధైర్యమును నూతన ఆర్థిక మంత్రి వహింపగలడా?

కేంద్రస్వర్ణ సంగ్రహ సమస్య (Central Gold Reserve)అంతమొందినది. మిడ్ల్యాండు బ్యాంకు అధ్యక్షుడును, వెనుకటి బ్రిటిషుకోశాధికారియు(Chancellor of the British Exchequer) నగు మ్యాక్‌కెన్నాగారిట్లు నుడివిరి:- "బంగారము ప్రమాణముగ (Standard) గల దేశములందుగూడ నిక ధనము సరఫరాకు బంగారమే మూలముగ నుండనగత్యము లేదు. బంగారముయొక్క సంచలమును గమనింపకయే కేంద్ర ధనాగారములకు (Central Banks) ధనము సరఫరా జేయుశక్తి గలదు. మూలధనమునకు బంగారమే యాధారమని 1844 వ. సంవత్సరమున ప్రపంచమును మోసపుచ్చిన బ్యాంకులు, నేడు, 'బంగారము లేకయే సక్రమ

ముగ ధనము సరఫరా చేయగల'మని నుడువుచున్నవి. యూరపు దేశపు బంగారము అమెరికాకు పూర్తిగ ప్రవహించుటచే, నా బ్యాంకులు, నేడు తమకు బంగార మనవసరమని నుడువుచున్నవి. తమ బంగారము పోయినందువలన సక్రమముగ ధనమును సరఫరా చేయుచు సామాన్య మూల్యతలమును స్వాధీన పఱచుకొనుటయే బ్యాంకుయొక్క ప్రధానధర్మమని నేడు బ్యాంకులు నుడువుచున్నవి. ఇది కడు విపరీతము. సామాన్య మూల్యతలము అనునది లేనేలేదు. ధరలు సామాన్యముగ నుండునవిగావు. అవి వ్యక్తిగతములు. ఖాతాదారులందరును తమ పెట్టుబడులు చెల్లింపుమని కోరినపుడు, బ్యాంకులు బంగారము నెటుల చెల్లింపజాలవో అట్లే వరి, గోదుమ, బొగ్గు మొదలగువాని ధరలను శాసింప జాలవు. 'సమాఖ్యసంగ్రహ విధానము (Federel Reserve System) ధరలను శాసింపజాలదు. ఏలన, నీసమస్యను పరిష్కారము గావించు ననేక విషయములలో నొక్కటిమాత్రమేగదా పెట్టుబడి' అని అమెరికా ప్రభుత్వ కోశకార్యదర్శియగు మెలన్‌గారు నుడివిరి. 6 వ మార్చి టైమ్సు పత్రిక యిట్లు వ్రాసెను. "అమెరికా సంయుక్తరాష్ట్రములలో ఆహారపదార్థముల యభివృద్ధి మార్గమును, 40 లక్షలమంది నిరుద్యోగు

లుగ నుండుటకును, పెక్కుర దైనికాదాయము తగ్గుటచే జీవితప్రమాణము తగ్గుటకును, గొప్పఆర్థికనష్టమునకును, కారణములు విచారించి పరిష్కరించుటకు న్యాయానుగు సెనేటుసభ్యుడు 'వేగ్నర్' సెనెటులో నొక తీరుమానమును ప్రవేశపెట్టెను."

ధనము సరఫరాచేయుటలో నిక బంగారమునకేమియు నిర్ణయాధికారమక్కర లేదని ఆంగ్లకోశాధిపతి నుడివినాడు. 'సమాఖ్యసంగ్రహ ధనాగార పద్ధతి (Federal reserve Banking system) తనకెంత బంగారమున్నను ధరలశాసింపజాల'దని అమెరికా ప్రభుత్వకోశ కార్యదర్శియు నుడివినాడు. ప్రపంచమున సగము బంగారము చేతిలోగల పైదేశపద్ధతియే వ్యాపారమును లోబఱచుకొని నిరుద్యోగసమస్యను పరిష్కరింపజాలక పోగా మఱి నేడు హిందూదేశమునస్థాపింపదలచిన కేంద్ర స్వర్ణసంగ్రహము (Central Gold Reserve) వలన ప్రయోజనమెద్దియో గమనింపదరముగాదు. విహితముగాని బ్యాంకు చట్టమునకు కారణము లేదుగాన దానిని త్రోసిపుచ్చుటయే యుచితము. దీనిని త్రోసిపుచ్చుటచే మఱొక్క మంచివిషయమునకు మార్గమేర్పడినది. ఇది కేవల మొక్క వ్యాపారులకేగాక సకలహిందూ దేశమునకును ధనమునొసగు బ్యాంకు విధానము.

ఎవ్వారి పరిశ్రమ పరుల భోగముల కాధార మగుచున్నదో, ఎవ్వారు హిందూదేశమున నూటికి 80 మంది తామై వెలయుచున్నారో అట్టి రైతులకే-కృషీ వలులకే యీ బ్యాంకువిధానము శీఘ్రముగ నమలు పరుపవలయును. ఈ విషయము ప్రభుత్వ సహకార ధనాగారోద్యోగులు బాగుగ నెఱుగుదురు. కావున వారు రాష్ట్రీయ సహకార ధనాగారముల సమ్మేళన మొనర్చి అఖిలభారత సహకార ధనాగార సంఘమును (All India Co-operative Banking Corporation) స్థాపించి, వ్యాపారములకుగాక, నిక్కువముగు హిందూదేశవాసులగు రైతులకు పూర్తిగ ధన సహాయమును గావింపవలయును. వ్యాపారులకు హైందవ ప్రభుత్వ ధనాగారము (Imperial Bank of India) ను ఇతర బ్యాంకులును ధనము నొసగుచునే యున్నవి. కాని మనకు నేటివఱకును గల యనుభవమును బట్టి సమష్టి మూలధనాగారముల (Joint Stock Banks) నిక స్థాపింపజనదు.

అఖిల భారత సహకార ధనాగార సంఘము స్థాపింపబడిన వెంటనే ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ యిండియాకును దీనికిని సంబంధము గలిపించి యొకదానిలో నొకటి భాగములు గైకొనునట్లు చేసి ఒకదాని డైరెక్ట

రును మఱియొక దానిలో నియమించుకొనవచ్చును. మఱియు అఖిలభారత ధనాగారసంఘము నొకదానిని ప్రత్యేకముగ స్థాపించి అందు ప్రభుత్వధనమును నిలువ చేయవచ్చును. ఈ అఖిల భారత ధనాగారసంఘము హిందూదేశ ప్రభుత్వమునకు ప్రాతినిధ్యము నొసగుచు రాష్ట్రీయ సహకార ధనాగార సంఘములో రాష్ట్రీయ ప్రభుత్వములకు స్థానమొసగవచ్చును.

ఇట్లు అఖిలభారతసహకార ధనాగార సంఘముతో జతపఱుపబడిన ప్రభుత్వధనాగారము(Imperial Bank) అఖిలభారతధనాగారముగ మాఱును. అప్పుడు దాని లండను కార్యాలయము (High Commissioner) హైకమీషనరుసలహాతో, కౌన్సిలుబిల్లులను (Council Bills) అమ్మవచ్చును. హిందూదేశ ప్రభుత్వపు టితర ధనవిషయికములగు వ్యవహారములను జరుపవచ్చును.

పునాదులు చక్కగ వేయక గృహముయొక్క బహిఃశృంగారముల నాలోచించుట నిష్ప్రయోజనము. నిరర్థకము. హిందూదేశమున గల 7 లక్షల గ్రామములకు 7 లక్షల చక్కని పునాదులావశ్యకములు. ఇప్పటికి 70 వేలు మాత్రమే స్థాపింపబడినవి. వీనిలోనైనను చాలభాగము చక్కగ స్థాపింపబడలేదు. ప్రభుత్వము

వెంటనే మిగిలిన 630000 పునాదులు చక్కగ వేయ దగు ప్రయత్నముల గావించునా? ఈ విషయమున హిందూదేశ మాలస్యమెంతమాత్రము సహింపజా లదు. నేడు మోటారుల సౌకర్యమునకై హిందూదేశ ప్రభుత్వము మార్గ నిర్మాణ విధానము నాలోచించు చున్నది. దీని యుద్దేశము హిందూదేశ గ్రామముల కితర ప్రదేశములతో సంబంధము గలిగించుటయే. మ్యాక్ కెన్నా యిటుల నుడివెను. "నేడు చాల దేశములలో ధనమునకు బంగారము నామమాత్రపు ప్రమాణముగా నున్నను ప్రపంచపు సామాన్యమూల్యతలమును నిర్ణ యించునది డాలరుయొక్క కొనుగోలు శక్తియే. కాబట్టి ప్రపంచముడాలరుప్రమాణము(Standard)పై నాధార పడి యున్నదని నుడువకతప్పదు. 'మ్యాక్ కెన్నా'గారి వ్రాతలు వాస్తవము లగుచో తమ యాహారపదార్థ ములు కొని జీవింపవలసిన హిందూదేశపు 8 కోట్లప్రజ లును విపత్పరంపరలకు గుఱియగుదురు. గ్రామములు బాటల వలనను, మోటారుల వలనను, బహిఃప్రపం చము తోడను, బహిః ప్రపంచపు ధరల తోడను. సంబంధ మేర్పరచు కొనుచో, గ్రామములోని యా హార పదార్థముల ధరలు ప్రపంచపు ధరల మట్టు మునకు పెరుగును. ప్రపంచపుధర డాలరు ధరయే

యగుచో నాహారపదార్థములు కొని జీవింపవలసిన హిందూదేశ స్థితి యధోగతిపాలగును. ఏలన నెలకు రు 500.0-0 లు జీతమును సంపాదించు నమెరికా కార్మికుడు తన యాహారపదార్థముల కెంత ధర చెల్లించునో అంతియే ధరను నెలకు రు 25 జీతమును సంపాదించు హిందూదేశకార్మికుడు వరి, గోధుమలు, మొదలగు నాహార పదార్థములకు చెల్లింపక తప్పదు.

కాని రానున్నయపాయమును సూచించుటవలననే రక్షణపరిస్థితులనేర్పఱచుకొనుట కానుకూల్యము గలుగును. తోటల, మోటారుల వృద్ధికంటె వ్యవసాయవృద్ధిని గావించి, దేశములో నాహారపదార్థములు పూర్తిగ బెంపొందించుకొనుచో ధరలు తగ్గును. అందువలన రానున్న యాపదనుండి తప్పించుకొనగలము. హిందూదేశము అధినివేశస్వాతంత్ర్యమును(Dominion Status) వాంఛించు చున్నది. దీనిని సంపాదించుట నిస్సందేహము. కాని హిందూదేశమున కంతకును లభ్యమగు అధినివేశ స్వాతంత్ర్యము కేవల వ్యక్తులకు బెందునదిగాదు. ఉదాహరణము:- కెనడాలోను పడమటి ఆస్ట్రేలియాలోను, రైతులు చక్కగ గృహముల నిర్మించుకొని, ఆహారపదార్థములు విరివిగ పండించుకొని సుఖజీవనము చేయుటకు ప్రతి కర్షకున కుతచి

ముగ సారవంతమగు భూమి 160 యెకరము లొసగ బడెను. కాని హిందూదేశపు రైతునకన్ననో తన కుటుంబ జీవన నిర్వహణమునకు సగటున 5 యెకర ములబీదభూమిగలదు. రాయల్ వ్యవసాయసంఘమువారి సలహాలు పూర్తిగ సమ్మతింపబడి, రైతుల పంటలందు వలన ద్విగుణమగునని భావించినను, కెనడా, ఆస్ట్రేలియా రైతులలో హిందూదేశపు రైతు 16 వ వంతు గనే యుండును. అనగా వారికి రు 1-0-0 విలువ యున్నచో మనరైతున కొక యణావిలువ యుండును. కెనడా రైతునకు 5 ఎకరముల బీదభూమినొసగి తన కుటుంబమునకును, పట్టణవాసుల భోగమయజీవనము లకును ఆహారపదార్థములు పండింపుమనియడిగిన నేమి ప్రత్యుత్తరమొసగునో నా కూహింప వలనుగాకున్నది. కాగితముపై వ్రాయు నధినివేశ స్వాతంత్ర్యమునకును, జీవనములోని యధినివేశ స్వాతంత్ర్యమునకును చాల భేదముగలదు. జీవనమే గణ్యము- మాన్యమనుట నిర్వివాదాంశము. హిందూదేశము కోరునది పొట్టుగాదు. అచ్చమగు బియ్యపుగింజ. అది ప్రతిబింబమునుకోరదు. మూలపదార్థమునే వాంఛించు చున్నది. ప్రతిష్ఠకంటె నాహారమే యెక్కుడు రక్తమాంసముల నొసంగును. ఆంగ్లదేశీయమితవాదపక్షమువారు“ఆంగ్లదేశ భావివ్యాపా

రము" అనునొక పెద్దగ్రంథమును ప్రకటించిరి. ఈపక్షకార్య నిర్వాహకులీగ్రంథకర్తలలో సర్ జాన్ సైమన్ మొదలగు వారిని జేర్చిరి. దాని యుపోద్ఘాతాంతమున నిట్లు నుడువ బడెను. "రాజ్యాంగ, ఆర్థిక వ్యవహారముల పరమావధి ప్రభుత్వయంత్రము నందొకింత సవరించుటలో లేదని యును, వ్యక్తిగతముగ ప్రతిస్త్రీకిని, పురుషునకును సర్వాంగ సుందర జీవనము నేర్పరచుటయందే గల దనియును హృదయపూర్వకమగు మా విశ్వాసము." సర్ జాన్ సైమన్ తన యనుచరుల సహాయముతో హిందూదేశ రాజ్యాంగ నిర్మాణ మొనరించునపు డీ యున్నతాశయము ననుష్ఠించునని నేను విశ్వసించెద. కృషీవలుడు, వ్యాపారి, నిరుపేద, అస్పృశ్యుడు, వేయేల సకలమానవుల జీవనములు భూమినుండి యుత్పత్తియగు పదార్థములమీదనే యాధారపడియున్నవి. హిందూదేశ మున వృద్ధిగాంచుచున్న ప్రజలు తమ జీవనావశ్యకము లగు వాంఛలు నెఱవేర్చుకొనవలయునన్న - నార్థిక, రా జ్యాంగ దుస్థితులనుండి రక్షించుకొనవలయునన్న భూ ములు బలపఱిచి సమృద్ధముగ పంటలనొసగునట్లు గావిం పవలయును. ఈ కార్యమునకు గావలసిన సర్వవిషయ ములు వెంటనే యాచరింప గడంగనగును.

డి. యమ్. హ్యామిల్టన్.

భారత శాసననియమిత సంఘాధ్యక్షులగు
రైట్ హానరబుల్, సర్ జార్జి సైమన్
కె. సి. యస్. పి. గారికి.

అయ్యా!

## హిందూదేశ రాజ్యాంగ నిర్మాణము.

"ప్రజాయత్త ప్రభుత్వ నిర్వహణ విజయము చట్టముల పైన- వ్రాతమూలకములగు నిబంధనముల పైన నాధారపడి యుండదు. అది సంఘములయొక్కయు ఆచారముల యొక్కయు, సాంప్రదాయములయొక్కయు, క్రమనిర్మాణము మీదనే యాధారపడి యుండును." మాంటేగు చెల్మ్సఫోర్డు రిపోర్టు 88 వ పుట.

ప్రధానామాత్యుడు తన యుపన్యాసమున హిందూదేశ రాజ్యాంగ నిర్మాణ సమస్యాపరిష్కారమునకు మార్గములు ప్రతివ్యక్తియు (ఆంగ్లేయుడుగాని, హైందవుడుగాని,) చూపవచ్చునని నుడివియుండెను. గాన నా విధానమార్గము నించుక చూపుచుంటి. హిందూదేశమున నూటికి 80 మంది గల రైతులలో నాకుండిన సంబంధమును బట్టియు, నే నీదేశమున 25 సంవత్సరములు రైతుగను, వ్యాపారిగను నుండుటను బట్టియు,

నిర్మిం చుచున్నట్లు కనుగొంటిని. మఱియు నేను లార్డుకర్జను రాజప్రతినిధిగ నున్న సమయమున సామ్రాజ్యశాసన సభలో వ్యాపార ప్రతినిధిగ కొంతకాలముండి ప్రాచీన గ్రామ విధానమును నవీన మార్గానుసారము పునరుద్ధరించి, హిందూదేశమునకు హాయి యొసగించుచుండిన సహకార సంఘముల చట్టమును (Co-operative Credit Societies Act) నిర్మింప సాయపడితిని. ఇందుతో పంపుకొనుచున్న నా వ్యాసములు నేడు ప్రభుత్వము నెదుట నుండిన రిజర్వ్ బ్యాంకు చట్టమును విమర్శించునవి. ఇవి హిందూదేశ రాజకీయ ఆర్థిక సాంఘికావశ్యకములకు సరిపడునని నా తలంపు.

మీరు 'భారతీయుల సమ్మతిలేని విధానమును హిందూదేశముపై బలవంతముగ నంటగట్టుట మా యుద్దేశముగా'దని నుడివియుంటిరి. ఇట్లంటగట్ట నుద్దేశించినచో నీవరకే యెడపెడలుగ నున్న దేశములో రాజ్యాంగవేత్తలయందు కలహములను బోషించి సామ్రాజ్యమును, 32కోట్ల భారతీయులను సర్వనాశము గావించిన వారలగుదురు.

హిందూదేశము తన ప్రాచీన గ్రామ సంఘ నిర్మాణమునకు తోడ్పడు అఖిలభారత సహకార విధానమును వాంఛించుచున్నది. ఈ సహకారవిధానమును

నేనిట విపులముగ చర్చించుట యనవసరము. ఏలన, 1913 వ సంవత్సరములో ప్రభుత్వ సహకార సభ యందు వంగ ప్రభుత్వ కార్యనిర్వాహక సభ్యుడగు పి. సి. లియన్‌గారు చర్చించిన విషయము నిందుపొందు పరచితిని. అఖిలభారత ధనాగారమును దెలుపు చిత్ర పటముగూడ నీవిషయమును స్పష్టపఱచును. రాజ్యాంగ తత్వమును గుఱించి లియన్‌గారు నుడివిన యీ క్రింది సత్యమును భారతదేశముతో బరిచయముగల ప్రతి వ్యక్తియు గ్రహింపగలడు. "మనము దృఢమగు రాజ్యాంగ భవననిర్మాణము నభిలషించినచో సాంఘిక ఆర్థికవిషయ ములందువలె బలమగు పునాదులపై గట్టనగును. ఒక నాయకుని గౌరవ ప్రతిష్ఠలు తన్నెన్నుకొనిన ప్రజల యభిమానముపై నాధారపడియుండును. తాను నడపు పక్షమునందు జీవితవికాసమును శక్తియు లేనిచో నాయన నామమాత్రావశిష్టుడుగనే యుండును. ఈ ప్రజాబలము తనకు పునాదులైన గ్రామము మీదనే యాధారపడి యున్నది."

ఈ భావములు నేటి విజ్ఞానమయ హిందూదేశా శయములను వ్యక్తీకరించును. వంగరాష్ట్ర రాజ్యాంగ నాయకుడును గత సామ్రాజ్య శాసనసభాసభ్యుడునగు బిపినచంద్రపాలుగారు 'సర్చిలైటు' పత్రికయం దిట్లు

వ్రాసిరి. "ప్రాచీన స్వతంత్రరాజ్యాంగ జీవనమును గడపిన హైందవ సామ్రాజ్యము గ్రామసంఘ సమ్మేళన స్వరూపముగ నుండెను. ఇది మా ప్రాచీనసాంప్రదాయమగుటచేతను, హిందువుల సంఖ్య నేడు ప్రబలముగ నుండుటచేతను, భావి హిందూదేశ స్వరాజ్య నిర్మాణమిట్టి సంఘ సమ్మేళనముపై నాధారపడి యుండవలెను. నవీనాశయములకును ఆవశ్యములగు నవసరములకును ననుకూలమగు గ్రామమే యీ సమాఖ్య ప్రభుత్వమునకు పునాదిగనుండనగును. కాబట్టి యొక గొప్ప గ్రామమునుగానీ, కొన్ని చిన్నగ్రామములు చేరిన గ్రామమును గానీ పునాదిగజేసి భావిహిందూదేశ స్వరాజ్యనిర్మాణమును గావింపనగును." అదే పత్రికయందు హిందువులును, మహమ్మదీయులును కలిసి గావించిన హిందూదేశపు కామన్ వెల్తు బిల్లునుగూర్చి శివరావుగారు నుడివిన వాక్యములు గాంచుడు. 'కామన్ వెల్తు' బిల్లు, హిందూదేశ ప్రభుత్వ నిర్మాణమునకు గ్రామమే పునాదిగ నుండవలయునని సూచించుచున్నది.

మఱియు రామదాసుపంతులుగారు 'స్వరాజ్యపు పునాదులు, గ్రామపునర్నిర్మాణములను' గూర్చి నుడివిన వాక్యముల గాంచుడు.

"మానవుని యుత్సాహశక్తియే వాని సంకల్ప

మున కాధారము. కదల్చినంతనే పైకి చివాలున లేచు తీగెపై (Spring) నొక పెద్ద బరువు నుంచుడు అది తన స్థితి స్థాపకత్వమును (Elasticity) గోల్పోవును. అట్లే గ్రామములో నూటికి 75 వంతున ప్రతికూలపరిస్థితులలో నివసించు మాత్రజలను ఆర్థికముగ నాశమొనరించుటయే గాక దుర్బలులుగను, నిర్మాణశక్తిశూన్యులుగను జేయుటచే సంఘీభావమును గోల్పోయిరనుటలో నాశ్చర్యము లేదు. కావున మన గ్రామ జీవితమును పునరుద్ధరింపకయే స్వరాజ్యమును సంపాదింపగలమా? యనునదియే నేటి సమస్య కనుక దేశమునందలి శక్తిని, విజ్ఞానమును, విధానమును గ్రామ పునర్నిర్మాణమునకు వినియోగింప గృత సంకల్పులముగా నంతవఱకును ఆర్థిక రాజ్యాంగాభివృద్ధికి మార్గము లేదు."

మఱియు రాయల్ వ్యవసాయ సంఘాధ్యక్షుడగు లార్డు లిన్‌లిథ్‌గో ప్రభువు బర్మాయందిట్లు నుడివెను. "హిందూ దేశముయొక్క సిరిసంపదలు వ్యవసాయముపై నాధారపడియున్నవి. దాని వాణిజ్య వ్యాపారముల యభివృద్ధి వ్యవసాయాభివృద్ధి మీదనే యాధారపడియున్నది. రైతు కొనుగోలు శక్తిని వృద్ధిజేయుటవలన తడవుగా వాణిజ్య వ్యాపారములకు సక్రమ లాభము కలుగ గలదు. యంత్రశాల భాగ్యాభివృద్ధి భూమి

పంటల పెంపుపై పూర్తిగా నాధారపడియున్నది. పరిశ్రమలు ముడి పదార్థములను, తయారైన వస్తువుల గొనువారిని వాంఛించుచుండును. కృషీవలుడు భాగ్యవంతమును, పారిశ్రామికశక్తి సంపన్నమును నగు ప్రజాసముదాయ మధ్యమున తా నుత్పత్తిజేయు పంటలకు మంచి వెలనిచ్చు వ్యాపారుల బడయగలడు."

లార్డు లిన్‌లిథ్‌గో సలహా ననుసరించి రైతు తనయొక్క కొనుగోలు శక్తిని వృద్ధి గావించుకొనుటకు ధనమావశ్యము; అతడు తన తలకు మీరి పీల్చి పిప్పిజేయుచున్న 45,50 కోట్ల పౌనుల ఋణబాధనుండి విముక్తు డగుటకును, తనకుగల కొలదిభూమిని చక్కగ సేద్యముచేసి, పండించి, స్వతంత్రుండై, దేశమును సామ్రాజ్యమునందు స్వతంత్రముగను, సౌఖ్యవంతముగను జేయుటకును, చిన్న - పెద్ద వాయిదాలపద్ధతిపై ఋణమును బొందు నవకాశమవసరము. జీవకళాశూన్యములగు గ్రామముల జీవితమందు నవ్యరక్త సంచారమొనరింప లేనట్టియు, దేశమునకు వెన్నెముకవంటి రైతు రక్తమాంసముల బీల్చిపిప్పిజేయు ధనాఢ్యుల యన్యాయ ధనాకర్షణ శక్తిని జూపు మహాజనుల నట్టియు, నిర్మాణవిధానము, బాష్పవిహీనమగు యంత్రమువగిది రక్తమాంస శూన్యమగు నస్థిపంజరము మాడ్కి నుండును.

హిందూదేశము శారీరిక, మానసిక బలాభివృద్ధి కర మగు నాహారము నొసగు ధనము నపేక్షించుచున్నదే కాని యెన్నికల హక్కులు వాంఛించుటలేదు. బ్రిటిషు ప్రభుత్వ ప్రకృతిశాస్త్రోద్యోగులు రాయల్ వ్యవసాయ సంఘము నెదుట హిందూదేశమునగల భూములు చాల బీద స్థితిలో నున్నవనియు, నందు వలన రైతులు, పశువులు జీవితోపాధి కవసరమగు నాహారమున కేని నోచక నకనక పడుచున్నవనియు నుడివిరి. కావున నీ ప్రజలకును, పశువులకును వలయు నాహారము నొసగజాలని రాజ్యాంగ విధానము నిరర్థకము.

"రాజ్యాంగ వేత్తలయొక్కయు, శాసన నిర్మాతలయొక్కయు దృష్టితో జూచిన అర్థశాస్త్రము రెండు విషయములు వ్యక్తీకరించును. ప్రథమవిషయము, ప్రజల కధికమగు నాదాయమును, జీవనోపాయమును గల్పింప వలయును. అనగా ప్రజలు తమకువలయు విపులాదాయమును, జీవనాధారమును సంపాదించుకొనగలుగునంతటి శక్తిమంతులుగావలయును. రెండవది శ్రేయోదాయకములగు కార్యముల కొఱకు తగిన ధనమును ప్రభుత్వమున కొసగవలయును. ఇట్టి విధానము ప్రభుత్వమును, ప్రజలను భాగ్యవంతులుగ నొనరించి సౌఖ్యముల నొడగూర్చును." ఆడమ్ స్మిత్.

ఈ విధముగ ప్రజలను తమ జీవనోపాయములను సంపాదించుకొనగల వారినిగ జేయవలసియున్న రాజ్యాంగవేత్తల ప్రధానధర్మము నేడు ప్రజలను సహనశూన్యులుగను, ద్వేషమయులుగను జేసి పరస్పరము దోచుకొనునట్లు ప్రేరేపించుచున్నది. "నేటి శాసన నిర్మాణముచే దేశము తన నైతిక బలమును గోల్పోవుచున్నద"ని స్నోడన్ నుడివెను. ఒకపక్షమును మీఱి రెండవ పక్షము తన అధికారములను స్థాపించుకొనుటకు లంచములపై నాధారపడునట్లు ప్రేరేపించు పక్షప్రభుత్వనీతి శ్రేయస్కరముగాదు. నేడాంగ్లదేశము తత్ఫలముగ పన్నుల భారముచే క్రుంగిపోవుచున్నది. కావున పాశ్చాత్యదేశములే గర్హించుచున్న ప్రభుత్వవిధానము హిందూదేశమున నెలకొల్పి యద్దానిని నాశమొనరింపజనదు. హిందూదేశము రష్యావారి నాస్తికవాదమునుగాని, ఇటలీవారి యేకచ్ఛత్రాధిపత్యమును గాని, నీతి దూరమగు నాంగ్లదేశపు పక్షవిధానమును గాని వాంఛించుటలేదు. మఱియు నేటి ప్రజాప్రభుత్వవిధానమును (Democracy) హిందూ దేశమునకు నిష్ప్రయోజనమే. ప్రజాప్రభుత్వమున కర్థము అవనత సమత్వమనుచో (Levelling Down) నద్దానిని హిందూదేశ మీవరకే గాంచియున్నది. హిందూదేశము

వాంఛించునది యది కాదు. అది యున్నత సమత్వమునే (Levelling Up) వాంఛించుచున్నది. 'ఆనందమయాంగ్లదేశము' అను తన చిన్నగ్రంథమున బ్లాచ్ ఫోర్డు అను సాంఘికవాది తాను 'భాగ్యవంతుని బొగ్గు పనివానిగ గాక బొగ్గు పనివానిని భాగ్యవంతునిగ నొనరింప వాంఛించుచున్నా' నని నుడివెను. గాంధి మహాత్ముడు బ్రాహ్మణుని అస్పృశ్యునిగ గాక, అస్పృశ్యునే బ్రాహ్మణునిగ మార్ప వాంఛించు చున్నాడు. ఈ రాజ్యాంగకార్యకుశలత్వము హిందూదేశీయ సహకార ధనవిధానమునకై వినియోగింపబడుచో నియ్యది కృషి, వాణిజ్య, పారిశ్రామికములగు సకల వ్యాపారముల నభివృద్ధి జేసి ప్రతివానిని మూలధనాధికునిగ గావించును. తన్మూలమున జీవనోపాయమును గల్పించి కుటుంబనిర్వహణమునుగావించునట్టియు, శాసకశాసితుల శ్రేయోభివృద్ధి కావశ్యకమగు ధనమును సాధించునట్టియు విధానము నిర్మితమగును. నేడు, ప్రభుత్వోద్యోగులును, ప్రజలును జీవనోపాయము లేమి, క్షుద్బాధచే క్రుస్గుచున్నారు. కాబట్టి నేటి ప్రపంచము మానవుని శాసకునిగను, శ్రీమంతునిగను, మాన్యునిగను, గావించి ధనమును వానికి బానిసగ జేయు నిర్మాణవిధానమును వాంఛించుచున్నది. కాబట్టి

హిందూదేశము ప్రస్తుతరాజ్యాంగ విధానమును నిర్మింప నున్న సంఘసాహాయ్యముతో సహకార ధనవిధాన మును స్థాపించి, దానిని వికాసవంత మొనరించి, (Conservative) పూర్వాచారులయు, మితవాదు లయు, సాంఘికవాదులయు, పరస్పర పక్ష ద్వేషముల నిర్మూలించి, భావి హిందూదేశమును బునరుద్ధరించి, దానిని సకల ప్రపంచమునకు మార్గదర్శకముగ నుండు నట్లు చేయుగాక. కాబట్టి యిట్టి రాజ్యాంగ విధాన వృక్షమును పాదుకొల్పి, మోతీలాలు నెహ్రూగారు తరుణ భారతమును వాంఛించిన విధముగ దానినీడ క్రింద, హిందువులు, మహమ్మదీయులు, అస్పృశ్యులు నెల్లరు సోదరులుగనుండి, కృషిసలిపి, సౌఖ్యముల బడయునట్లు గావింతురుగాక.

విద్య.

విజ్ఞానవంతులగు నెన్నికదారులను బట్టియే విద్యాభివృద్ధి వ్యక్తమగునను తలంపుతో ప్రభుత్వము హిందూదేశ విద్యాభివృద్ధినిగూర్చి ప్రకటింపవలెనని యీ 'శాసననియమితసంఘము'ను గోరెను. ఆయభివృద్ధి కడుంగడు స్వల్పమగుట నీసంఘమద్దానినిగూర్చి యంత శ్రమపడ నవసరములేదు. ధనములేక విద్యలభింప నేరదు. హిందూదేశ ప్రజలకు ధనములేదు. అందు

వలన విద్యాశూన్యము. వంగవిద్యాశాఖాధికారి 1918 వ సంవత్సరములో నిట్లు నుడివెను. "గడ్డిలేకుండ నిటికల నిర్మింపజాలము. అట్లే నేటి స్వల్పధనసహాయముతో పాఠశాలలు స్థాపించుట అసంభవము." ఈ విషయము నేటికి నంతసత్యమే. ఈ ధనము సహకారవిధానముచే దప్ప మఱొకవిధముచే లభింపదు. లోగడ పంజాబు ఆర్థిక శాఖోద్యోగిగ నుండిన సర్ మేల్కొం డార్లింగ్ కె. సి. ఐ. యి. సి. యస్. ఐ. గారు 'ఏషియాటిక్ రివ్యూ'లో నిట్లు వ్రాసిరి:—

"హిందూదేశ గ్రామవాసులెల్లరును దరిద్రాపుగ విద్యాశూన్యులే. వ్యవసాయము సర్వవిధముల వృద్ధిగాంచవలయుననినచో నీ గ్రామవాసుల కెల్లరకును సామాన్య విద్యనైన గఱపవలయును. ఇది సాధ్యమా యను ప్రశ్న వేఱు. నేటివరకు గ్రామప్రజలు విద్యాభివృద్ధికి గావించిన కృషి బహుస్వల్పము. ఉచితనిర్బంధ విద్యావిధానము లేక యిది నెఱవేరజాలదు. దీని కార్థిక, సాంఘిక, రాజ్యాంగ నిర్వహణములయం దాటంకములు పెక్కులు గలవనుట వాస్తవము. స్థానిక ప్రభుత్వాధీనమున విద్యాశాఖయున్నను, ఫలము నిర్ణయించుట కింకను వ్యవధిచాలదు. ఇది జయప్రదముగ నెఱవేరినచో గ్రామవాసుల వ్యవసాయాభివృద్ధియు, సంపద

లను, వృద్ధియగును. సామాన్యవిజ్ఞానము లభించిన కృషివిజ్ఞానమును, గృహపరిశ్రమ విజ్ఞానమును లభించుట సులభము. సహకారసంఘ విధానము నెఱుగక హిందూదేశ గ్రామపరిస్థితులను దెలిసికొనుట యసంభవము. ఈ విధానమే యెన్నదగిన నేటి పరివర్తనము. సాంఘిక, నైతిక ఆర్థికముల మార్పుల కిదియే కారణము.

గ్రామ ఋణ విముక్తి యొనరించి, వ్యవసాయమునకు వలయు మూలధనమునుగూర్చి 'సహకార పరపతి సంఘములు' గ్రామజీవనమున మిక్కిలి తోడుపడినవి. అప్పీయని సహకార సంఘములు (Non-credit Societies) సాంఘిక, నైతికాభ్యుదయమునకు చేయూత యిచ్చినవి. ఈ సహకారపద్ధతి నేడు కొన్ని గ్రామములకే లభించినది. తన్మూలమున నీ గ్రామముల స్వయంసహాయము, మితవ్యయము, సంఘీభావము పెంపొందినవి. ఈ విధమున సాంఘిక, నైతిక జీవనములకు తోడ్పాటు కలిగినది. కావున నీ సహకార సంఘముల సర్వవిధముల నభివృద్ధిగావించి పోషించుట మిక్కిలి యగత్యము."

## ధనము. (Finance)

ధనము వినా గావింపబడు నిర్మాణము బాష్పశూన్యమగు యంత్రమువంటిదనియు, రక్తమాంసములు

లేని అస్థిపంజరము వంటిదనియు నుడివియుంటిని. ధనము చేజిక్కినచో నిర్మాణమును తనకుతానే సిద్ధింపగలదు. అంతే, విద్య అభివృద్ధిగాంచును. ప్రజలు హాయిగ జీవింతురు. 3 సంవత్సరములకు దొలుత మన చక్రవర్తి హిందూదేశమందలి నాణెముల పద్ధతిని, ధనమును గూర్చి విచారింప "రాయల్ కమీషను"ను బంపినప్పుడు తమ కవకాశమిచ్చిన సులభముగ నీ సమస్యను పరిష్కరింప నర్హులగు రైతులను విడిచి యది విచారణ సలిపెను.

"జీవనముకంటె వేరొండు భాగ్యము లేద"ని రస్కిను నుడివెను. "శ్రమకంటె వేరొండు భాగ్యము లేద"ని ఆడమ్ స్మిత్ నుడివెను. ప్రాచీనార్థశాస్త్రము లన్నియు సంవత్సరము పొడుగునను ప్రజలొనరించు శ్రమయే వారికి సంవత్సరమున కంతటికి వలయు వస్తుసంతతుల నిచ్చు మూలధనము అని చాటియున్నవి. మన సామ్రాజ్యమునం దధికముగ నిలువయుండిన స్థూల ధనము హిందూదేశమున నిర్మాణవిహీనమగు శ్రమయే. ఈ మూలధనమును వినియోగింప జాలని యే రాజ్యనిర్మాణమును చిరస్థాయిగ నుండజాలదు. వెండి బంగారములు, కరెన్సీనోట్లు, చెక్కులు, బ్యాంకులు ఏ నిలువ ధనమును—సృష్టింపజాలవు. చెల్లింపనుజాలవు. అవి

నామమాత్రములగు ధరలుమాత్రమే. వస్తువులు, వస్తువుల వలననే లభించును. సకల వస్తువులును పరిశ్రమ ఫలములే. "ప్రతి వస్తువుయొక్క వాస్తమగుధర దాని యుత్పత్తికై వినియోగింపబడు శ్రమయే." కాని నేటి రాజ్యాంగవేత్తగాని, అర్థశాస్త్రవేత్తగాని యీ మూల సత్యమును గ్రహించినట్లు కానబడదు. "మనము తిరిగి స్వర్ణప్రమాణస్థితికి బ్రాపించినాముగాన సర్వము చక్క బడినద"ని వారు నుడువుచున్నారు. కాని ప్రపంచ మంతయు బసిడి బంతియగుచో, మన మెల్లరమును మృత్యువువాత బడియుండెడి వారమేకదా! "జీవనము కంటె వేరొండు భాగ్యములేదు." మానవుల శారీరిక, మానసిక శ్రమలకంటె వేరొండు ధనములేదు. నేటి బ్యాంకుల విధానమును గూర్చియు, ధనస్వభావము గూర్చియు ప్రజలందొక దురభిప్రాయముగలదు. 'ఒక బ్యాంకునకు—ప్రథమమున నిలువధనము (Deposits) లేకున్నచో నితరులకు ఋణము నొసగజాలద'ని. కాని వాస్తవమునకు బ్యాంకులకు (Deposits) నితరులు నిలువజేయు ధనమనవసరము. "బ్యాంకు ధనము నప్పు పుచ్చుకొని, దానిని మరల ఋణముల నొసగు సంస్థ గాదు. అది పరపతిని (Credit) పుట్టించును." అని డన్నింగ్ మ్యాక్ లౌడ్ నుడివెను. స్కాట్లాండు

బ్యాంకులు రొక్కపు పరపతి విధానమును తొలుదొల్త సృష్టించెను. ఈ విధానము, బ్యాంకులో ధనము నిలువజేయుట కాధారమయ్యెను. 'రొక్కపు పరపతి నీయ దొడగిన 25-30 సంవత్సరముల వరకు బ్యాంకులకు (Deposits) డిపాజిటులే లేవు' అని వాల్టర్ బ్యాగ్ హాట్ తన 'లాంబార్డుస్ట్రీటు'న నుడివెను. వీరు 'ధనము'ను సృష్టించినది డబ్బు గాదనియు, మానవుఁడే యనియు గ్రహించి (Deposits) డిపాజిటులకై వేచియుండక పౌనునోట నెక్కువగ ముద్రించి (పందెగాండ్రకును, జూదలరులకును కాదు) కృషీవలులు మొదలగు నుత్పత్తి కారులలో విశ్వాసపాత్రులగు వారి కప్పులీయదొడంగిరి. డబ్బు బ్యాంకులనుండి బయల్వెడలి ధాన్యమును ఇతరములగు పంటల నెన్నింటినో సృష్టించి తిరిగి వచ్చినది. మరల నేగి యపార ధాన్యరాసుల బండించి దోడ్కొని వచ్చినది ఇందువలన దేశము వృద్ధిగాంచి భాగ్యవంతమైనది. ఈచందమున నీ హిందూదేశమును సహకార పద్ధతులపై నిర్మాణముగావించి, రూపాయ నోట్లను వీనికి వలయు చిల్లరతో సృష్టించినచో, హిందూదేశము భాగ్యవంతముగ- సిరిసంపదల కాణాచిగ శోభిల్లగలదు. ఈనోటు పేదవానికి చెక్కుగ మారి, వ్రాయను చదువను నేరనివారి కనుగుణముగు

పరపతిగ వినియోగపడును. సక్రమ సహకారపద్ధతుల పై నిర్మాణము గావించిన దేశీయ శ్రమతో రూపాయ నోటును జోడించినపుడే, హిందూదేశము ప్రశాంత మగు నభ్యుదయమును బడయగలదు. అట్లాోనరింపనిచో దేశాభివృద్ధి స్వప్నవార్త. అంత నీదేశరాజ్యాంగ విధానము, క్రమముగ నరుదగుచున్న యిసుకపునాదివంటి బంగారముపై గాక దృఢతరుడగు మానవుని మీదను, విశ్వసనీయమగు పరిశ్రమమీదను, నిర్మితమై నిశ్చలముగను, సుదృఢముగను, స్థాపితమగును. కానిచో బంగారుగను లంతమొందిన పిదప, మన ధనవిధానమును, మనము కాలూని యెట నిలువగలము?

పన్నులు.

'భావిహిందూదేశము' అను తన గ్రంథమున 'ఖూబ్ దేఖ్ తో ఆగే' దుర్బలమగు నొక సలహా నిచ్చియున్నాడు. 'సాంఘికాభ్యుదయమునకు ధనలోపము ప్రతిబంధకముగ నుండునని, ఇంతకుబూర్వము వచించితిమి. మంత్రులు ప్రజాలాభమునకై పన్నులు విధింప సాహసింప నంతవరకును దేశాభివృద్ధికరకార్యములను నెఱవేర్పజాలరు.' కాని 'ఖూబ్ దేఖ్ తో ఆగే' (ముందు జూచువాడు) ముందు వెనుక లారయుచో పన్నుల భారమే విప్లవోత్పత్తికి కన్నతల్లియని గ్రహించియుండెడి

వాడు. మఱియు 'బుఖారిన్' (రష్యా సాంఘికవాది) 'హిందూదేశమున విప్లవోద్యమమును గలిగింతు'నని సగర్వముగ నుడువు నీ సమయమున పన్నులభారమును శత్రువు బారినుండి మనము తప్పించుకొనవలెను. అమెరికా బ్రిటిషు సామ్రాజ్యమునుండి విడిపోవుటకు పన్నులే ప్రబలకారణము. మన బంధువులే మనము విధించిన పన్నులు తిరస్కరించినపుడు పెరవారు తిరస్కరించుట యబ్బురముగాదు. కాన పన్నులు వేయుటకు ముందు జాగ్రత్తగ నాలోచింపవలయును అందునను మనకును వారికిని భేదాభిప్రాయము లున్నపుడు మిక్కిలి జాగరూకతతో నుండవలయును. అశాంతి ప్రబలినపుడొకమారు "అమృతబజారు పత్రిక' బుద్ధిసూక్ష్మతతో 'ధనమును వదలుట ప్రతివానికి దుర్భరమే'యని నుడివెను. అందునను, ధనము లేనపుడు పన్నులు చెల్లించుట మఱింత కష్టతరము. కొంగున మూటయున్నపుడుగదా, మనమద్దానిని విప్పుకొన గలుగునది! భాగ్యవంతునిపై పన్ను విధించిన నతడు మనల ప్రేమింపనొల్లడు, పేదవానిపై పన్నువిధించిన ద్వేషింపగడంగును. పాశ్చాత్య ప్రభుత్వములనుమహాత్ముడు "సైతానులు"అనినుడువగా నాంగ్లదేశ ప్రజలు అది సత్యమేయని విశ్వసించిరి. మహాత్ముని యాదర్శాచరణ పద్ధతిని మన మంగీకరింప

కున్నను స్టాంపుడ్యూటీచే నమెరికా ఆంగ్లేయ రాజ్యాంగ వేత్తలు అమెరికాను గోల్పోయిరని నుడువకతప్పదు. అమెరికావారు రక్తపాత విప్లవమూలకములగు నుద్యమములతో, తమ లక్ష్యములు సాధించుకొనిన రీతిగనే మహాత్ముడు సత్యదయాఽహింసాది ప్రశాంత సాధనముల మూలమున నట్టి లక్ష్యములనే సాధింపగడంగినాడు. అమెరికా విప్లవోత్పత్తి వివరమంతయు (Encyclopædia Britanica) ఆంగ్ల విజ్ఞాన సర్వస్వమునందలి 'ప్రపంచచరిత్ర'యం దిట్లుదహరింపబడి యున్నది.

*స్టాంపుటాక్సు కాంగ్రెసు'సమావేశము (1765వ సం॥)*

ఈ సంఘము మూడు వారములు సమావేశమై, వలసరాజ్యముల హక్కులను గూర్చియు, వానికి బాటిల్లుచున్న యపకృతులను గూర్చియు, తీర్మానముల గావించెను. ఆంగ్లేయు లనుభవించుచున్న హక్కులనన్నింటిని, వలసరాజ్యములు తమ జన్మస్వత్వములని నిర్ధారణజేసినవి. పన్నులు తమ సమ్మతితోడనే విధించు హక్కుగూడ నివి వాంఛించినవి."

"వివిధ వలస'రాష్ట్ర సమావేశములయందును, ఈ సంఘమువారి తీర్మానము లంగీకరింపబడెను. స్టాంపుచట్టము నవంబరు, 1 వ తేదీనుండి అమలులోనికి రావ

లెనని యాంగ్ల ప్రభుత్వము నిర్ణయించెను. కాని యొక టవ తేది గడచినను ఒక్క స్టాంపుగూడ కొన్నది లేదు."

న్యూయార్కు వర్తకులు, ఆంగ్ల దేశమందున్న తమ ప్రతినిధులకు 'స్టాంపుచట్టము' నాంగ్లేయులు రద్దుపరుప నంతవఱకును ఆంగ్లదేశపు సరకులు కొనవల దని యాజ్ఞాపించిరి. అంతవరకు నమెరికావారు గౌరవ చిహ్నములుగ భావించుచుండిన ఆంగ్లదేశపు దుస్తులు బహిష్కరించి, దేశీయములగు దుస్తులనే ధరింప నారంభించిరి.

స్టాంపుపన్ను వసూలుచేయు 'కలెక్టరు' బ్రతుకు సందిగ్ధమాయెను. ఒక ప్రముఖుడొకతూరి తఱచుగా నుద్యోగస్థు లధిరోహించు శ్వేతాశ్వము నధిరోహించి యొక గ్రామమున కరుగగా నతసని ప్రజలు వేటాడ సాగిరి. కళాశూన్యమగు తురంగముపై, నిస్తేజమగు వదనముతో శవాకృతితో నతడు పలాయన మొనరింప వలసివచ్చెను.

కాబట్టి బహిష్కరణములనులక్ష్యపెట్టక 25కోట్ల ప్రజలు వెంటాడుచో, స్వల్పసంఖ్యాకులగు నాంగ్ల కర్షకులు వెంటాడిన యుదంతము దీనిముందు అల్పముగ నుండునను విషయము ఈ శాసననియమితసంఘమునకు హెచ్చరిక యగుగాక. "బార్నాలోని స్త్రీలు పన్నులు

వసూలుచేయు నొక కలెక్టరును ముట్టడించిరి. ఆ సందర్భమున నిద్దరు మరణించిరి. అనేకులు గాయపడిరి" అని పైన్యు పత్రిక ప్రకటించెను.

హిందూదేశ ప్రజలు మనస్ఫూర్తిగ సమ్మతించు పన్నును విధించి, మనలను గౌరవించునటుల చేసికొను టకు మార్గ మొక్కటే కలదు. అది యేదియన, ప్రభుత్వము బ్యాంకు పన్నును విధించి, రైతుల కనుకూలమగు బ్యాంకువిధానమును ధైర్యసాహసములతో నిర్వహించుటయే. దీనికి పోటీదారు సాహుకారు. ఇతని నెంత త్వరితముగ రూపుమాపిన నంత శ్రేయస్కరము.

ఏతత్ కార్య నిర్వహణమునకు ప్రభుత్వము ఋణముచేయ నవసరములేదు. అప్పు పుచ్చుకొనిన వారి పరపతిపై ధనమును తృప్తిచేసి, వారికే సురక్షితముగ ఋణము లొసగవచ్చును. ఈవిధముగ నిత్యము సమష్టిమూలధనాగారములు (Joint Stock Banks) కాగితపు ధనము నచ్చొత్తించి చాల లాభము గడించుచున్నవి. ఇవి, అరువుతీసికొను ధనమునకంటే 8, 9 మడుగుల ధన మచ్చొత్తించి, ఆ ధనముపై నూటికి, సంవత్సరమునకు 6 వంతున వడ్డీ విధించి లాభము బొందుచున్నవి. లండనులో నొక బ్యాంకు మేనేజరగు 'హైడు' ఇటుల నుడివెను. "మనము మనధనమును వృద్ధి

చేసికొనిన, నితరులకు విరివిగ నప్పు పెట్టగలము. ఈవిధముగ మనము వృద్ధి చేసికొనిన ధనముకంటే 8, 9 మడుగులు క్రొత్త డిపాజిట్ల కాధారమగు వస్తువులను (మన రేషియోను భంగపరుపకయే) వృద్ధి చేసికొనగలము. మరియు మనము తక్కువ రేషియోతో పని చేయదలచిన, మన ధనమును క్రొత్తపరపతులకు పునాదిగ నేర్పరచుకొని, మన మొసగు ధనముకంటె 8, 9 రెట్ల పరపతిని వృద్ధి చేసికొనగలము." ప్రజలు తమవద్దనుండిన పౌను నోట్లనెల్ల బ్యాంకులో నిల్వయుంచి, తాము చెల్లింపవలసిన వారికి చెక్కు లొసగినచో, వారిచ్చుధనమునకు బ్యాంకులు 8,9 రెట్ల ధనమును చెక్కుల రూపమున సృష్టించి, యిచ్చి వారివద్దనుండి నూటికి, సంవత్సరమునకు 6 వంతున మాత్రము వడ్డీ స్వీకరించును. పరపతి యనగా బ్యాంకులు తాము స్వయముగ తయ్యారుజేయు కాగితముల ధనమే. బ్యాంకులు ప్రభుత్వపు కాగితపు ధనమువలన గలుగు నపాయములను, ప్రమాదములను జూపును. కాని, తమ కాగితపు ధనమును గూర్చి మాటలాడవు; అయినను ఇవి రెండును తమ ధనము నుత్పత్తి కార్యములకు వినియోగించుచున్నంతవరకు నపాయములురావు. ఇది, ఉత్పత్తికిని, వస్తునిర్మాణమునకును వినియోగింప బడినచో మంచి

ధనముగనె పరిగణింపబడును, అప్పుడిట్టి ధన మపరిమిత ముగ నుండనేరదు. కాని, యుత్పత్తికి వినియోగింప బడని (బంగారముగాని, వెండిగాని, కాగితముగాని) ధనము చెడ్డదే

బంగారమే పరపతికి మూలాధారమని భావించి నను (అట్లుకాదు) హిందూదేశ ప్రభుత్వమునొద్దనుండిన (Gold Standard and Paper Currency Reserves) ను రొక్కముగ మార్చినచో, 8, 9 రెట్లు పరపతిధనము లభించును. దీనిని ప్రజల కప్పియవచ్చును. ఆంగ్ల ప్రభుత్వారంభమునుండియు హిందూదేశపు సేద్య ము ధనలోపముచే క్షీణించుచున్నను ధనమును విరివిగ రైతులకిచ్చి వారినుండి తా నెక్కుడు లాభమును బొందు పద్ధతిని ప్రభుత్వ మవలంబింపదాయెను. ఈ మూలధనమంతటిని దాచిపెట్టుటచే హిందూదేశ వ్యవ సాయమును, పరిపాలనమును క్షీణించిపోవుచున్నవి. హిందూదేశ జీవితమును సహకార పద్ధతులపై నిర్మిం చినచో 1,000,000,000 నచ్చొత్తించి, ప్రభుత్వము £ 50,000,000 ధనమును పన్నుల [వడ్డీ] రూపమున సంపాదించుటయేగాక, ప్రజలపంటలయభివృద్ధియు జేయ వచ్చును. ఈ రూపమగు పన్నునే హిందూదేశము వాంఛించుచున్నది. దీనినిమాత్రమే యది చెల్లింపగలదు.

## గ్రామ ప్రజాపాలనము.

హిందూదేశము ప్రస్తుతావశ్యకములగు మార్పులతో ప్రాచీనపరిపాలనా విధానము నభిలషించుచున్నది. ఆంగ్ల ప్రభుత్వము నాశముగావించుటకు పూర్వము, గ్రామ పరిపాలనా విధానమెట్లున్నది? 1884 వ సంవత్సరమున 'హిందూదేశ చరిత్ర' యను గ్రంథమున (1) హాగ్ ముర్రే, (2) జేమ్సువిల్సన్, (3) ఆర్. కె. గ్రెవిల్, (4) ప్రొఫెసర్, జేమ్సన్, (5) సర్. విలియమ్ ఎయిన్సిలీ, (6) విలియమ్, వాలేస్, (7) కెప్టెన్ క్లారెన్సు డాల్రింపుల్ గారలు గ్రామప్రజాపాలనము నిట్లు వర్ణించిరి.

"హిందువులు సర్వదా నిరంకుశాధికారులచే పాలింపబడినట్లు కాన్పించుచున్నది. పెద్దకాలమునుండియు వీరు తమ మతమునకు, ఆచారమునకు, మానసికదృష్టికి, భాషకు భిన్నముగనున్న పరిపాలనమునకు లోబడియుండుట అవమానకరము. సంస్థానాధీశులు గూడ ఆచారములకును ప్రజల హక్కులకును లోగక నిరంకుశాధికారమును వహించిరి. వారి సామంతప్రభువు లపుడపుడు తిరుగుబాటు గావించి యీ నిరంకుశాధికారము నెదుర్కొనుచుండెడివారు. ఇట్టి స్థితియందును, గ్రామములు తమ స్వపరిపాలనమును నిలువబెట్టు

కాని దేశీయ ప్రభుత్వమునకు భిన్నముగ - స్వతంత్ర ముగ నుండుట విశదముగ గానవచ్చుచున్నది. ఒకజాతి సక్రమములగు సరిహద్దులమధ్య నిర్ణయించుకొనియున్న కొంత ప్రదేశమే గ్రామము. ఒక్కొకతరి గ్రామప్రజ లెల్లరును కలిసి సాగుజేసికొనుచున్నను సామాన్యముగ నెవరిభూములు వారే సాగుచేసికొనుచుందురు. కొంత భూమినిమాత్రము సర్వదా గ్రామలాభమునకై విడచి పెట్టెడివారు. గ్రామమున వివిధవృత్తులనునిర్వహించువారికి ప్రత్యేకముగ భూములొసగబడుచుండెను. ప్రధానవ్యక్తి గ్రామాధికారి. ఇతడు న్యాయాధికారిగ నుండి, గ్రామ ముందలి పెక్కు తెగలమధ్య సంభవించు జగడములను నిష్పాక్షిక బుద్ధితో బరిష్కరించుచుండెను. ఇతరములగు పనులు, మొహతాదు, వెట్టి, పురోహితుడు, కమసాలి, వడ్రంగి, కుమ్మరి, మంగలి, చాకలి, కరణము మున్నగు వారు నిర్వహించుచుందురు. ఉన్నత ప్రభుత్వమునం దేమార్పులు జరిగినను, ప్రజలెవరి స్వాధీనమున నున్నను పరరాజుల పాలనమందుగాని, స్వదేశ ప్రభువుల పాలన మందుగాని, గ్రామ పరిపాలనా విధానమున నెట్టిమా ర్పును లేదు. ఏవేని దోపిడులు మొదలగునవి జరిగి నపుడు, తాత్కాలికముగ తమ గ్రామములు విడిచినను శాంతిస్థాపనమునకు బిదప మరలివచ్చి నివసించుచుండెడి

వారు. సమర్థులగు రాజుల పాలనమున, నీ గ్రామ ప్రజా పాలనా విధానము హిందూదేశ భోగభాగ్యములకు, అభ్యుదయమునకు, కారణమాయెను. ఈగ్రామములు చెల్లచెదరుగ నుండుటచే సామంతప్రభువుల యంతఃకలహముల నాపజాలకుండెడివి.” మహాత్ముడు పునరుద్ధరింప వాంఛించుచున్న నేతపనినిగూర్చి యిట్లు వారు నుడివిరి.

“హిందూదేశము తన భూములనుండి పడయు సిరిసంపదలకేగాక, పారిశ్రామిక వృత్తులకును ప్రాచీన కాలమునుండియు విఖ్యాతి గాంచినది. ఈ దేశీయ పరిశ్రమ శాఖ, సంఘములోని వివిధజాతులను, అన్నితరగతుల జనులను తృప్తిగావించుటచేతనే వృద్ధిగాంచినదని ‘లాడర్ డేలు’ నుడివెను. ఈదేశమునదరిద్రులు పెక్కురును శ్రీమంతులు కొలదిగను నుండుటచే, ముదుకబట్టల నెక్కుడుగను, సరిగ దుస్తులు స్వల్పముగను తయారు జేసికొనును. ప్రాగ్దేశీయులు, వింతవింత వన్నెలచే నలరారు వస్త్రధారణమున గణుతికెక్కిరి, అందువలన మరియే యితరదేశమునను లేని నైపుణ్యము హిందూదేశ వస్త్రనిర్మాతలకు గలదు. నిన్న మొన్నటివరకు ఆంగ్లదేశముగూడ నిట్టి మేలిరకపు బట్టలు దయ్యారు చేయలేకపోయెను. సుకుమార గాత్రుడును, సిద్ధ హస్తుడును నగు హిందువు, ఆరితేరిన హస్తసంచాలనా నైపుణ్యము

తోడను, బుద్ధి సూక్ష్మతతోడను, ప్రశాంత సహన స్వభావములతోడను, నీ వృత్తిని నిర్వహింప సమర్థుడై యుండెను. సున్నితములగు ఢక్కా మజిలినులను, కొర మాండలు సముద్రతీరమున నేయబడునట్టి, చిత్ర విచిత్ర వర్ణ విలసితములగు గట్టిరంగుల క్యాలికో వంటి గుడ్డలను గీటుపుచ్చు వస్త్రము లే దేశమునను తయారు కాబడ లేదు. నవీన పాశ్చాత్య వస్త్ర నిర్మాణమునకు సౌక ర్యమును గల్పించునట్టి మూలధనమును, యంత్రము లును, శ్రమవిభాగమును, లేకయే యింత సుందరముగ హిందువులు బట్టలు నేయగలిగిరి. నేతగాడు కొలది కొయ్యలతో నిర్మింపబడిన తనమగ్గముపై, తానొంటరిగనే కోరువారికి కోరినట్లు వస్త్రములు నేసి యిచ్చును. తన మగ్గమును మడిచి, దాచుకొనుటకుకూడ స్థలమేని లేని స్థితియందుండుటచేతను, తన చిన్నకుటీరమున మగ్గమును స్థాపించుకొనుట కవకాశము లేకపోవుటవలనను, బహి రంగ ప్రదేశముననే యేర్పరచుకొని, యెండవానలకును, గాలి తాకుడునకును గురియగుచుండును. ఇట్టి స్థితిలో గూడ తనకుగల కొలది యవకాశముతో నధికసౌకర్య ములు కోరకయే, నిజనైపుణ్యమును ప్రదర్శించువిధము, హిందువుయొక్క పూర్వాచారము నంటిపెట్టుకొను పట్టు దలను వెల్లడించును."

గాంధిమహాత్ముఁడు రస్కిన్ శిష్యుఁడు. ఈయన 'అన్ టు ది లాస్టు' అను రస్కిన్ గ్రంథము తన జీవిత పరివర్తనమునకు మిక్కిలి తోడ్పడినదని నుడివియున్నాఁడు. అందు మనుజునివిలువ, ధనముచేగాక జీవితమువలననే కొలువదగునని వ్రాయబడెను. గాంధి రస్కినులు న్యాయమును, సత్యమును, ప్రకటించలేదని యెవఁడు నుడువగలఁడు? జడమగు ధనముకంటె సజీవుఁడగు మానవుఁ డెక్కువ మూల్యవంతుఁ డగుచో, మానవుఁ డధిపతిగను, ధనము వానికి లోఁకువగను నుండ వలయును. ఆహారముకంటె జీవితము శ్రేష్ఠమైనదగుచో, ధనముకంటెను మిన్నయే. గ్రామము పట్టణముకంటె సర్వాంగ సుందరమగు జీవనమును ప్రసాదించుచో, గ్రామ పునరుద్ధరణమును గావింపనగు. వాణిజ్య ప్రధానములగు పాశ్చాత్యదేశములు నయితము, ప్రజలు పట్టణముల కేతెంచి నివసించుటను గర్హించుటలేదా? పట్టనములు సుందర పుష్పోద్యాన మండితములు గావలయు ననుట పట్టణములందలి వ్యాపార సంరంభ కోలాహలములను గర్హించుటయేగదా! వారికా జీవనపరాజయ ముతటస్థించునపుడు ఇంగ్లండునకు బ్రదుకుతెరువెయ్యది? అప్పుడు హిందూదేశ మెట్లుండును? మహాత్ముని ఆర్థికాశయములు సర్వతోముఖములు.

ప్రాచీన హిందూ దేశమున గ్రామమును, సింహాసనమును జతగూర్చు సంబాధము లేదు. "నేడు పరస్పర సంబంధము లేని స్థానిక సంస్థలు పంచాయతి మొదలుకొని, రాష్ట్రీయ శాసన సభవరకు గలవు. ఈ రెంటి మధ్యనున్నవాని నైక్యమొనరించు సూత్రము లేదు. మరియు క్రిందిసంస్థయందలి యనుభవము పైసంస్థాసభ్యత్వమున కగత్యముగాదు." అని "ఖూబ్ దేఖ్ తో ఆగే" నుడివెను.

పరస్పర సంబంధము నేర్పరచు సూత్రము లేమియే హిందూ దేశ దార్బల్యము. ఈ సంబంధసూత్రమములులో లేనంతకాలము హిందూదేశమున కాంగ్ల పతాకా సంబంధము తప్పదు. "ఆంగ్లదేశ ప్రజాసంస్థలు సజీవములై వికాసవంతములుగ నున్నవి. కాని హిందూ దేశ స్థానిక సంస్థలు మరణావస్థకు ప్రాపించి యున్నవి." అని 'ఖూబ్ దేఖ్ తో ఆగే' నుడివెను. ఇది యెందువలన? దీనికి కారణ మాంగ్ల ప్రజాసంస్థలు పుష్కల ధనవంతములుగ నుండుటయు, హిందూదేశప్రజాసంస్థలు స్వల్ప ధనవంతములుగనో, కేవల శూన్యములుగనో యుండుటయే. ఆంగ్ల సంస్థలయందలి ధనము దూర మొనరింతుమేని వానికి నిట్టి మరణావస్థయే పట్టును. ఆంగ్లదేశమునగాని, హిందూదేశమునగాని, గడ్డిలేకయే యిటికె

లను తయారు జేయజాలరు. ధనరాహిత్యముచే, జీవితము, మానవుడు, విద్యాలయము, గ్రామము, ప్రజాసంస్థ, రాష్ట్రీయ ప్రభుత్వము, గవర్నరు, సామ్రాజ్య శాసనసభ, స్టేట్ కౌన్సిలు, రాజప్రతినిధి, రాజ్యాంగ నిర్మాణము, హిందూదేశము మున్నగునవన్నియు కేవల కళాశూన్యములై, యవసాన దశకు ప్రాపించును.

దీనికంతకు ప్రధాన కారణభూతుడు సాహుకారు. ఈ సాహుకారు అంత మొందుటయే తడవుగ దేశము సజీవమగును. కాని, యీతనిని దూషించుటయు దోషమే. ఏలన, ప్రస్తుతము ధనావశ్యతగల హిందూదేశప్రజలకు విత్తమొసగువాడు సాహుకారే.

ప్రజల నొండొరులను గలిపియుంచి వారిని ప్రభుత్వముతోడ గలుపు సూత్రము— గ్రామమునుండి, రాజప్రతినిధివరకు క్రమముగ వ్యాపించియుండు సూత్రము ధనమే. హిందూదేశము ప్రాచీన గ్రామజీవనమునకు మరల జాలదు. సక్రమ ధనసంపాదనా విధానముతో మంచిస్థితికై ముందంజవేయగలదు. మహాత్ముసంతటి వానికిని తన ఖద్దరుద్యమమును వ్యాపింపజేయుటకు 'సైతాను' మోటారుకారును వినియోగింపక తప్పలేదు. చలనము లేమియే మృత్యువు. సంచలనమే చైతన్యము. కాని, ధనము లేనిచో ముందడుగిడజాలము. ధనమె చట్ట

లభ్యపడునో నేను చూపియుంటిని.

సమష్టిమూలధనాగారములందు (Joint Stock Banks) అరువొసగుటకు ధనముగలదనియే యను కొనుడు. వారి, వ్యవహారపద్ధతి దీని కనుకూలమే యనుకొనుడు. అయినను ఇవి, కొలది కొలది మొత్తములుగ నప్పులుగోరు కోట్లకొలది ప్రజలకు సాయపడజాలవు. లార్డు కర్జనుచే స్థాపింపబడిన సహకార పరపతిసంఘము— 'ప్రజల సొంత బ్యాంకు' మాత్రమే ప్రజల కనుకూలింపగలదు. ఇది 20 సంవత్సరములకు దొలుత నారంభమై 70,000 శాఖలను స్థాపింపగలిగెను. కాని, యింకను, వీనికి పదిరెట్లు స్థాపింపబడవలయును గావున, బోల్షివిక్కు సిద్ధాంతములు ప్రబలు నీసమయమునం దాలస్య మపాయకరము గాన, వెంటనే, పది సంవత్సరములలోగా వాని సంఖ్యను పూర్తిచేయవలెను. హిందూదేశ సామాన్య ప్రజలు, పేదలుగ, జ్ఞాన శూన్యులుగ, అసహాయులుగ, ఆంగ్లప్రజలకంటె దక్కువ జీవనోపాయ స్థితిగలవారుగ నున్నారు." అని మాంటేగు ఛెల్మ్సుఫోర్డు నివేదిక వ్రాసెను. కావున విప్లవ కారకమగు నీ దుస్థితిని గమనించుటకును, తొలగించుటకును, సమర్థముగానట్టి నవీన రాజ్యాంగ నిర్మాణము నిలువనేరదు.

## అమెరికా — సామ్రాజ్యము.
## మానవుడా? బంగారమా?

క్రమముగ ధనమే ప్రపంచమును శాసించు శక్తిగ బరిణమించుచున్నది. అమెరికా యీ శక్తిమూలమున నే ప్రపంచ శాసనాధికారమును వహించినది. దాని సువర్ణదంతములు ఐరోపాఖండము కుత్తుకను కరచిపట్టుకొనినవి. ఈపట్టునది మరింత బిగియబట్ట గోరుచున్నది. నిజముగ స్వర్ణప్రమాణము అట్లాంటిక్ మహాసముద్రము నతిక్రమించి, అమెరికాయను విహంగము నధిరోహించి, గగనమండలమున కెగసి, సముద్రముల కధిదేవతగను, భూమండలమునకు దైవముగను విరాజిల్లుచున్నది. ఆంగ్ల దేశమిక నెంతమాత్రమును సముద్రపరిపాలన మొనరింప నేరదు.

నౌకా సంపన్నులను పగ్గములుపట్టి ధనాఢ్యులు వెనుకకు లాగుచుండ లేదా? అమెరికాయుద్ధఋణములకు యూరపుఖండమునుండి ధనము గ్రహించి, తన బంగారముచే ప్రపంచ నాయకత్వము వహించినది. మరియొక యుద్ధము సంభవించుచో, మరల నమెరికా ధనాఢ్యులు ఋణములొసగి, మొనలేనిబంగారము గూర్చ పరస్పర వినాశమునకు దారితీయుచు, ప్రపంచమును దాస్యగ్రస్త మొనరింప సాయపడుదురు. ప్రపంచము సువర్ణదేవ

తను బూజించునంతకాలమును, అమెరికా పూజారిగ, అధిపతిగ నుండును. దాని సువర్ణదంతముల నూడబెఱుక నంతవరకును నిదితథ్యము, వీని నెవరూడబెరుకగలరు? సామ్రాజ్యములో నీ దంతముల నూడబెరుకుశక్తి, నిర్మాణశాలియగు హిందూదేశమునకే కలదు. ఇందలి రైతులే దంతవైద్యులు. ఆంగ్లసామ్రాజ్యమున 45 కోట్ల ప్రజలు కలరు. అమెరికాలో 12 కోట్లమంది మాత్రమే కలరు. 12 కోట్లమందిని, శాంతిసమరమున 45 కోట్ల మంది జయింపజాలనంతటి దుర్బలులై యున్నారా? తాను పండించు పంటల యెగుమతికి ప్రతిఫలముగ, నాదేశమునకు బంగారము లభించును. 45 కోట్లజనులు 12 కోట్ల ప్రజలకంటె నెక్కువ యుత్పత్తిచేసి యెగుమతిని చేయజాలరా? అట్లు చేయజాలనిచో, వారు వాస్తవముగ దుర్బలులే. 45 కోట్లమంది 12 కోట్లమంది కంటె నెక్కుడుగ బంగారమును గూడబెట్టజాలరా? అట్లుగానిచో అందేదియో లోపముండి తీరవలెను. అప్రమాదము, పేదలు, జ్ఞానశూన్యులు, అసహాయులు, పాశ్చాత్య ప్రజలకంటే హీనదశలు నగు ప్రజలుగలిగి నిర్మాణ క్రమములేని 750,000 హిందూదేశ గ్రామము లందు గలదు. హిందూదేశ గ్రామ సముదాయ జీవిత మున నారోగ్యకరమగు నార్థిక రక్తములేమి, సామ్రా

జ్యము దుర్బలమై, సంస్కరణము నభిలషించుచున్నది. దేశములోని ధనప్రవాహము శరీరమందలి రక్తప్రవాహమువంటిది. ఒకప్రవాహ ముత్సాహఫలితము; మరియొకప్రవాహ మవమాన ఫలితము. ఒక ప్రవాహము శరీరమునకు వలయు నుష్ణమును, జీవశక్తిని ప్రసాదించును; మరియొక ప్రవాహము దుర్గంధమును, జీవితపతనమును గావించును. "ఈ యుపమానము సూక్ష్మములగు అణువులకు సయితమనువర్తించును. ఒకభాగమునందలి దూషితరక్తము సమగ్ర శరీరమును దుర్బలమొనరించి, క్షీణింపజేయునట్లు, ఒక్కచోటనే కూడబెట్టబడిన సంపదలు, ఇతరుల నందరి నసహాయులుగ నొనరించి, దేశమును నాశమొనరించును." ( Un to the last ) సాహుకారు ధనముగూర్చు విధానము, హిందూదేశమును సర్వనాశ మొనరించుటచే, నిర్మాణసాధన సంపన్నమగు నమెరికావారిశక్తియెదుట, సామ్రాజ్యము తాళజాలకున్నది. రూపాయనోట్ల ప్రచురణ సాహాయ్యముతో, జీవితమున కుత్సాహకళల నొసగు 'ప్రజాపరపతి సంఘముల' నేర్పఱచి, హిందూదేశ గ్రామముల పతనకారణములు పరిష్కరింపనంతవరకును, దుర్బలత, దారిద్ర్యము నెలకొనియే యుండును. అట్లుచేసినచో, తనబంగారముచే, నిరంకుశాధికారమును నెఱపుచున్న

అమెరికాను, సహకార సంఘములుగల హిందూదేశ మెదుర్కొని, సామ్రాజ్యము నుద్ధరించును. కావున నిర్మాణ పరిష్కృతమగు బంగారముకంటె నిర్మాణ సాధన సంపన్నమగు మానవశక్తి, సర్వతో ముఖము గను, సబలముగను, ప్రవర్ధమాన మగునని యే హిందూ దేశ సందేశము.

కాబట్టి శాసన నియమితసంఘము హిందూ దేశము తనబలమును సర్వవ్యాపక మొనరించు రాజ్యాంగనిర్మాణము గలదిగను, తనకును ప్రపంచమున కును, శ్రేయఃకర మగునట్లును, నొనరించు బాధ్యత వహింపవలెను. ఇట్లు హిందూదేశము, మానవసామ్రా జ్యమున సమాఖ్యప్రపంచమున తన ధర్మమును నిర్వ హింపగలదు. చిత్తరంజనదాసుగారిట్లు నుడివిరి. "సమా ఖ్యప్రపంచమున ప్రపంచశాంతి యుండునని నా విశ్వా సము. ఆంగ్ల సామ్రాజ్య రాజ్యాంగవేత్తలు వివిధజా తుల, ప్రత్యేకతను గాపాడు పరిపాలనమును నెరప గలిగినచో, నేడు వారి నెదుర్కొనిన, ప్రపంచైకమత్య సమస్య అనగా మానవజాతియేకత పరిష్కారమగును. కాని హిందూదేశమున తొలుదొలుత సంఘీభావ ముం డవలెను."

## హిందూ మహమ్మదీయ సమస్య.

"సర్వ జాతులును సమావేశ మగుటకు సాధనములు కడుకొలది. ఒక దేశము మతవిరుద్ధములను వీడి సాంఘిక సమస్యల యందైక్య మయినచో మత సమస్యల నుండి రాజ్యాంగము వేఱు పడునని ప్రపంచానుభవము చాటుచున్నది. ఆంగ్ల దేశమును, ఐర్లాండు దేశమును దీనికి ప్రబల నిదర్శనములు అని "ఖూబ్ దేఖ్ తో ఆగే" నుడివెను. వంగ యువకులు బర్ద్వాన్, మిడ్నపూరు వరదల సమయమున నిట్టి విషయమును ప్రదర్శించిరని పి. సి. లియన్ గారు నుడివిరి. ప్రతి గ్రామమున 'సహకార పరపతి సంఘములు' గ్రామవాసుల నైక్యమొనరించి, గ్రామపాలనా వ్యవహారములం దేకీభవింపజేసి, యెన్నికల విధానమునకు పునాదిగ నెప్పుడుండునాయని నేను నిరీక్షించుచున్నాను.

ధన సమస్యయందు సర్వమానవు లేక గర్భసంజనితులుగ వర్తింతురు. కావున నీశాసన నియమిత సంఘము పై సలహానను సరించి, హిందూదేశ సమస్యాపరిష్కారమునకు పునాదిగ నున్న రైతులు (హిందువుగాని, మహమ్మదీయుడుగాని, క్రైస్తవుడుగాని,) గ్రహింపగలిగినచో గ్రామము ఎన్నిక యాధారముగ నున్నంత మాత్రమున ప్రజలు దేశభక్త్యావేశ పరులు గారని,

గ్రహింపగలడు. ధనమును గూర్చి రైతుతో ముచ్చటింపుము. వెంటనేయతని నేత్రములానంద వికసితములగును. తద్విషయమున గ్రామవాసులెల్లరు, సహకారమును గావింతురు. ధనమును ఇతరగ్రామ సమస్యలతో జోడించిన సహకార పరపతి సంఘము లభివృద్ధి నొందును. ఈవిషయమును ప్రభుత్వమువారి 1925_26 సంవత్సరముల నీలగ్రంథముల (Blue Books) నుండి యుదహరింతుము. హిందూదేశోత్పత్తి వ్యాపారములం దన్నింట వ్యవసాయమే యగ్రగణ్యమనియు, మనల నెదుర్కొను సమస్యలలో గ్రామ ప్రజా సమస్యయే యతి ప్రధానమైన దనియు, ప్రజా సంఖ్యనుబట్టి చూచినను, దీనియందలి కష్ట వ్యవహారములనే మనము పరిష్కరింప వలెననియు స్పష్టపడును. హిందూదేశ ప్రజలకు సంబంధించిన గ్రామనిర్మాణమునకును, పరపతికిని, వస్తువ్యాపార సౌకర్యమునకును, ప్రభుత్వమెట్లు సాయపడవలయునో రాయల్ వ్యవసాయ సంఘముసూచించుచున్నది. ప్రభుత్వ మాచరించు కార్యములకును హద్దులుగలవు. సహకార సంఘోద్యమము ప్రజలయందు స్వయంసహాయమును, పరస్పర సహాయమును బెంపొందించిన వెంటనే ప్రభుత్వపుజోక్యమనవసరమగును. ఈఉద్యమము 20 సంవత్సరములనుండి

నిరాటంకముగ హింధూదేశమున సాగుచున్నది. హిందూదేశమున 1904 వ సంవత్సరమున సహకార సంఘముల చట్టము గావింపబడెను. 1925 వ. సంవత్సరము ముగియకమునుపే 71, 600 సంఘములును. 25 లక్షలసభ్యులును, 50 కోట్లరూపాయలు మూలధనమును గలదు. "ఇంతవరకును మేము దేశాభివృద్ధికార్యములలో రాష్ట్రీయ కార్యములనేనువిడిటిమి. సహకారము, విద్య, స్థానిక సంస్థలు, ప్రజారోగ్యశాఖ పరస్పర సంబంధముగలిగి, పరస్పరసాహాయ్యమును గావించుకొనుచుండును. ఈసహకారసంఘముల సంక్షిప్త నివేదిక వలన, హిందూదేశ గ్రామప్రజలకు సహకారసంఘములు గావించినసాయమును, ముందు గావింపనున్న సాయమును గ్రహింపవచ్చును. నూటికి, 75 వంతులుగనున్న హిందూదేశగ్రామవాసులు అన్యవిషయములలో కృషిసలుపుటకు ముందు—వ్యవసాయాభివృద్ధిగావించుటకు ముందు- తమ్ముముంచివైచిన ఋణములనుండి విముక్తులగుటకును, తమ్ముపట్టి బాధించుచున్న సకల రోగములనుండి విడివడుటకును, తీవ్రకృషిని గావింపవలెను. అప్పుడే, ప్రజలు తమబిడ్డలను పాఠశాలలకు బంపి, వారిజీవన దుస్థితిని, ఆర్థికదాస్యమును బాపగల విద్యను తమకంటె అధికముగా బడయునట్లుచేయగలరు.

ఈ విద్యాభివృద్ధితో వారు ప్రజా పరిపాలనావశ్యకతను గ్రహింతురు. ఈ గ్రామముల యందె నికుృవమగు జాతీయోత్సాహము వ్యాప్తము కావలయును. తమబిడ్డలు, స్థానిక సంస్థలచే నిర్వహింప బడుపాఠశాలలందు విద్యగఱచునప్పుడును, మంచి నీటివసతులు దీపములు రస్తాలు మున్నగు సౌకర్యములు గాంచినపుడును, సహకారమువలని ప్రయోజనములను రైతులు గ్రహింపగలరు" కావున హిందూదేశరాజ్యాంగ నిర్మాణ సాఫల్యము చక్కని పద్ధతులపై నిర్మితములగు సహకారపరపతి సంఘములపై నాధార పడియున్నది. ఈయుద్యమ ఫలమగు నైకమత్యమువలన హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, సోదరులవలె తమ మాతృదేశాభ్యుదయమునకు కృషిగావింపగలరు.

## సంగ్రహధనాగార శాసనము.
## (The Reserve Bank Act.)

హిందూదేశ నూతన రాజ్యాంగ విధానమును నిర్మించుటకును, నిర్మూలించుటకును ధనమే సమర్థమైనది. కావుననేడు ఆర్థిక సభ్యుడగు సర్. జెసీలు బ్లాకెట్, "వైట్‌హాల్, సాయముతో గావింపనున్న రిజర్వుబ్యాంకు చట్టము అమలులోనికి వచ్చుటకు ముందు ఈశాసన నియమిత సంఘము దానిని చక్కగ

విచారించు టత్యంతావసరము. ఈచట్టము హిందూదేశ ప్రధానవృత్తికి (వ్యవసాయమునకు) ధనసహాయకారియైన ఋణీచో నిది విసర్జిత పత్రపేటికకు నగ్గమయి యున్నను.

తమదేశమున వ్యవసాయమునకు ధనము గావలె నని యాంగ్లప్రభుత్వము గ్రహించి రైతుల సమ్మతుల (Votes) నాకర్షింప దలంచి వారికి పరపతి నిప్పించు చట్టము నొకదానిని గావింప ప్రధాన మంత్రి యాలోచించెను. మానవుని ధనదార్ఢ్యము నతడొసగు వడ్డీని బట్టి తెలిసికొననగును. నేడు హిందూదేశము తనఋణములకు నూటికి 25 మొదలు 150 వరకు కూడ వడ్డీని చెల్లించు చున్నది. కావుననే, హిందూదేశప్రజలు దివాలా తీయు చున్నారు. రెండుసంవత్సరములకు దొలుత, ఆదాయ వ్యయపట్టికపై ప్రసంగించుచు, సర్ బెసీలు బ్లాకెట్ "హిందూదేశ విపుల ధనాభివృద్ధి యితరదేశముల యీర్ష్యకు పాత్రమైనది" అనినుడివెను. ఇట్లీతడు, హిందూదేశ ప్రభుత్వమును, హిందూదేశముగానే భావించి పొరపడినాడు. ప్రభుత్వము నూటికి 4.69 వడ్డీతో నప్పు తెచ్చుకొనవచ్చును. కాని ప్రజలు చెల్లించు వడ్డీ నూటికి 46-9 యు, నింతకు నెక్కుడును నైయున్నది. ఈలోపమును, ప్రజావసరముల కనుకూలమగు బ్యాంకు విధానము మాత్రమే సవరింప గలదు. కాగితముపై

నిర్మాణము లెంతచక్కగనున్నను, ఈతప్పిదమును సవరింప నంతవరకును, హిందూదేశస్థితి బాగుపడనేరదు. 1925 వ సంవత్సరమున లార్డుబర్కెన్ హెడ్, "హిందూదేశ భావిస్థితి, వ్యవసాయాభివృద్ధిపై నాధారపడియున్నదని నుడివెను. "హిందూదేశపు టార్థికస్థితిని వివరింపవలయుననినచో, వ్యవసాయమునుగూర్చియే నుడువవలసియుండును. ఆంగ్లప్రజలకును, హిందూదేశప్రజలకును వృత్తియందున్న తారతమ్యము మరియెందునను గానజాలము. ఆంగ్లప్రజలు విరివిగపట్టణవాసులైయుండ, హిందూదేశజులు అసంఖ్యాకములగు గ్రామముల నట నటవ్యాపించి యున్నారు. ఆంగ్లదేశమునను, వేల్సునను, నూటికి 80 మంది పట్టణవాసులు. హిందూదేశమున నూటికి 80 మంది గ్రామవాసులు. నాకుస్వానుభవమెక్కుడుగ లేకపోయినను, మంచిపంటలచే హిందూదేశకల్యాణమును బెంపొందింప వచ్చునని నొక్కి వక్కాణింతును. ప్రభుత్వవ్యవసాయశాఖ ఋణముల నొసంగియు, వ్యవసాయమునకు సౌకర్యములు గల్పించియు, శాస్త్రపరిజ్ఞానమును గలిగించియు, కొంతవరకు తోడ్పడినది. మరియు సంస్కర్తల నెదుర్కొనుకష్టములు నేనెఱుగక పోలేదు. పూర్వాచారపరాయణత, స్వల్పఖండములుగ భూవిభాగవిధానము నూతనోద్దేశములను, పద్ధతులను స్వీకరింప

నీయని రైతుల కష్టములు, సంస్కరణ మార్గమున కాటంకములు. కాని యీకష్టము లన్నియునున్నను, హిందూదేశము తనవ్యవసాయసామ్రాజ్య భాగ్యమును, విలువను గ్రహించి, వృద్ధిచేసికొనుటయందే, తనభావ్యభ్యుదయముగలదు. ఈవ్యవసాయశాఖ పరిజాయత్త శాఖ, యనుట తెల్లమే. ఇంతమాత్రమున నిది, సులభ సాధ్యమని తలంపజనదు. దీనిని నేనును, రాజప్రతినిధియు దీర్ఘముగ నాలోచించితిమి. నేను పదవి యందుండగానే దీనిని వృద్ధిచేయ వాంఛింతును,"

హిందూదేశము తన వ్యవసాయ సామ్రాజ్యము యొక్క విలువ నిదివరకే గ్రహించినది. కాని యీసామ్రాజ్య భాగ్యాభివృద్ధికి ప్రతిగాత్రమునకు సహకార సంఘస్థాపనముతప్ప వేరుగతిలేదు. దీనికినిదర్శనముగను ఈశాసననియమిత సంఘమునకు మార్గదర్శకముగను ఐరిష్ బ్యాంకింగు కమీషను ప్రచురణము నింనుదహరించెద.

"ఈసంఘము దృష్టిలో దీర్ఘకాలిక వ్యవసాయ ఋణవిధానమునకును,దీర్ఘకాలిక వాణిజ్యఋణవిధానమునకును భేదము గలదు. ఈసంఘమిదివరకే వాణిజ్యాభివృద్ధి కొసగు ధనమును, రైతు-వ్యవసాయముల యభివృద్ధి కొసగు ధనమును, వేరుపరుప వలయునని తీర్మా

నము గావించెను. దీనికి చాలకారణములు గలవు. (1) ఐరిష్ ఫ్రీస్టేట్ నిర్మాణమున, వ్యవసాయాభివృద్ధికి వలె, వాణిజ్యాభివృద్ధికి ప్రత్యేక సదుపాయములు గావింపనవసరములేదు. వ్యవసాయము నూటికి 80 మందికి వృత్తి. గాన నితరవ్యాపారములు దాని నాల్గవ భాగము ప్రాముఖ్యము నొందదగును. [2] రైతుకంటె వ్యాపారి, తనవ్యాపారమును, తన్నును రక్షించుకొనుటకు సమర్థుడు. ప్రత్యేకసదుపాయములు చాలవిషయములలో చిన్నరైతునకు వలసినట్లు, వ్యాపారికిని, వస్తు నిర్మాతకును అవసరముండదు".

వ్యవసాయ పరపతి సంఘస్థాపనము బలపరచుచు నీసంఘము మరియు నిట్లనుడివెను. "ప్రభుత్వము వ్యవసాయ విద్యనొసగుచున్నను, మూలధనపు వసతులు గల్పించినను చక్కని యంత్రనిర్మాణము లేనిదే పరిపూర్ణ జయము గలుగజాలదు. ఈయంత్రనిర్మాణమెద్దియో మనము విచారింపవలయును. ఇదియే సహకార సంఘనిర్మాణము. ఇదిలేక కేంద్రప్రభుత్వమునకును గ్రామవాసులగు రైతులకును పరస్పరసంబంధముండజాలదు.

ఈసిద్ధాంతమునే 1927 వ సంవత్సరమున నానాజాతి సమితి యంగీకరించెను. దాని ఆర్థిక సంఘమిట్లు

నిశ్చయించెను.

"వ్యవసాయమే ప్రపంచమున ముఖ్యవృత్తి. దీని యుత్పత్తిపదార్థములకే మానవు లెక్కువ శ్రమపడుచున్నారు. ఈయుత్పత్తిపదార్థముల మారకమే ప్రపంచ వ్యాపారమునకుమూలము. వ్యవసాయము మానవశక్తి వ్యయముగాకుండ గాపాడి,మానవులకుశక్తిభండారముగ నుండగలదు."

"వ్యవసాయ, వస్తునిర్మాణ వ్యాపారముల పరస్పరసంబంధము, దేశముల పరస్పర సంబంధమువలె నుండవలెను. తక్కింగల తెగలసాయములేక యొకతెగ వృద్ధిగాంచ వాంఛించుటవృధా"

"వ్యవసాయబాధల నతిక్రమించుటకు ప్రశమ సాధనము, అనుకూలముగ పరపతి నొసగు సంఘముల స్థాపనమే. దీనికి తగినవి సహకారసంఘములే. ఈనిమూలమున ప్రభుత్వసహాయమున్నను లేకున్నను దేశసౌభాగ్యములు పెంచుకొననగు. పరపతి ముఖ్యముగ ప్రభుత్వ సాహాయ్యమువలన నెక్కుడు మేలు సమకూర్పగలదు.

హిందూదేశము పాశ్చాత్యార్థిక సూచనలు గర్హించుచున్నది. ప్రభుత్వ సౌభాగ్య సంపదలు, ప్రజలసంపదలపై నాధారపడియుండునని గ్రహింప జాలక, 1913 వ సంవత్సరపుఛేంబర్లేను ఆర్థికసంఘము, సహాకార

పద్ధతినిగూర్చి విచారింప నిరాకరించెను. ప్రజల యార్థిక స్థితి దుర్బలముగ నున్నచో, ప్రభుత్వముయొక్కయు, తచ్ఛాఖలయొక్కయు, నార్థిక స్థితి దుర్బలముగ నుండక తప్పదు. కాబట్టి వరదలుప్రబలినపుడును, యుద్ధవాయువులు విజృంభించినపుడును, ఛేంబర్లేను నివేదిక యంత ప్రాతమాయెను.

కాని, నేడు నానాజాతి సమితియు, ఐరిష్ సహకారసంఘమును, సహకారపద్ధతి నాశీర్వదించినవి. అమెరికాశక్తిని ఢీకొనగలశక్తిని [హిందూదేశమును] తృణీకరించిన నానాజాతి సమితి సభ్యుడగు ఆస్టిన్‌గారు తన తప్పిదమునిప్పుడైన గ్రహించునుగాక! ఛేంబర్లేను సంఘానంతరము బ్యాబింగ్‌టన్ స్మిత్ కమిటీయేర్పడి హిందూదేశమును అమెరికా బంగరు డాలరుపై నాధారపరచి, హిందూదేశమునకును, దాని బంగరువిలువకును తీవ్రమగు నష్టముగలిగించెను. దీనికిబిదప, రిట్రెంచిమెంటు కమిటీయేర్పడి, ముద్రణవ్యయమును తగ్గించుకొనుటకు రూపాయకాగితములు రూపుమాపి, భావి హిందూదేశ స్థితికి కుఠారాఘాత మొనరించెను. పత్రిధనమూలమునముఖ్యముగ రూపాయనోట్ల మూలమున ప్రజలపరపతి వృద్ధిగావింపనిచో, హిందూదేశము దారిద్ర్యగ్రస్తముగను అజ్ఞానవంతముగను, నిరాధారముగను నుండకతప్పదు.

పిమ్మట, హిల్టన్ యంగ్ కమీషన్ వచ్చి రూపాయ నోట్లు పునరుద్ధరించినందులకు హిందూదేశము కృతజ్ఞత చూపుచున్నది. కాని మనదురదృష్టముచే నీకమిటీ పూర్వపు కమిటీవలెనే, ధనావశ్యకతగల 25 కోట్ల హిందూదేశపు రైతులను మరచిపోయెను.

ఈ సంఘము, స్వయముగ నిలువబడగల కొలది మంది పాశ్చాత్య హైందవ వ్యాపారులకు, హిందూదేశపు రు 235 కోట్ల మూలధనము నొప్పగించి, దీన నూటికి 80 పాళ్లహక్కుగల దీనులగు రైతులను, తమ పూర్వులవలెనే, ఋణభారములచే కృంగి కృశించి యెండవానల బడి భ్రష్టుడని విడిచిపుచ్చెను. హిందూదేశపు నిలువధనమున ఆంగ్ల, ఫరాసు, డచ్చి, అమెరికా, జపాను బ్యాంకులకు అవకాశముగలదు గాని హిందూదేశపు రైతులకు అవకాశము లేదు. కొంతకాలము క్రిందట జపానునకు నష్టముగలిగించిన, హైదరాబాదు బ్యాంకునకు గూడ, హిందూదేశప్రభుత్వము రిజర్వుబ్యాంకు చట్టము మూలమున అనుకూలములు గల్పించి, తన ప్రజల నసహాయులుగ నుంప నుద్దేశించెను. ఇదియే మొన్నటి ఆర్థిక సంఘము గావించిన, 'ప్రసిద్ధమగు నుత్కృష్ట' ధన విధానము.

సంస్కరణమునుగాంచిన రిజర్వుబ్యాంకుచట్టము,

సామ్రాజ్యమున విశాలమగు హైందవ వ్యవసాయ పరిశ్రమ కెట్టి సౌకర్యములు గావించెనో నాకు తెలియదు. ఇది 3-6 మాసముల చిన్న వాయిదాఋణములకు ఏకొలది మొత్తమునో నిల్వచేయుటకే యగుచో, సామ్రాజ్య శాసనసభ దీనిని త్రోసివేయనగు. కాని ప్రజలకు ధనానుకూల్యమును గావింపక పోగా అమెరికా ప్రభుత్వవిధానమువలె స్వర్ణసంగ్రహమునకు కేంద్రము నేర్పరచుటకే యయినను సామ్రాజ్యశాసనసభ దీనిని త్రోసిపుచ్చవచ్చును. యుద్ధఫలముగ ధరలు వృద్ధిగాంచుటచే, నీపరపతి పునాదికి, గొప్పపరిమాణముగల బంగారమావశ్యకమయ్యెను. కాని బంగారపుటుత్పత్తి క్షీణించుచున్నది. ఇట్టి సంకుచితమగుచున్న లోహమునకు, వృద్ధిగాంచు ప్రపంచము నంటగట్టయత్నించుటచే, వెంటనే గాని, కొంతకాలమునకు బిదపగాని కష్టములు సంప్రాప్తింపక తప్పవు. ఇంగ్లండు టంకశాల యజమాని దీనిని గూర్చి హెచ్చరించిన విషయము నిందుతో బంపుచుంటి.

బంగారము తఱిగిన కొలదియు, దానియవసరము పెరిగిన కొలదియు వస్తువుల ధర మందగించి, ప్రపంచమందంతట నిరుద్యోగమును, వ్యాపారక్షైణ్యమును ప్రబలును. కన్లిఫ్ రిపోర్టు దీనిని బలపరచుచున్నది. బంగారు ప్రమాణమును నిలుపుటకు బ్యాంకుల వడ్డీరేటును

బెంచవలెను. ఇట్లగుచో, ధనపు చెలామణి తగ్గును. వస్తువులకు మంచి ధరలుండవు. నిరుద్యోగసమస్య ప్రబలును. కష్టములు వ్యాపించును.

ఈ కమిటీ లిఫ్ సంఘమున సర్ బెసీల్ బ్లాకెట్ కూడ సభ్యుడని నాకు తెలిసినది. హిందూదేశపు ఆర్థిక స్థితి లోగడి యర్థశాస్త్రజ్ఞుల సలహాచే నాశమయినదని యెరిగియు, నెవరో చెప్పుచున్నారని యీయన భారతమున కపారనష్టకరమగు నార్థికపద్ధతితో దీనిని బంధింప యత్నించుటయా? హిందూదేశమిదివరకే ధనలోపముచే క్షీణించిపోయినది. ఈయన హిందూదేశమును, అమెరికారైతులే గర్హించుచున్న అమెరికా బ్యాంకు విధానముచే బంధించి, ధనమును మరింత యరుదుగ జేయదలంచునా? ఇతడీరాణిబండను హిందూదేశ కంఠమునకు వ్రేలగట్టుటకు పూర్వము, అమెరికా సమాఖ్యసంగ్రహపద్ధతి (FederalReserveSystom) యెట్లుపనిచేయుచున్నదో గ్రహింప బ్రయత్నించెనా?

మీ యుపయోగమునకు, 'బ్యాంకింగ్' అను డిసెంబరు మాసపత్రికలో బ్రకటింపబడిన "అమెరికా సంయుక్త రాష్ట్రములందలి 'బ్యాంకు-అశాంతి' యను వ్యాసము నిందుతో పంపుచున్నాడను. ఈ వ్యాసము కొలంబియా విశ్వవిద్యాలయాచార్యుడగు పార్కర్

విల్లిస్ గారిచే వ్రాయబడెను. ఇతడు 'ఐరిష్ బ్యాంకింగ్ కమీషను' అధ్యక్షుడుగాన, తాను వ్రాసినది బాగుగ గమనించియే వ్రాసెను. ఇందు హిల్టన్‌యంగ్ సంఘము అమెరికాసమాఖ్యసంగ్రహపద్ధతి(American Federal Reserve System) జయప్రద మైనదని భ్రమించి దాని తప్పుడు సిద్ధాంతముల ననుసరించి, హిందూ దేశమునకుసూచించిరనివివరింపబడినది. మరియు నిందు, తనయిష్టప్రకారము ధనము సరఫరా గావించు నాణకాధికారిని (Currency Authority) సమష్టి మూలధనాగారములు(Joint Stock Banks)గ్రహించి దేశవాంఛల నెరవేర్ప నాణకాధికారి (Currency Authority) కంటె మిన్నగ ప్రపంచవ్యాపారములతో తమకు సంబంధముండుటచే, నివి స్వాధీనతా స్వత్వమును (Right of Control) వాంఛించుచున్నవి.

హిందూదేశమున కుండవలసిన ధనపు మొత్తముపై యధికారము ఒక వ్యక్తికుండుటవలన కష్టములను వివరించితిని. ప్రభుత్వమును, వ్యవహార నిర్వహణాశక్తిగల వర్తక ప్రపంచమును కోరు ధనమునుగాదు నిస్సహాయులగు 25 కోట్ల భారతీయులు గోరునది. ఈ 25 కోట్ల ప్రజల ధనావశ్యకతను గమనింపగలవారు ప్రభుత్వ సహకారోద్యమపు రిజస్ట్రారులే. వీరే హిందూదేశార్థిక

మంత్రులు. హిందూదేశమును జుట్టుముట్టియున్న యాపదలనుండి రక్షింపగలది ప్రజలకేమికావలయునో, గమనింపజాలని నాణకాధికారి (Currency Authority) గాదు; ప్రజలతో పరస్పర సంబంధముగల రిజస్ట్రారులే దానిని నెరవేర్పగలరు. చక్రవర్తిగారు తమ యుపన్యాసమున, "ప్రజాసంతృప్తిని గలిగించి, హిందూదేశముతో సామ్రాజ్య స్నేహమును బెంపొందించుటయే ఈసంఘ కర్తవ్యము"ని నుడివిరి.

" 20 సంవత్సరములకు దొలుత నమెరికా రాజ్యాంగ వేత్తయగు, W. J. బ్రయిన్ కలకత్తాకేతెంచెను. అప్పుడు పరదేశములకు వాణిజ్య శాస్త్రముల నభ్యసింప నేగుచున్న విద్యార్థులకు నుత్సాహకరమగు సలహానొసగెను. అందీతడుతన దేశజులకు "బంగరు శిలువపై మానవులను బలి నొసగవలద"ని సలహానిచ్చెను. కాని, నేడు అమెరికా దీనికి విరుద్ధముగ నాచరించుచున్నది. నేడుమరల బ్రయన్ కలకత్తాకేతెంచుచో, యువకులకు "మీరు మీదేశమును,నాదేశముమూలమున బంగరు శిలువపై బలియిచ్చుకొనబోకుడు" అని సలహానొసగియుండెడివాడు. నేడుప్రపంచమును బంధించుచున్న అమెరికా సువర్ణ సూత్రము వలెనేహిందూదేశపు రిజర్వుబ్యాంకు చట్టమును స్వర్ణసూత్రముతో ముడిపెట్టి

రైతునకుపయోగపడనిచో పైనజెప్పిన దుష్ఫలితములు గల్గక మానవు. బంగారమే పరపతికి పునాదియని బోధించు కపట నాయకుల సలహాలుగాని, క్రమముగ ప్రతిదేశమును అమెరికావద్ద బంగారము నప్పుపుచ్చు కొని, ప్రపంచమును బంధింపగల యురిలో తమకంఠ మును బిగించుకొనుచున్నది. భగవంతుడు నేడుగల 190 కోట్ల ప్రజలయు, భావిజనులయు సౌఖ్యము, దక్షిణా ఫ్రికాయందు బంగరు గనులుత్రవ్వు స్వల్పసంఖ్యాకు లగు తెల్లవారియొక్కయు, నీగ్రోలయొక్కయు శ్రమపై నాధారపడుచెనని వీరి సిద్ధాంతము. ఇట్టి సిద్ధాంతమునే కేంబ్రిడ్జి అర్థశాస్త్రవేత్తలును,దృఢనాణక సంఘము (Sound Currency Association) వారును బోధించుచున్నారు. ఇట్టిక్షుద్రమును, బుద్ధి మాలినదియునగు సిద్ధాంతము నీశ్వరుడు సృజించెనని మెదడు, హృదయముగల యే భారతీయుడును అంగీక రించునని నేనుతలంపను.

ఆహారము పునాదిగలేని బంగరు పునాది తృణ ప్రాయమే. శ్రమ పునాదిగలేనిచో, నివిరెండును నిలు వనేరవు. నీతిబద్ధమగు మానవుల శారీరిక, మానసిక శ్రమయే పరపతికిపునాది. ఇదియే, ఆడమ్ స్మిత్ నుడివినది. సామాన్యజ్ఞానముచే జూచినను వాస్తవ

మగు ప్రజాధన మిదియే. కావున హిందూదేశపు క్రొత్త బ్యాంకుచట్టము పరిశ్రమయను మూలధనమును క్రమపఱచి దేశసౌభాగ్యమును బెంపొందింప వలయును. లేనిచో నీ శాసన నియమితసంఘమును దీని శ్రమయు నిష్ఫలమే యగును.

### జాతీయ నిర్మాణము. (ని రా శ)

### రాష్ట్రీయ కేంద్ర ప్రభుత్వముల వ్యయము.

### 1924-25. లో ఒకరూపాయవ్యయమయినపద్ధతి.



1924-25 వ. సంవత్సరము నందలి నైతికార్థికాభివృద్ధి నివేదికలోని యీ దిగువ విషయములు చూడుడు.

"నూతనార్థిక విధానమువలన, రాష్ట్రీయముల ధనార్జనా మార్గములు పెరిగినవి. గాని ప్రజల యార్థిక, సాంఘికస్థితులు చక్కబడుననను నాశ యడుగంటినది. దీని జయముమీదనే, నూతన సంస్కరణముల జయమాధారపడి యుండుటచే, చాల యసంతృప్తియు ప్రబలినది. విద్యావంతులు దీర్ఘకాలమునుండి వాంఛించుచున్న ఫలమును, జాతీయనిర్మాణాది శాఖామంత్రులు జయప్రదముగ సమకూర్పలేక పోయిరి."

ప్రభుత్వపు నీలపుస్తకము ( Blue book ) జాతీయ నిర్మాతలకు, అసాధ్యమును దుర్లభమును నగు కార్యము నప్పగించితిమని స్పష్టముగనంగీకరించుచున్నది. కార్మికుని కుటీరపు విలువతో తాజమహాలును నిర్మింపుడనికోరియున్నారు. నిరాశహృదయమును బాధించును. ప్రజారోగ్యమునకుగావించువ్యయము, (పటమునజూపిన విధముగ) ఇంతస్వల్పముగనున్నంతవరకు హృదయము సంతప్తమగుచునే యుండును. ఆరోగ్యశాఖ వ్యయముకంటె, సైనికవ్యయము 28 రెట్లధికము. రక్షకభటవ్యయము, విద్యా వ్యయముకంటె రెండు రెట్లధికము.

సైనికవ్యయము కావలసినదానికంటె నెక్కుడుగాదని నేను నుడువకున్నను, మానవుల దేహపాటవమును, శారీ తముమీాది నిర్మాణపు తీర్మానమును, సువ్యవస్థితము లుగ, సుదృఢములుగ నుండవలెనన్న, హిందూదేశా ర్థికమంత్రులు, "మాంటిశాస్త్రి"వంక కెంతమాత్రమును మరల జనదు.

జూదగాండ్రు.

1925-26 వ సం॥ పు నీలపుస్తకమున (Blue Book) 'నైతికార్థికముల'ను శీర్షికతో హిందూదే శార్థికమును గూర్చి యిట్లువ్రాయబడెను.

"హిందూదేశ కల్యాణమును, తన్మూలమున గలుగు ప్రభుత్వార్థికస్థితియు వాతావరణ స్థితిపై ప్రధా నముగ నాధారపడి యుండును. హిందూదేశమును బాగుగ నెఱుగనివారు సైతము హిందూదేశప్రభుత్వపు టాదాయవ్యయ పట్టికను, 'వర్షమందలి జూదముగ'దెలి యగలరు. దీనినిగమనించి ప్రభుత్వముసూక్ష్మదృష్టితో, తన విధానమున కొంతమార్పు గావించుకొని వ్యవసా యమును, రాకపోకలను, రైళ్ళనుఅభివృద్ధిగావించినది. ఇట్లే జూదమునకు జ్ఞానమును, దూరదృష్టియు నపేక్ష ణీయములయ్యెను. అయిన నీయాటయందు వాతావరణ మగ్రస్థానమును వహించుటచే, హిందూదేశ ప్రభుత్వ

మును, రాష్ట్రీయప్రభుత్వమును, నదియొసగు పేక ముక్కలతో తమయాటను నిర్వహింపవలసి వచ్చెను."

ఈ 'వర్షమందలి జూదము'నకుతోడు, హిందూదేశము నేడు 'బంగారుజూదపు' వినోదమునకు పాల్పడినది. ఇదియును దానికి తగినంతధనము నొసగనిచో, నది విన్ స్టన్ చర్చిల్ వంటి Bookie వంకకును, కలకత్తా (Totalisater) వంకకును, సైమన్ ట్రస్టు(Trust) వంకకును మరలునని భావించెద. ఈ కొంటెతనము స్తంభించుకాల మాసన్నమయినది. దీని కాధారము ఆ నీలపుస్తకము(Blue Book) నుండియే చూపెద. అపుడపుడు కాలవర్షములు లేకపోయినను హిందూదేశమున బడు వర్షపాతము, దానిదాహము దీర్చుటకును, ఆహారమును సమకూర్చుటకును బాగుగచాలును. నీలపుస్తకము (Blue Book) 269వ పుటయం దిట్లున్నది. '1924-25 వ సంవత్సరమున స్వదేశ సంస్థానములలో గాక, 2.72కోట్ల యెకరములు హిందూదేశమున నీటిచే సాగుచేయబడెను. ఇది దేశములోని పంటనేలల వైశాల్యమున, నూటికి 12.4 వ వంతు అయియున్నది. 1922-23 లో 2.85 కోట్ల సేద్యమయ్యెను. ప్రధానములగు కాలువలయు, బోదెకాలువలయు పొడవు 67,000 మైళ్ళు. ప్రభుత్వపు కాలువల నీటివసతిచే,

దేశమునకు లభించిన పంటలవిలువ 152 కోట్లు. 1924-25 వ సంవత్సరాంతమునకు వ్యవసాయ జలాధారములకును, పడవల రాకపోకలకును ప్రభుత్వము వసతుల నేర్పరచుటకు వ్యయపరచిన మొత్తము 93.58 కోట్లు. అసలు ఆదాయము 10.85కోట్లు. కార్యనిర్వహణమునకయిన వ్యయము 4.03 కోట్లు. కాబట్టి ప్రభుత్వము వ్యయపరచినమూలధనముపై, నికరాదాయము నూటికి 7.29 వంతున లభించెను. కాని, జలాధారముల సాగు హిందూదేశమున, కాలువలతోడ నేగలదని తలంపరాదు. బావులెప్పుడును హిందూదేశ వ్యవసాయ జలాధారములలో ప్రధానములుగనున్నవనియు, నుండగలవనియు భావింపవలెను. 1924-25 లో ప్రభుత్వము 1879 బావులుత్రవ్వెను. అందు 1293 ఉపయోగకరములయ్యెను. గత సంవత్సరమున 1763 త్రవ్వగా 1243 ఉపయోగకరము లయ్యెను. ఎడ్లతోగాని, మనుష్యులతోగాని పనిజేయ ననువుపడు పంపులత్యావశ్యకములు. ఈవిధానమున గొంతవృద్ధిగావింపబడెను. గాని, దీనిని ప్రభుత్వము ధ్రువపఱచి, మూలధనముగాని, పరపతిగాని యొసగనిదే యెక్కుడు వృద్ధిబొందవు" కాబట్టి, పరపతిలోపమే, నీటిలోపమునకును, ఆహారవిద్యల లోపమునకును, పశువులు, ప్రజలు చాలినంత

భోజనములేక బాధపడుటకును, ప్రభుత్వశాఖలు ధనములేక సక్రమకార్యముల గావింప లేకుండుటకును మూలకారణమనుట వాస్తవము. పరపతిలేక ప్రజలు గర్భదరిద్రులై బాధల ననుభవించి, మలమలమాడి మరణించుచుండగా ప్రభుత్వము కాగితపు ధనమునైన నచ్చొత్తించి యేల యొసగుటలేదు? సమష్టి మూలధనాగారములు (Joint Stock Banks) కొలదిమంది ధనసహాయముచే నిత్యము కోట్లకొలది ధనము నుత్పత్తి జేయుచుండగా, దేశీయసౌభాగ్యము, వెండిబంగారములు బ్యాంకుల ధనముగల ప్రభుత్వము, శారీరక, మానసిక బలములు గల ప్రతివ్యక్తియు నాహారోత్పత్తికిని, జీవితావశ్యకములకును పాడుబడుటకు వలసిన పరపతి నేల యుత్పత్తిచేయగూడదు? ఈజూదరు లింగ్లీషుబ్యాంకు గావించు పౌనును, 8,9 పౌనులుగ మార్చు యుక్తిని గాని, కౌరవ్యులగు ప్రజలను మాన్యమగు ధనముగ మార్చిన స్కాచ్ వారి జూదమునుగాని, నేర్చుకొన నేల యత్నింపదు? ఈ పరపతి నుత్పత్తిజేయుటకు నూటికి ఒక రూపాయమాత్రమే వ్యయమగును. కాని ఈపరపతి, ప్రజలకు నూటికి 160 వంతున పంటలను, ప్రభుత్వమునకు నూటికి 7.29 వంతున వడ్డీని ప్రతివత్సరమొసగుచున్నదని నీలపుస్తకము (Blue Book) నుడువు

చున్నది. ఇంతవిపులముగ గల్పించుచున్నను జూదరులు గమనింప జాలకున్నారు. ఒకరూపాయి వ్యయమగు కాగితముతో రు 1600 విలుగల ధాన్యము ప్రజలకును, 72-9 రు ప్రభుత్వమునకును ప్రతి పదిసంవత్సరములకు లభించును. అనగా రు 16000 ధాన్యము రైతులకును, 729 రు. ప్రభుత్వమునకును నూరువత్సరములలో లభించును. ఇంతకంటె జూదరులు వాంఛించునదెద్ది? ప్రభుత్వము దీనిని వాంఛింపకున్నను, ప్రజలు తప్పక వాంఛింతురు. కావున ప్రజా ప్రతినిధులు శాసనసభలయందు దీనిని ప్రాతసంస్కరణముల మూలమునగాని, నూతన సంస్కరణముల మూలమునగాని తప్పక ప్రజలకు లభింపజేయుదురని నా విశ్వాసము. నేను వక్కాణించువిషయమున మంత్రముగాని, జూదముగాని లేదు. ఇది చక్కని ధనవిధానమును, లోకవిజ్ఞానమునై యున్నది. ధనము నుత్పత్తిగావించునది రొక్కముగాని, పరపతిగాని, వెండి బంగారములుగాని, బ్యాంకు నోట్లుగాని కానేరవు. ఇవి దేనిని నుత్పత్తి జేయజాలవు. భగవంతుడు మానవుల శారీరిక, మానసికబలములతో సర్వసాంఘిక, భౌతికభాగ్యములను సృష్టించును. కాని తప్పుడుసిద్ధాంతములపై స్థాపింపబడిన బ్యాంకువిధానము, మానవునియొక్కయు, భగవంతునియొక్కయు మార్గ

మునరికట్టును. నిరుద్యోగమును గలిగించునట్టియు, నాహారము, వస్త్రములు బాటలుమున్నగు వానికొఱకు కృషి సలుపదలచువారికి పని గల్పింపజాలనట్టియు, బసీల్ బ్లాకెట్ బ్యాంకువిధానము హిందూదేశమును రక్షింపజాలదు. దీనివలన హిందూదేశమునకు ప్రయోజనమును లేదు.

తెల్లచొక్కాలు (White Shirts)

బాల్డ్వికన్య రచియించిన 'ముసోలినీజీవితము'ను పఠించినచో 5 సంవత్సరముల స్వల్పకాలములో 'నల్ల చొక్కాల' సాయముతో నొక వ్యక్తిగావించిన కార్యమున కాశ్చర్యపరవశులమగుదుము. హిందూదేశపు గవర్నరుగాని, రాజప్రతినిధిగాని, 5 సంవత్సరములవరకుద్యోగము నందుండును. ఇంతకాలములో ముసోలినీ తన 'నల్లచొక్కాల' సాయముతోనొక నూతన నిర్మాణ విధానమును సంయుక్తరాజ్యమును (Corporate State) నిర్మించి యిటలీని పునరుద్ధించెను. బాల్డ్వికన్య 'సంయుక్తరాజ్యమును-దానివిధానమును'గూర్చి యిట్లు నుడివెను.

"ఇటలీలో కార్యాచరణమునకు గడంగిరి. ఇటలీ దేశీయులు, ఉత్పత్తినిర్మాణములుగావించి, నూతనవిధానములు కనిపెట్టుటయందు, ఆటలయందు ప్రపంచశాస్త్ర

కర్తలతో బాటు ముందునకునడచుచున్నారు.(Fascism) ఫాసిజము దీనినంతను గావించినది. వీరినినడపుశక్తిలేని చో-ఇట్టిసుస్థిరశక్తిసంపన్నుడు లేనిచో, నేడుఇటలీ ఎట్లుండెడిది? వీరికి వ్యతిరేకులు చాలమందిగలరు. ఏపక్షము నకును జెందనివారును గలరు. వీరు ముసోలీనీ చాల నిరంకుశుడనియు నితనిస్థానమున మరియొక పక్షము ప్రభుత్వము వహించుననియు, నందువలన దేశము పూర్వమువలె శృంగారమయమై కఠినశాసనములులేక దేశీయులకు స్వేచ్ఛనొసగుననియు, భావించిరి.

"కాని ముసోలినీ నిరంకుశాధికారియై విచ్చలవిడిగా సంచరింపలేదు. అట్లొనరించియే యుండినచో, నతడుదీనిని గ్రహించిన వెంటనే వెనుకకుమరలెడివాడే. కమ్మరివాని పుత్రుడగునీతడు, రాజభవనమున నుద్యోగగౌరవములను 50 సంవత్సరములనుండి పొందజాలని ప్రభువంశీయులను గౌరవస్థానమున మరల ప్రతిష్ఠించెను. ఆయన యధికారమునకు రాకపూర్వము విత్తమునకు బిరుదములుగొన్నవారు సయితము, దర్బారులలో సార్వభౌముని వెంట సమాన గౌరవముతో నడచుచుండెడివారు. ఇది నేడు మార్పు జెందెను. ఏమేని విలువగల సభ్యులున్న కుటుంబము నేడు సన్మానింప బడుచున్నది. రోమను రాజ పుత్రుని

రోము గవర్నరుగ నాయన నియమించి, ప్రజలును, ప్రభువంశీయులును, ప్రాచీన ప్రతిష్ఠను నిలువబెట్టునట్లు చేసెను. "ఒక నావికా యంత్రజ్ఞుడు నూతననావికా సంచాలన విధానము గనిపెట్టెనని యాయనయెఱింగెను. అతనిని తనవద్దకు రావించి, దానిని గ్రహించి, ఆయన పేదవాడగుట నెఱింగి యాతని విధానము కొనసాగింప విరివిగ ధనసహాయము మొనరించెను. తత్ఫలముగ వేగవంత మగుస్టీమరు ఇటలీకిశీఘ్రమున సమకూడగలదు. ఈస్టీమరు గంటకు 40 మైళ్ళ (Knots) వంతున ప్రయాణము గావించి, ఇటలీనుండి న్యూయార్కునకు 4 దినము లలో చేరగలదు. ఇది (Roma) రోమాఅనునావకంటె కొంచెముచిన్నదిగనున్నను, సముద్రమున నతివేగముతో ప్రయాణము గావింపగల్గదు.

"(Fascist) ఫాసిస్టు ప్రభుత్వము ఎవ్వరును ఊహింపని యుత్సాహము నిటలీయందు ప్రబలజేసెను. 40 జిల్లాలకు (నీటివసతినొసగు) అపులియన్ కాలువను (Apulian Aqveduct) పదిమైళ్ల నిడివిగలిగి గంటల కొలది రైలుపయనమును దగ్గించు ఫ్లోరెన్సు, బోలగ్నాల మధ్యకట్టిన పెద్దసొరంగమును ఈయన నిర్మించెను. రోమునకును, నేపుల్సునకును మధ్య రెండుగంటల పయనము తగ్గించు క్రొత్త రైలుమార్గమును నిర్మించెను.

ముగ నుండునట్లు ప్రోత్సహించెను. సంయుక్తప్రభుత్వము (Corporative Govt.) బాల్యావస్థయందున్నను, చాల జయప్రదముగ నిర్వహింపబడినది. ఇది ప్రథమమున ముసోలినీచే నిర్వహింపబడుటచే ముసోలినీ సంయుక్త ప్రభుత్వము (Mussolini Corporative Govt.) అని పిలువబడుచున్నది. ఇది సక్రమ ప్రభుత్వముగాని-చో మార్పు గావింపబడును." కార్మికులకు సంఘములు స్థాపింపబడినవి. విజ్ఞాన కార్యకర్తలయు, కవులయు, వైద్యులయు, న్యాయవాదులయు, ఇంజనీయర్లయు సంఘములు వేరువేరుగ గలవు. వేరువేరు కార్యముల గావించు కార్మికులకు వేరువేరు సంఘములు గలవు. మొత్తముమీద 55 సంఘములు స్థాపింపబడెను.

ఈ 55 సంఘములలో Fascists స్వాధీనమున Corporation of Antiquaries ఒకటి గలదు. ఇది తక్కువ విలువగల వస్తువుల నెక్కువ విలువకమ్మనీయకుండ జూచుచుండును. చిత్రకారులకుగూడ సంఘములు గలవు. కాని వీరు ప్రాచీన చిత్రముల ననుకరించి, వానినే మూలచిత్రములుగ నమ్మించుచో శిక్షింపబడుచుండిరి. ప్రతివృత్తివారికిని ప్రత్యేకసంఘములు గలవు. గోడలుగట్టువారు, కమసాలులు, వెండి బంగారు రాగి

యిత్తడుల కరగించువారు, పింగాణీవస్తువులుచేయువారు, ముత్యములు, మణులుచేయువారు, అమూల్యరత్నములు సానబెట్టువారు, గడియారములు చేయువారు, కత్తెరలు చేయువారు వివిధసంఘములుగ నుండిరి. చలువరాళ్లను జేయువారు, గ్లాసులుచేయువారు, తోళ్లవర్తకులు, జరీవర్తకులు, మొదలగు వివిధవృత్తుల వారికి ప్రత్యేక సంఘములు గలవు. (ప్రాచీనహిందువుల గ్రామపాలనము నెట్లుపోలియున్నది ! ) ఇవి 14 వ శతాబ్దిలోని సంఘములవంటివి."

ఈ ప్రతిసంఘమునకు నొకమంత్రి యుండును. సంఘములు తమకార్యవిధానములను, లోపములను, నాయకుల మూలమునగాని న్యాయవాదుల మూలమునగాని ఆయా మంత్రికి విశదపరచుచుండును. ఇందు వలన నంతఃశాంతి ప్రబలును. సమ్మె లంతమొందును. ఎపుడేని, యేదేని కార్యమునందు కష్టములు, చిక్కులు తటస్థించినపుడు, కార్మికుడు తన నాయకుని కడకేగి, తనకష్టములు చెప్పుకొనును. వెంటనే, వాని యజమానిని పిలిపించి, యొక ప్రత్యేకసంఘము న్యాయమును విచారించును. అంతవరకును కార్మికుడు పనిని చేయుచునుండవలెను. యజమాని వానికి కూలినొసగుచుండవలెను. అట్లు కార్మికులు రక్షింపబడుటయు,

యజమాని తనపనికి మధ్య భంగములేకుండ రక్షింప బడుటయు, జరుగును. ఇట్లు, రైతును, కూలివాడును, ఉభయులును వారివారి యాపద్దశలందు రక్షణనొందుదురు. ఇంతకంటె దేశము వాంఛించున దేమున్నది?

ఈ సంయుక్త ప్రభుత్వము (Corporation Govt) ముసోలినీ వాంఛించినట్లు, సహకార ప్రభుత్వలుగ మారును. అనగా నేటివలె నొక్కొక్క జిల్లా నుండివచ్చు ప్రతినిధులతో గాక యొక్కొక్క వృత్తి నుండి యెన్నుకొనబడు ప్రతినిధులతో సభయేర్పడును. (Chamber of Deputies).

"పిండికొరకు పరదేశములకు ధన మెక్కుడుగ నొసగబడుచుండెను. రొట్టె, జంతికలు (Macaroni) ప్రజల ప్రధానాహారము లగుటచే, ప్రజలకుమారకపు ధరలు గమనించుట కష్టముగాన, ప్రభుత్వమే వీనిధరలు నిర్ణయించు చుండెను. ప్రజాసౌకర్య లాభములకు, ముసోలీని, రాజుసహాయముతో పంటల యుత్పత్తికి తోడుపడుచుండెను. ఎక్కువ సాగుబడిగల క్యాంపనా రోమనా, యను ప్రదేశమున రాజును, ముసోలీనియు కలిసి ప్రథమమున స్వయముగ చేలను దున్నిరి. పంటలువిరివిగ పండుటచే, జీవితావశ్యక పదార్థముల ధరలు మిక్కిలితగ్గిపోయెను. తమసొంతపిండిని తయారుజేసికొన

గలుగుటకు దోలుత, ప్రజలు, గోధుమ, మొక్క జొన్నల పిండి కలిపి రొట్టెలు చేసికొని, క్లుప్తజీవితమును గడపిరి. ఈరొట్టె లందముగ లేకున్నను, చక్కనియాహారమయి ప్రజారోగ్యము నభివృద్ధిగావించెను. మునిసిపలిటీయు, రాజును, స్వయముగ పంటలుగోయుటకు సాయపడిరి."

దీనిని జదివినమీాదట, హిందూదేశ రాజప్రతినిధి, 'నల్లచొక్కాల' తో గాక, 'తెల్ల చొక్కాల' సాయముతో నిట్లు గావింపజాలడాయని భావించితి. 'నల్ల చొక్కాల' పిలుపు 'మనకు' అనియే. 'తెల్లచొక్కాల' పిలుపు 'మనదేశమునకు' అని యుండనగును. 'నల్ల చొక్కాలు' కత్తినిధరింపగా, తెల్లచొక్కాలు కలమునే ధరింపనగును. కత్తికంటె కలమే గొప్పదికాన ఇటలీయువకుల వలెనే జ్ఞానసంపన్నమగు భారతీయ యువకబృందమున కవకాశ మొసగుచో తమ మాతృభూమికి సాయ మొనరింపజాలదా? యుద్ధములకువలె, శాంతమునకును పవిత్రతా విజయములుగలవు. కావున, 'తెల్లచొక్కాల' శాంతిసైన్యముతో సాహుకారుల తోడను, దారిద్ర్యాజ్ఞాన క్షుద్బాధలతోడను, ఇర్విను ప్రభువు యుద్ధమొనరింప జాలడా?

సంయుక్తప్రభుత్వము (Corporative Govt) మూలధనమును వేరు వేరుగ నుంచును. కాని, సహ

కార ప్రభుత్వము మూలధనముగ మార్చి యైక్యమొనరిం చును. సంయుక్త ప్రభుత్వము పశుబలముపై నాధార పడియుండును. సహకార ప్రభుత్వము నేడు ప్రపంచము వాంఛించు చుండిన, 'విశ్వాసము' పై నాధారపడి యుండును. వాస్తవమునకు, ముసొలినీ స్థాపింప ప్రయ త్నించుచున్నది సహకారప్రభుత్వమునేయని బోర్డుకన్య నుడివెను. కాబట్టి ఇర్విను ప్రభువు తెల్లచొక్కాల సాయముతో ముసొలినీకిని అతని నల్లచొక్కాల వారికిని మార్గదర్శకుడుగ నుండజాలడా?

శాంతిసైన్యమునకు చెల్లింపవలయు ధనము వచ్చు స్థానమును జూపియుంటిని. ఆర్థికమంత్రులు వినాశ కరములగు యుద్ధములకు కోట్లకొలంది ధనమును వెచ్చించుచున్నారు. కాబట్టివారు శాంతినిర్మాణకార్య మునకుగూడ కొలదిలక్షల ధనమును వ్యయపఱుప వలెను. ఈధనము [వెండిబంగారులు మూలముగగల] రూపాయ నోట్లసాయముతో ఫలవంతమగు రైతుల శ్రమయందును, విజ్ఞానవంతుల మేధస్సునందును లభిం పగలదని నుడివియుంటిని. దీని నుత్పత్తికార్యములకు వినియోగించినచో, నిది వెండి బంగారములను స్వాధీన పరచుకొని, ప్రజలను ప్రభుత్వమును ధనవంతముగా జేయగలదు.

ఈ 'తెల్లచొక్కాల' జీతములకు కేంద్రరాష్ట్రముల కరువునిచ్చుచు దానిపైవచ్చు [నూటికి సం॥ రు 5.] వడ్డీని మూలధనముగ నేర్పరచి మరల నరువొసగుచు దానికి వినియోగింపవలెను.

అప్పుడు బ్యాంకులు తమ భాగస్వాములకు నూటికి పదునాలుగంతున లాభమును, వెలుపలపెట్టుబడిదారులకు వడ్డిని చెల్లించు నవసరము నుండదు. అపుడు 'తెల్లచొక్కాలు' చొక్కాలులేని తమ వేనవేల సోదరుల కుద్యోగముల గల్పించును. కావున, నిర్వాను ప్రభువు తెల్లచొక్కాలకు తమ మాతృదేశపునరుద్ధారణమున కవకాశ మొసగవలెను. కాగితముమీది విధానముకంటె, స్వస్థమగు మానవజీవన నిర్మాణము కడుంగడు శ్రేయస్కరము.

సామ్రాజ్యపుకీలు.

ఒకతూరి కర్జను ప్రభువు కలకత్తాను ప్రాగ్దేశ రత్నముగ గావించుటయే తన కోర్కెయని నుడివెను. హిందూదేశమే సామ్రాజ్యాధారముఅని తన యుపన్యాసమున నుడివెను. ఆధారము కేంద్రముననుండి, తన చుట్టును సామ్రాజ్యమును త్రిప్పుచుండును. కాని, హిందూదేశమింకను నట్టికీలుగ నేర్పడలేదు. నేడది కేంద్రముగగాక పరిధిగనున్నది. అది సామ్రా

జ్యమునందున్నను దానికి జేరియుండలేదు. తన సహ కారసంఘముల చట్టమున కర్జన్ ప్రభువు, ఈకీలుచుట్టును సామ్రాజ్యము తిరుగునట్లు గావించెను. గాని, తిరుగు చుట్లు కొలదిగనుండి చక్రము నెమ్మదిగనే తిరుగు చున్నది. ఏలయన, హిందూదేశపు 32 కోట్ల మానవులశక్తి యింకను, తేజోవిహీనముగను, శిథిలముగను, అవ్యవస్థితముగను, సహకారరహితముగనున్నది. శాసన నియమితసంఘము ఈగొప్ప మానవశక్తిని చక్కబఱచి, పరస్పరసంబంధముల గలిగించి, సామ్రాజ్యము తన బలమును, ప్రదర్శింపజేయుటకే ప్రాగ్దేశమున కేగుచున్నదా? బంగరు పునాదులుగల ధనశక్తియే, నేటి ప్రపంచపరమావధి. ఇట్లగుచో, ప్రాగ్దేశము నిర్మాణసంపన్నమైన వెంటనే బంగారమును, శక్తియు దీనివంకకు ప్రవహించును. అప్పుడు ఇంగ్లీషు బ్యాంకు (Bank of England) న కధిష్ఠింప సువర్ణ సింహాసనము లభింపదు. హిందూదేశమపుడు కీలుగ మారును. సంఖ్యయే ప్రధానమగుచో సామ్రాజ్యమాంగ్లేయులదిగాక హైందవుల దగును. కాని, బంగారమునులోగొన్న యింగ్లండు ప్రపంచపు కీలుగనుండి, దానిని బాధించుటకంటె నాబంగారము ప్రాగ్దేశముల కేగి, సామ్రాజ్యాంతర్గతమయియుండుట శ్రేయస్కరము.

## గుప్తహస్తము (Hidden Hand)

బ్యాంకు సౌకర్యమునుండి ప్రజలను వేరుపరుచు విధానమునకు నేను భారతప్రభుత్వమును దూషింపను. పార్లమెంటు, హిందూదేశపు కోటానుకోట్ల ప్రజల బాధ్యతను వహించెనుగాన, నింతకాలము నుండియు వేరుపఱచు విధానము నరికట్టనందులకు తక్క, బ్రిటీషుప్రభుత్వమును గూడ దూషింపను. ఈసామ్రాజ్యమును నడపుచున్న ధనశక్తి, 'గుప్తహస్త' మనబడు నింగ్లీషుబ్యాంకే. యన, నిది ధనప్రవాహము నరికట్టి, తన యిష్టప్రకారము నడపుచుండును. కాని, యీ 'గుప్తహస్తమును' నడపుచుండినది నిజముగ అమెరికా ఫెడరల్ రిజర్వుబోర్డే. (Federal Reserve Board of America.) నేడు 'ఇంగ్లీషు బ్యాంకు' అమెరికా మారకమునకు దలారిగ నున్నదని నుడువవచ్చును. ఈ దలారిని విశ్వసింపక, అమెరికా యీ యింగ్లీషుబ్యాంకునకు, తనధనమును సక్రమముగను, సురక్షితముగను ఋణములొసగునట్లు "సలహాదారు నొకని నేర్పాటుచేసెను.

కాబట్టి శాసననియమిత సంఘము విచారింపదగిన ముఖ్యసమస్య, హిందూదేశ కోశవిధానము ఆంగ్లకోశముచేతను, 'గుప్తహస్తము' చేతను హిందూదేశకార్యదర్శి (Secretary of State) ద్వారా నడుప

వలయునా లేక, హిందూదేశమునకు తనకోశముపై పరిపూర్ణాధికారముండవలయునా యనునది యే.

ప్రజావాంఛల నెరవేర్చు బ్యాంకు విధానమునకు హిందూదేశము చాలకాలమునుండియు వేచియున్నను, నేటివరకు నది లభింపలేదు. ఇతరదేశములు నూటికి 5 వంతున వడ్డీ చెల్లించుచుండగా, హిందూదేశ మిప్పటికిని నూటికి 50 వంతున వడ్డీని చెల్లించుచున్నది. ఒకజాతి జీవిత మీదురంతములకు బాల్పడుట, తన్నాశకారణమగును. హిందూదేశమును, దాని ప్రజలును, బ్యాంకు విధానమునకు లోబడవలెనా లేక బ్యాంకువిధానమే వారికనుకూలముగ నుండవలయునా? ఈ ప్రశ్న సులభమైనది. కావున సులభమగు సమాధానమును వాంఛించుచున్నది. ఈ సమాధానముపైననే నూతనరాజ్యాంగ నిర్మాణవిజయ మాధారపడియున్నది.

## నూతనరాజ్యాంగ నిర్మాణము.

ఇంతకాలము నుండియు నాంగ్ల ప్రభుత్వమెవ్వరి బాధ్యతను వహించెనో వారికి వలయు బ్యాంకు విధానమును గమనింపలేదు గాన (బుద్ధిపూర్వకముగ గాకున్నను అజ్ఞానమువలన) తత్ఫలముగ ప్రజలు గర్భదరిద్రులుగ నున్నారు. కావున హిందూదేశ ప్రభుత్వము, తనయొక్కయు, ప్రజలయొక్కయు, కోశ బాధ్యతను

వెంటనే వహించి, దీని కనుకూలముగ నూతనరాజ్యాంగ విధానము గావింపవలెను. కాని కష్టకాలమున (అనగా యుద్ధ సమయములలో) తక్కిన వలసరాజ్యములతో బాటు హిందూదేశము సామ్రాజ్యమునకు తోడ్పడు నట్లు నేర్పఱచుకొనవచ్చును.

చీ నా.

'పొరుగువారు పొరుగువారుగ నుండవలె'నని, రసవిహారిఖూ షాకపారి నుడివెను. నీ పొరుగువారు నీకంటె బలాఢ్యులుగనుండినపు డిది యత్యావశ్యము. చీనా విప్లవములనుండి బయటబడ జూచుచున్నది. అది సబలముగ నుండుటకును, యుద్ధానంతరము బలహీనత నొందిన తన రాజ్యాంగ విధానము బలపడుటకును (ఒక పుష్టికరౌషధము) రజిత లేహ్యము నపేక్షించు చున్నది. తన పొరుగువానినుండి యిట్టి రజితలేహ్య మును సంపాదించుకొనజాలనపుడు సముద్రమార్గము మూలమున బంగారమును స్వీకరించును.

శత్రుబృందమధ్యమునుండి బయటపడిన వెనుక బంగారు ప్రమాణమును నిర్ణయించుకొనుచో, చీనా, అమెరికావారి బంగారమును బదులు తీసికొనక తప్పదు. అందుపై రెండువిషయములు సంభవించును. మొదటిది అది తన కంఠమున కమెరికా యురిత్రాటిని తగిలించు

శించుట. రెండవది అట్లుగావించుటవలన యూరపు ఖండ కంఠమున నేడున్నయురి మరింత బిగియుట. ఏలయన, చీనా, ప్రాగ్దేశమువంకకు బంగారము నెక్కుడుగ ప్రవహింపజేయుటచే, కన్లిఫ్ రిపోర్టును, టంకసాల యజమానియు నుడివినట్లు యూరపున నిరుద్యోగమును, కష్టములును వృద్ధిగాంచును.

ఇట్లుగాక, చీనా వెండిప్రమాణము నంగీకరించి, తాను ఉత్పత్తివృద్ధికి ప్రకటించు పత్రధనమున కాధారమగు వెండి లేనిచో హిందూదేశమున నెక్కుడుగనున్న వెండిని ఋణమొసగి దానిని రక్షింపవచ్చును. రెండు వత్సరములలో ప్రపంచమున నుత్పత్తియగునంత వెండి హిందూదేశమున (కోట్లకొలది ఔన్సులు) నిలువ యుండుననియు, దీనినంతటిని వ్యాపారమున (మార్కెట్టున) కొసగినచో, ప్రపంచపు మారకము తారుమారై నేడు భాగ్యవంతులు భారతమున కూడబెట్టిన వెండి విలువనుగూడ తగ్గించుననియు, (Hilton Young Commission) నుడివెను. కాగితపు ధనవృద్ధి వలన ముఖ్యముగ రూపాయనోట్ల వలన, హిందూదేశ ప్రభుత్వపు వెండి విలువ వృద్ధియగును. అందువలన తన పత్రధనమునకు కావలసిన వెండిగాక మిగిలినదానిని, తన పొరుగు దేశమునకు ఋణమొసగి, దాని సంపద్

వృద్ధికి తోడ్పడినచో, శాంతి సుఖములు ప్రబలును. చీనా వ్యాపారిమాట, ఋణపత్రము (Bond) వలె విశ్వాసార్హము. చీనాతన యసంఖ్య ప్రజలకు తగిన గౌరవప్రతిష్ఠలు స్థాపించుకొని, నానాజాతి సభ్యత్వ మును బడసినది. కాబట్టి హిందూదేశము ఋణమొసగిన ధనము సురక్షితముగ తిరిగివచ్చునని నావిశ్వాసము. అప్పుడు నానాజాతిసమితితో, హిందూదేశ ప్రతిష్ఠ బెంపొంది బ్రిటిషు సామ్రాజ్యము ఇంగ్లాండువలన గోల్పోయిన విశ్వాసమును, తిరిగి సంపాదించు కొనునట్లు గావించును.

హిందూదేశము, ప్రాచీనకాలమున శాంతముగ, చీనాదేశముపై తన విజ్ఞాన ప్రకాశమును ప్రసరింప జేసినది. ఇప్పుడుగూడ తన శక్తికొలది, ప్రకాశమును ప్రసరింపజేయగలదు. చీనాకొరకును, సర్వమానవుల యెడ ప్రశాంత సద్భావములు ప్రసరింపజేయుట కును, ఈ నూతన శాసననియమిత సంఘము, హిందూ దేశమునకేగాక తన పొరుగుదేశమగు చీనాకుగూడ తోడుపడగల విధానము నేర్పఱుప నగును.

లోగడ హిందూదేశ ప్రాచీన గ్రామపరిపాలన మును గూర్చి నుడివియుంటిని. హిందూదేశ సామ్రా జ్యమున మంగోలియా జాతిచ్ఛాయలుండుటచే శాసన

నియమితసంఘము దీనిని, తన నివేదికయందు విచారింప నగును. హిందూదేశ ప్రాచీన చీనా గ్రామపరిపాలనా విధానములకు, గాఢమగు మిత్రభావముగలదు. కావున కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వములు, ఇట్టిపాలనమున వీలయినంత తక్కువగ జోక్యము దీసికొని, తమ సౌకర్య విధానములు గావించుకొనుటను, పన్నులు నిర్ణయించుకొనుటను గ్రామములకు పంచిపెట్టవలెను. *

"లియోట్జూవిధానము"(School of Lao Tzu) "క్రీ.పూ. 5,6 వ శతాబ్దులలో నీతడనుసరించిన విధానపు మూలసిద్ధాంతము వైయక్తికసహజస్వాతంత్ర్యము (Natural liberty of Individual) ఈయన సుప్రసిద్ధమగు తన "Toa Teh King" అను గ్రంథమున ప్రతి పుటయందును ప్రభుత్వపు జోక్యముండరాదని కోరెను. "ప్రభుత్వమేమియు చేయరాదు." అనగా

---

* ఈ చీనా గ్రామపరిపాలన వర్ణనము, లోగడ చీనాలోని హ్యాంకో కళాశాలయం దాచార్యుడుగను, పిమ్మట నమెరికాలోని న్యూయార్కుపట్టణమున గల చీనా సంఘ కార్యదర్శిగనుండిన కిఙా వీపా, (Ph. D.) గారి, 'చీనా యందలి ప్రజాపాలనము, కోశ విధానము' అను గ్రంథమునుండి స్వీకరించితిని. ఈగ్రంథము కొలంబియా విశ్వవిద్యాలయార్థశాస్త్ర సంఘ యాజమాన్యమున సంపాదితమగుటచే, సక్రమగ్రంథముగ భావింపవచ్చును.

ప్రభుత్వ మెంతతక్కువ జోక్యముకలిగించుకొనిన, ప్రజలంత యెక్కువ శ్రద్ధతో స్వవిషయమును జక్కబఱచుకొందు రను లిరెమొట్జుగారి సిద్ధాంతము 'ఫ్రెంచిఫిజియొక్రేట్సు' (French Physiocrates) యొక్క "జోక్యమువలదు. జోక్యమువలదు" అను సిద్ధాంతమును బోలియున్నది. ఈసిద్ధాంతము ననుసరించి యప్పటి ప్రభుత్వపు పితృభావమే రాజ్యాంగ, సాంఘిక కష్టములకు కారణమని యతడు తెలిపెను. ప్రజలు తమవిషయములు సమగ్రముగ నిర్వహించుకొనునట్లు, చాలతక్కువ జోక్యము కలుగజేసికొను ప్రభుత్వమే, యుత్తమ ప్రభుత్వమని యతడు వాదించెను.

"రాజ్యవిధానములో నిర్బంధములు, బహిష్కారములు ఎక్కువైన కొలదియు ప్రజలు గర్భదరిద్రులగుచుందురు. చట్టములు, ప్రభుత్వాజ్ఞలు పెరిగినకొలదియు, చోరులు, నేరగాండ్రు వృద్ధిగాంచుచుందురు. కావున ప్రభువు జోక్యము తీసికొనకుండ ప్రవర్తించుకొలదియు, ప్రజలు తమ సౌకర్యములు వృద్ధిగావించుకొందురు. ఆయన జోక్యము లేనిచో, వారు సక్రమమార్గముననే సంచరింతురు. ప్రభుత్వమాచరింపవలసిన కార్యములు తగ్గించినకొలదియు, వారు కష్టపడి పనిచేసి, భోగభాగ్యములు వృద్ధిగావించుకొందురు. ఆయన తృష్ణనుండియు,

నధికారమునుండియు తొలగినచో, ప్రజ లాయన నను కరించి నిరాటంకముగను, గౌరవనేయులుగనునుందురు. ఈ ప్రకటనమును బట్టి, లియోట్జూయొక్క ప్రభుత్వపు జోక్యములేని సిద్ధాంతము నిసర్గవాదుల(Physicrotes) ప్రకృతి విధానమును ( Ordre Natural ) బోలి యున్నది.

లియోట్జూయొక్క రాజ్యాంగాదర్శము, ప్రభుత్వపు టవసరమును, బాధాకరమునగు సంబాధము నుండి తప్పించుకొనిన చిన్న చిన్న తెగల స్వతంత్ర పరిపాలనా విధానమే. దీనిని గ్రామపరిపాలనమననగు. ప్రాచీనపు గ్రీసులో పురపాలనపద్ధతి యుండెనేగాని, గ్రామపాలన పద్ధతి లేకుండెను. తన గ్రంథమున నొక్కచో నీతడు ఆదర్శప్రభుత్వమును గూర్చి యిట్లు నుడివెను.

"గ్రామపాలనమున ప్రజలలో పలుకుబడిగల పెద్దలు, నాయకులుండవచ్చును. కాని వారు తమపలుకుబడిని వినియోగింపరాదు. ప్రజలు తమ గ్రామపాలనము నొక దూర ప్రభుత్వమునకు విడిచిపెట్టక తామే నిర్వహించుకొనవలెను. వారికి, ఓడలు, బండ్లు ఉండినను, వానిమీద ప్రయాణములు చేసి పరిపాలనము చేయ నిచ్ఛగింపరాదు. వారికాయుధములు, కవచము లుండి

నను, వానిని వినియోగించు నవకాశమును గలిగింప రాదు. ప్రాతకుబడులుగ వారు ప్రాచీనాచారమగు రజ్జుబంధముల నుపయోగింపవలెను. వారు మంచి యాహారమును, శుభ్రమగు దుస్తులను, నిర్మలములగు గృహములను, సౌఖ్యదాయకములగు పరిస్థితులను నిర్మించుకొనవలెను. అప్పుడిరుగు పొరుగు తెగలొకరి యింద్ల నొకరు చూచుకొనుచు, నొకరికుక్కుటశ్వాన ధ్వనులు మరియొకరువినుచు, నొకరినొకరు తరుచుగ చూడకయే వృద్ధులై చనిపోవుచుందురు."

"ఇట్లు, ప్రభుత్వపు జోక్యమునేగాక, యొకరిభూములనొక రాక్రమించుకొనుటను, సైనికబల వాంఛలను, సామ్రాజ్యార్థిక విధానములను గర్హించుచు నార్థిక నాగరకతకు వ్యాపారముకంటె వ్యవసాయము ముఖ్యమని యతడు ప్రేరేపించెను. క్వెస్నె, నీతని విధానమును, నిసర్గవాదుల (Physiocratos) ప్రాచీన చీనాదేశార్థికతత్వవిధాన మనదగును. "ప్రభుత్వసంబంధ రహిత విధానమువలనను సహకార గ్రామ ప్రజాపాలనమువలనను ప్రభుత్వపు పెత్తనము తగ్గుటచే, పన్నుల భారము నాశమొందునని యతడు భావించెను. మఱియు, ప్రభుత్వపు దోపిడినుండి ప్రజలను గాపాడుటకు గావించిన రక్షణపద్ధతులు, ప్రపంచ నిరంకుశాధికార

మును రూపుమాపి, ప్రభుత్వ వ్యయమును దగ్గించునని యతని విశ్వాసము.

ఈ రక్షణములలో మొదటిది ప్రభుత్వ నిర్వహణమునకు జేరినది. రెండవది మితవ్యయమునకు సంబంధించినది. ఇవిరెండును, పన్నులభారమును తగ్గించుట కత్యావశ్యములని యాయన భావించెను. ప్రభుత్వ నిర్వహణమునందు మితములేని వ్యయము దేశపు మృత్యువుగ బరిణమించునని నుడివెను. మఱియు నుద్యోగు లెక్కుడు పన్నులువిధించి వానిని తా మనుభవించుటవలననే, ప్రజలు క్షుద్బాధా పీడితులగుచుండిరని యాతడు నుడివెను.

ఈసందర్భమున ఫ్రెడరిక్ ది గ్రేటు(Frederick the Great) విశ్వాసమును గమనింపనగును. జాతీయ కోశ పరిమాణమును గమనింపక ఎక్కుడు పన్నులు విధించిన, నా దేశములు ఋణగ్రస్తములై దివాలా తీయునని గ్రహింపనగు. రోజర్ తన 'Finanywissenschaft' లో నిట్లు ప్రకటించెను. "ప్రభుత్వము, నాకింతగలదు. గాన, నింత వ్యయపరచెదను" అని నుడువుటకు మారుగ "నాకింత యవసరముగాన నంతధనమును పన్నులమూలముగ వృద్ధిచేసెదను" అని నుడువుచో నది దివాలాతీయును. "ఈ యిరువురు రాజ్యాంగవేత్త

లును, ప్రజలు చెల్లించు శక్తి ననుసరించి, ప్రభుత్వము పన్నులు నిర్ణయింపవలయుననియు, ప్రజలను పన్నుల భారమునుండి తప్పించుచో, పన్నులను సక్రమముగ చెల్లించుటకు వారికి నిలువధన ముండుననియును విశ్వసించిరి.

లియోట్జూయొక్క రాజ్యాంగార్థిక సిద్ధాంతములు, చీనాదేశజుల కోశవిధాన మార్గములం దెక్కుడుశక్తిని గలిగించినవి. ఆయన తనప్రజలకు ప్రభుత్వ పితృభావమునందు గర్వాణమును, "గ్రామ పరిపాలన" విధాన ప్రాముఖ్యమునందు విశ్వాసమును గలిగించెను. కన్ఫ్యూషియస్ భావములు రాజ్యాంగ విద్యావిధానములందు ఆదరణీయము లైనను లియోట్జూ విధానమే చైనాయం దెక్కువ ప్రచారమునందెను. చీనాదేశమున విప్లవానంతరము గావింపబడిన, పునర్నిర్మాణ మార్గములు ఈతని సిద్ధాంతము ననుకరించుటవలననే జయమందినవి. హాన్ వంశ చక్రవర్తియగు వెన్ను, సియూవంశచక్రవర్తియగు వెన్ను, నీ విషయమున ముందంజవైచి, ప్రభుత్వవ్యయమున మితత్వమును, సులభమగుపన్నుల విధానమును నవలంబించి, దేశమునకు పరిపూర్ణమగు నార్థికభాగ్యము నొడగూర్చిరి.

## మో టీ వి ధా న ము.

మోటీ ఆర్థికవిధానపు సారాంశము మితవ్యయమే. ప్రభుత్వ వ్యయమును నిర్ణయించుటలో 'అంతవ్యయ వృద్ధి యావశ్యకమా' ఈవృద్ధిలేక ప్రజాశాఖలు నిర్వహింపబడవా? యని విచారింపనగునని యతడు భావించెను. ప్రభుత్వము తెలివితేటలతో నిర్వహింపబడవలయునన్న ప్రజాసౌకర్యములు పెంపొందింపజాలని ప్రభుత్వవ్యయవృద్ధిని, ఉద్యోగుల వృద్ధిని తగ్గింపవలెనని యితని తలంపు. ఆతడు ప్రభుత్వ మితవ్యయమును బోధించుటయ కాక యుద్ధవ్యయమును త్రోసిపుచ్చుటయు నవసరమని యతడు చెప్పెను. సంకుచిత దేశభక్తి-సంకుచిత జాతీయతల మూలమున దటస్థించు సైన్యనిర్వహణమును మితవ్యయ విశ్వమానవ సోదరత్వముల ననుసరించి నిరసించెను. త్యాగబుద్ధితో, క్రీస్తుచెప్పిన విశ్వమానవ ప్రేమను, శాంతిని విశ్వసించి యాచరించుటచే మోటీ, 'చైనాక్రీస్తు' అని పిలువబడెను. నేడు హిందూదేశమును, ప్రపంచమును వాంఛించు బలవత్తరమును, సర్వాంగసుందరమును నగు రాజ్యాంగ విధానమును గూర్చి కిఙ్-వీషా తన గ్రంథమున నిట్లు నుడివెను.

"చీనాదేశీయుల మగు మనము నిరాశావాదుల

ముగారాదు. మన జాతీయ సంప్రదాయమును సౌభాగ్యసంపన్నముగ జేసికొనుటకు పాశ్చాత్యులనుండి మన మెక్కుడు నేర్చుకొనవలెను. కాని మన ప్రాచీనవేదాంతులనుండియు, రాజ్యాంగవేత్తల నుండియు నమితానుభవమును బడసియుండుటచే మనమెంతయు నదృష్టవంతులము. కావున మనము 'కన్ఫ్యూషియస్ మహావిజ్ఞానము' అను గ్రంథమునుండి చీనావారి ప్రజాపాలనమును, ఆర్థిక నైతికదృష్టిని తెలుపు సిద్ధాంతములను కొన్నిటిని పొందుపఱచి యీగ్రంథమును ముగింపవచ్చును."

"ప్రజలు ప్రేమించువిషయములు ప్రేమించి, గర్హించువిషయములు నిరసించునపుడే రాజు ప్రజలకు జనకుడనబడును."

"ప్రజల స్వభావముల నతిక్రమించువాడు కష్టములకు గురికాకమానడు. అనగా ప్రజలు గర్హించు దానిని ప్రేమించి, ప్రజలు ప్రేమించుదానిని గర్హించు వానికి సంకటములు తప్పక తటస్థించును."

"ఉత్పత్తిదారు లెక్కుడుగను, ఉత్పత్తిచేయనివారు కొలదిగ నుండవలెను. ఉత్పత్తియందు వృద్ధియు, దాని ననుభవించుటయందు పరిమితియు నుండవలెను. ఇది, యుత్పత్తిభాగ్యమును బెంపొందించి, క్రమముగ మితవ్యయమునువృద్ధిగావించి కోశవృద్ధిని, తృప్తిని గలిగించును." "సత్ జీవితమునుమూలము, సంపద దాని

ఫలము. మొదటిది ప్రథమస్థాన మలంకరించును. రెం డవది ద్వితీయస్థాన మలంకరించును.

"కావున ప్రభుత్వమున కేవల మర్థలాభము దేశ కళ్యాణముగ సంభావింపరాదు. దేశకళ్యాణము సాంఘిక ధర్మముల మీదను, న్యాయార్జిత కోశముమీదను నాధారపడియుండును." రస్కిన్ గాని గాంధిమహాత్ము డుగాని దీనినే నుడువుదురు. విల్కిన్ సన్ గారి భగవ ద్గీతానువాదమునకు వారన్ హేస్టింగ్సు తొలిపలుకు వ్రాసినపుడు, పై భావమే యతనికి స్ఫురించెను. "కంపెనీ తన శాశ్వత రాజ్యాధికార ప్రతిష్ఠాపనకు తనసేవకుల సమర్థతపైగాక, వారి న్యాయజీవితము మీదనే యా ధారపడి యుండవలయును."

చీనాదేశీయ పాలనావిధానము సహకార పద్ధతి పై నున్నపుడే, చీనా యొక దేశముగ నిర్మింపబడును. సహకారము నేడు నామమాత్రావశిష్టముగ నున్నది. ప్రపంచమునకు సహకారవిధానమున, మార్గదర్శకము గనున్న హిందూదేశ మీ విషయమున నెక్కుడు కృషి గావించి, నేడు చీనాకు మార్గదర్శక మగుగాక.

## హిందూ దేశ న క్ష త్ర ము.

ఇదివరకు, సామ్రాజ్యమున కార్యసాధనమునకు గడంగి, బ్యాంకువిధానమును హస్తగతము గావించు

కాని, కృషిగావింపుమని హిందూదేశ ప్రభుత్వమును వాంఛించుట ధన మొసగుమనిగాదు. ప్రజల సొంతధన మగు శ్రమను, సద్వినియోగ పఱుచవలెను. "మున్నూటరువది నాళ్లును ప్రజలొనరించు శ్రమయే, వారికి సంవత్సరము పొడుగునను వలయు సమస్తానుకూలావశ్య వస్తుసంతతుల నిచ్చు మూలధనము" అను 'వెల్తుఆఫ్ నేషన్సు' భావమును ప్రభుత్వము గమనింప వలయు ననియే నా యభిమతము. ప్రభుత్వ నాణక సంఘములు (Royal Currency Commission) ఏమిను డివిసను, శాసననియమిత సంఘము లేమిగావించినను, హిందూదేశ, శారీరిక, మానసిక శక్తులు తప్ప మఱి యేయితర శక్తియు గాంధిస్థానమును నిర్మింపజాలదు. మఱియేయితర కోశవిధాన మయినను, ఎన్నికల హక్కుల మార్పుల యినను సరియే హిందూదేశమును దారిద్ర్యగ్రస్తము గను, నిర్మాణ రహితముగను, సంఘీభావ శూన్యము గను నుంచి దాని విశాలమందిరమున సంపూర్ణముగ నిర్మించి, దానిపై పోగుబెట్టియున్న యిటికలను నలువైపుల జిందరవందరగ బాఱవేయును. పాశ్చాత్యక పు టెన్నిక హక్కులు తృష్ణను బెంపొందించును. కొలదికాలముక్రిందట నింగ్లీషు పార్లమెంటు, హిందూదేశమున కొసగిన యెన్నికహక్కులు హిందూదేశము నెక్కుడుగ

విభజించి, కలహామునకు కారణములైనవి. హిందూదేశ మాహారమును వాంఛించుచుండ, నెన్నిక హక్కుల నొసగుట, యీతగానికి బలకరమగు నాహారమునీయక మెడకు ఒక బండగట్టినట్లుండును.

మానవుల శారీరిక, మానసికశ్రమయే వాస్తవమగు ధనము-నిర్మాణము-గావించుశక్తి. ఈధనమే మానవదృక్పథమున సాంఘిక, భౌతిక సౌభాగ్యములు పెంపొందించు సంపత్తి. మనచే మూలధనమనబడు వెండి బంగారములు, నోట్లు, చెక్కులు, ఆదాయములు, బ్యాంకునిలువలు, ఖాతాలు మున్నగునవి దేనినిసృష్టింపజాలవు. ఇవి నామమాత్రములగు మూలధనములు. సజీవమగు మూలధనము మానవులే. ధనమన్ననో నిర్జీవమగు మూలధనము. కావున నిర్జీవములు, సజీవుల బరిపాలింపవలసినదేనా? సజీవులు నిర్జీవములకొఱకు వేచియుండవలసినదేనా? కాన నేడు హిందూదేశము వాంఛించు నూతన రాజ్యాంగనిర్మాణము, పాశ్చిమ దేశముల సాహుకారుల హస్తములనుండి దానిని తప్పించు క్రొత్తబ్యాంకు నిర్మాణవిధానము.

ప్రజల శ్రమయే వారిధనము. దీనిని ధనరూపముగ బరిణమింప జేయుమని ప్రభుత్వమును గోరెడి కోరిక బ్యాంకులు తమనిత్యలాభములతో గావించు

చున్నదానికంటె భిన్నముగాదు. 'సోమరిగ ధనము పడి యుండుట మానవశ్రమ సోమరిగ పడియుండుటయే' అని సర్ బెసీలుబ్లాకెట్ నుడివెను. కాని 'మానవుల సోమరితనము, ధనపుసోమరితనము' అనుట మిక్కిలి సత్యము. పట్టభద్రుని విజ్ఞానశక్తిని, రైతు శారీరిక బలమును సహకార పద్ధతిమీద నిర్మించి, ధనరూప ముగ మార్పుమని ప్రభుత్వమును కోరుట, భగవానుడు ప్రసాదించిన జీవశక్తిగల యీధనమును, ప్రజలు విని యోగించుకొనునట్లు గావించి, ప్రజలకును, దేశము కొఱకును నుపకరించు నాహారముగ మార్పుమనియే. దున్నుచుండగా బంగారు నవరసుగానీ, పంటలు కోయు చుండగా బ్యాంకుచెక్కుగానీ, సర్ బెసీలు బ్లాకెట్న కెన్నడైన దొరకునా? ధాన్యము నుత్పత్తిజేయువాడు మానవుడుగాని ధనముగాదని గ్రహించుటకు ఆడమ్ స్మిత్తుగారి అర్థశాస్త్ర విజ్ఞానముగాని, జాక్లాగారి కోశవిజ్ఞానముగాని యనవసరము. ఇందులకు ఒక ఔన్సు బుద్ధిగానీ ఒకచటాకు తెలివి తేటలుగాని చాలును. రెంటికి రెండు కలిపిన నైదగుననుటకును మొదలే లేని బంగారుపై, నాణెపువిధాన మాధారపరచుటకును అసా ధారణ ఆర్థికవిజ్ఞానమవసరము. నేటి పాశ్చాత్యకోశ విజ్ఞానవేత్తలు, అమెరికా బంగారు డాలరుపై నాధార

పడియుండుడని ప్రపంచమునకు బోధించుటకే వినియోగపడుచున్నారు. ఇది "సూదిమొనపయి నెంతమంది దేవతలు నిలువగలర"ను ప్రాచీనలోకోక్తిని స్మృతికి దెచ్చుచున్నది.

ప్రభుత్వము "నచ్చాచ్ఛాత్తింపుమ"ని కోరిన కాగితపు నోట్లన్నియు తిరిగివచ్చుటయే గాక, ప్రజలకెక్కుడు పంటలు నాహారము నిచ్చి, ప్రభుత్వమునకెక్కుడు పన్నులను దెచ్చును. అవి, తమ్ముబలపఱచుకొనుటకు హిందూదేశములోని యెక్కుడు బంగారమునాకర్షింపగలవు. ఇవి, ప్రజలను, ప్రభుత్వమును భాగ్యవంతములుగ నొనరించి, ఆడమ్ స్మిత్తు బోధనల సఫలమొనరించును. సర్. బేసీలుబ్లాకెట్‌నకిది సంతృప్తికరము కాకపోయినను ప్రజలకు సంతృప్తిదాయకమే. ఈ బ్యాంకు విధానము సులభమును, చక్కనిదియునై యుండి, చదువురానివారికి సయితము సులభముగ బోధపడును. కాని కమీషనుచే, ప్రకటింపబడిన యీక్రింది విధానము, పట్టభద్రులకు గూడ నర్థమానాయని నా సంశయము.

( P + N ) కంటె X యెక్కుడుగ నుండినపుడు, సెంట్రలు బ్యాంకునుండి బంగారమును తీసికొని, యితర దేశములకు పంపుదురు.

(P—N) కంటె X తక్కువగనుండినపుడు, బంగారమును దిగుమతిగావించుకొని, సెంట్రలు బ్యాంకునకు విక్రయింతురు.

(P+N), (P–N) ల మధ్య X ఉండినపుడు-అనగా మారకపు విలువ 'బంగారపుటంశముల (Gold Points) మధ్యనున్నపుడు ధన నిమిత్తము మాత్రమే, వ్యక్తులు బ్యాంకు నుండి బంగారమును స్వీకరించుటగాని, బంగారమును దిగుమతిజేసికొని, బ్యాంకుల కమ్ముటగాని లాభదాయకము గానేరదు.

10. బంగారపుటంశములివి:—

$$\left.\frac{\text{రిజర్వ్ బ్యాంకుఅమ్మేధర (లండన్)}}{\text{ఇంగ్లీషుబ్యాంకుకొనుధర}}\right\} = \left.\frac{21.484375 \times 480}{4.240909 \times 180}\right\}$$

= { ఒకపౌనునకు 13.50929 రూపాయలు
ఒకరూపాయకు 17.6555 పెన్నీలు. అనగా,

$17\frac{49}{64}$ పెన్నీలు.

$$\left.\begin{array}{l}\text{రిజర్వు బ్యాంకు కొనుధర (బొంబాయి)} \\ \hline \text{బొంబాయిలో బంగారు ధర. అనగా, ఇంగ్లీషు బ్యాంకుయొక్క బంగారు ధర.}\end{array}\right\} = \left\{\frac{21.239583 \times 480}{4.297221 \times 180}\right\}$$

$$= \begin{cases}\text{ఒకపౌనునకు 13.18035 రూపాయలు.} \\ \text{ఒకరూపాయకు 18.20893 పెన్నీలు. అనగా, } 18\frac{13}{64} \text{ పెన్నీలు.}\end{cases}$$

ఇదియే అమెరికాదేశపు బంగరు మారకపు గొప్ప విధానము. దీనిని హిందూదేశము పూజింప వలెను. హిందూదేశ మీవరకే పెక్కుదేవతల పూజించుచున్నది. ఆ ముప్పదిమూడుకోట్ల దేవతలతో సువర్ణ పాదములు, మృణ్మయ శిరమునుగల యీ యమెరికా మారకపు దేవతనుగూడ కలుపవలయునా!

లండను విద్యావిధాన సభయందు సర్. అతుల చటర్జీగా (High Commissioner) రిట్లు నుడివిరి.

"నేడు హిందూదేశమున దారిద్ర్యము, అజ్ఞానము అనునవి రెండే ప్రధానసమస్యలు. అజ్ఞానమును రూపుమాపనంతవఱకు దారిద్ర్యము నంతమొందింప

జాలము. ఈసమస్య హిందూదేశము నొక్కదానినే బాధించుటలేదు. హిందూదేశ బలమే పెక్కువిషయముల సామ్రాజ్యమునకు బలముగనున్నది హిందూదేశము దుర్బలముగ నున్నంతకాలమును సామ్రాజ్యము దుర్బలముగనే యుండక తప్పదు.'

సర్ అతుల్ చటర్జీగారు వాస్తవమే నుడివిరి. అమెరికా తన 12 కోట్ల ప్రజలతో, 45 కోట్ల ప్రజలుగల యాంగ్లసామ్రాజ్యము కంటె బలాఢ్యముగ నున్నది. అమెరికా నిర్మాణ సంపన్నముగను, హిందూదేశము నిర్మాణశూన్యముగ నుండుటయే దీనికికారణము. హిందూదేశమును నిర్మాణముగావించి, దారిద్ర్యావివేకముల బారద్రోలి, గాంధిస్థానమును నూతన నాగరకతను నిర్మించుచో, నమెరికా తప్పక వెనుకబడును.

హిందూదేశ రాజ్యాంగ నిర్మాణసమస్యయే దాని యార్థికసమస్య. ఆర్థికసమస్యయే నిర్మాణసమస్య. 750,000 గ్రామములను, 32 కోట్లప్రజలను నిర్మాణ సంపన్నులుగ జేయుసమస్యను బరిష్కరించువారు విజ్ఞానధనులగు యువకులే. యువకులు సేవ సలుప నాతురులైయున్నారు. కావున'గాంధిస్థానము'ను నిర్మింప వీరి కవకాశము నొసగవలెను. 'తెల్ల చొక్కాల' శ్రమయే వీరిధనము. ప్రభుత్వమీధనము నుద్ధరింప

వలెను. ఏలయన, కార్మికులు కొలదిమంధియు, వారిచే వచ్చు ఫల మధికము నైయున్నది.

హిందూ దేశము ప్రపంచమునకు కొన్ని సందేశములనొసగవలసియున్నది. ప్రపంచమునుండియు గొన్ని సందేశముల నాలకింపవలసియున్నది. నేడు హిందూ దేశ సౌభాగ్య నక్షత్రము ప్రకాశించి, ధనముకంటె మానవుడు గొప్పవాడను సత్యముతో, ప్రపంచమును విజ్ఞానసంపన్నముగ చేయు కాలమాసన్నమైనది మరియు నేడు ప్రపంచమును బాధించుచున్న సువర్ణ శృంఖలములను, హిందూ దేశ నిర్మాణబలమే ఛేదింపగలదని లోకమునకు జూపవలసియున్నది. ప్రాగ్దేశమున నుదయించిన నక్షత్రము (సహకారార్థికవిధానము) అంధకార కూపములబడియున్న రాజ్యాంగ పద్ధతావలంబులును, ప్రభుత్వ దయాభిక్షను పాత్రులగు నిరుద్యోగులును, మృత్యుచ్ఛాయలబడువారునునగు పాశ్చాత్యులనుద్ధరించి, బొల్షివనును, ఇతరపక్షములును కోరు ఆశ, విశ్వాసము, కృషి ప్రేమల కభిముఖముగ నడచునుగాక! దృశ్యములను గాంచుటయు, కలల గనుటయు మంచిదే. 'దృశ్యములులేనిచోట ప్రజలు మరణింతురు' హైందవయువకులు ప్రాచీన హిందూ దేశమునుండి నూతన హిందూ దేశముదయమగుచున్న దృశ్యమును గాంచుచున్నారు. వారి

కవకాశ మొసగినచో, అగ్బరు స్వప్నగత సామ్రాజ్యమగు హిందూదేశమును భవిష్యత్తున నిర్మింతురు.

"గోపురమును, మసీదును, క్రైస్తవ ప్రార్థనాలయమును కాక- సర్వాంగసుందరమును, విశాలమును, నిరాడంబరమును నగు పవిత్రమందిరమును—దేవాలయమును, నిటికపయి నిటికనిడి నేను నిర్మించినట్లు కలగంటిని. ఆ మందిరము స్వర్గమునుండి వెడలు ప్రతి శ్వాస (జీవి) కు సుస్వాగత మొసగుచుండును. సత్య శాంతి న్యాయములు విచ్చేసి యందధివసించినవి." (టెన్నిసన్)

చిత్తగింపుడు,

విశ్వాసపాత్రుడు,

డి. యస్. హేమిల్టన్.

అఖిలభారత ధనాగారము (The All India Bank).

పార్లమెంటులో గావించిన తన గంభీరోపన్యాసమున చక్రవర్తిగారిట్లు నుడివిరి. "ఆకాశమునుండి యుద్ధ మేఘములు పటాపంచ లొనరింపబడుటచే, నేడు మన కార్యము లెన్నియో మనకై నిరీక్షించుచున్నవి. "మనము నిర్వహించియుండని కొన్నిధర్మములను, ముందడుగు వేయుట కడ్డుగనున్న దౌర్బల్యమును మనము స్పష్టముగ గాంచుచున్నాము."

చక్రవర్తిగారి యీ నుడువులు సామ్రాజ్యమున నితరభాగములకంటె, హిందూదేశమనునే బాగుగ నన్వయించును. వృద్ధికి ప్రధానావశ్యము, ప్రజానుకూలము నగు బ్యాంకువిధానము నిరాకరింపబడుటచే దాని యభివృద్ధి యాగినది. సామ్రాజ్యమున ముప్పాతిక భాగముగల హైందవులు నవీనార్థిక విధానమునకు నోచకుండుట భారతప్రజా కళ్యాణమునకు బాధ్యమగు నాంగ్లపాలనమునకుగాని, పార్లమెంటునకుగాని గౌరవ దాయకముగాదు. ఒకవిధముగ దేశము వృద్ధినొందినను ప్రజలెట్లు వృద్ధికివచ్చిరి ? నలుదెసల రైలుమార్గములు వ్యాపించినవి. గోగునార యంత్రములును, తేయాకు తోటలును, వృద్ధియై లాభమును వృద్ధిగావించెను. కాని కార్మికుల జీవితములు వృద్ధిగాంచినవా? బొంబాయినగరము సజీవమైనది. కాని యందలి ప్రజలకు జీవకళయున్నదా ?

గ్రామప్రజల విషయమేమి? వారు ముందడుగిడుచున్నారా లేక క్రుళ్ళి కృశించి నశించుచున్నారా? ఈప్రశ్నకు మ్యాక్లగన్ సంఘము (Maclagan Committee) ఇట్లు ప్రత్యుత్తర మొసగెను.

"నిమ్నజాతీయుల దుస్థితిని, ముఖ్యముగ విశేష సంఖ్యాకులగు వ్యవసాయదారుల దుర్దశను రూపుమా

పుచే, హిందూదేశమునగల, సహకారపద్ధతి" యొక్క ప్రధానాశయము. అనేక పాశ్చాత్యదేశములవలె హిందూదేశమున చాలభాగములందు వ్యాపారప్రయాణ సౌకర్యములు బాగుగ వృద్ధిగాంచినను, రైతులస్థితి వలసినంతగా చక్కబడలేదు. ఋణములు క్షీణించుటకు మాఱు వృద్ధిగాంచుచున్నవనియు, నెక్కువ వడ్డీలకు ధనము నొసగుట యింకను విశేషముగ గలదనియు, వ్యవసాయపద్ధతులు వృద్ధిగాలేదనియు, పురాతన గ్రామవాసుల యసంతృప్తికరములగు నార్థికవిషయములింకను శాశ్వతముగ నెలకొని యున్నవనియు గాంచనగును."

150 సంవత్సరముల యాంగ్లపరిపాలనానంతర మిట్లుండుట మిగుల గర్హ్యము. కాని యిది యథార్థము. నాయనుభవము దీనిని బలపఱచుచున్నది. కొలది సంవత్సరముల క్రిందట నొక క్రైస్తవమతబోధకుడు డక్కాలోని జనులు విషజ్వరముతో (Influenza) మరణించుచుండిరనియు, తాను వివాహముగావించిన పది కుటుంబములలో రెండు కుటుంబములు మాత్రమే మిగిలెననియు, నుడివెను. ఆయన తనశక్తికొలది ప్రజలకు సాయము చేయుచుండెనుగాని కోట్లకొలది బాధితులమధ్య నొక్కడేమి చేయగలడు? పిమ్మట రెండు మాసములకు ప్రత్తిపంట వర్షపాతముచే పూర్ణముగ

నాశనదనిమైన యతడునుడివెను. మఱిరెండు మాసము లకు మానవులకును, పశువులకును ఆహారమగు జొన్న పంట అనావృష్టిచే నాశమయ్యెననియు, ప్రజలు తమ పశువులనురు3-6 కు అమ్ముచుండిరనియు వ్రాసెను. కొనుటకు గడ్డిలేదు. ధనమంతకంటెను లేదు, ప్రజల యీసంవత్సరపుపంట తమ గొడ్లచర్మమే. పశువులు మృతిజెందినవి. ప్రజలు చావు బ్రతుకులతోనుండిరి. ఈకష్టదినముల నెదుర్కొనుటకు సాయపడు చక్కని కోశవిధానము ప్రజలకు లేదు. సాహుకారులు నూటికి 50 చొప్పున వడ్డీ తీసికొనుచుండిరి.

ఆకాలముననే సంయుక్తప్రాంతముల మఱియొక మిత్రుడు 'ప్రజలు క్రిమికీటకములవలె నశించుచుండి రనియు, వారిని రక్షించువారు లేరనియు' నాకు వ్రాసెను. ధనము లేకుండుటచే వైద్యులు లభింపరైరి. అందువలన సాయము లభింపకుండెను.

కొలది కాలముక్రిందట ఒరిస్సాలోని మయూర్ భంజ్ ప్రాంతమున పంటలు నాశమగుట నేను గాంచి తిని. మఱికొన్ని మాసముల కటకేగగా శీతకాలపు పంటలును, నూనెగింజల పయిరులును, సంపూర్ణముగ నాశమగుట గాననయ్యెను. ఈప్రదేశమున పదిమైళ్ల దూరమున కొండలవరుస గలదు. అచటి వర్షపాత

మును సక్రమముగ నరికట్టినచో రు 50-60 లక్షల వ్యయముతో 600 చ. మైళ్లు సులభముగ సాగుచేయ వచ్చును. దీనిని గావించు విధానము చాల కాలము నుండియు నాలోచనలో మాత్రమేయుండెను. ఇతర ప్రజోపయోగ విధానములవలెనే యిదియు హిందూ దేశము 'వైట్ హాలు'లమధ్య ప్రభుత్వాంగీకారము కొఱకు వేచియుండనగు. ఇట్టి సమ్మతులు ఎప్పుడు నాలస్యముగ లభించుటయు, ధనరాహిత్యముచే నాగి పోయెనని నుడువుటయు మనమెఱుఁగుదుము. ఇంతలో ప్రజలు తమ పంటలవలెనే మలమలమాడి చచ్చుటయు, పైసయుగూడ లేక తమ తండ్రులవలె తరువాతివారును మాడిచచ్చుటయు ఘటిల్లుచుండును.

సామ్రాజ్యములో హిందూదేశము కడుదీనదశ యందున్నది. ఇది విద్య, వైద్యులు, ఔషధములు, ఆరోగ్యవిధానములయందును, పంటలుతక్కువగ పండిన సంవత్సరములలో వస్త్రాహారపానీయముల యందును, జీవనోపాధికి వలయు నితరవస్తువులయందును సర్వశూన్య ముగ నున్నదని నుడువనగును. ఈయాహారపానీయ వస్త్రముల, వైద్యౌషధాది వివిధవస్తువుల సంపూర్ణా భావము ధనశూన్యతవలన-అనగా రాజ్యాంగ దోష మగు హిందూదేశము వాంఛించు బ్యాంకువిధాన

శూన్యతవలన గలుగుచున్నది. ప్రజలకు మంచి బ్యాంకు విధానమును నిర్మించుట యెవరిధర్మము? హిందూదేశ ప్రభుత్వపు కనీసమగు ధర్మము. ఏలన,

1. ప్రజలను విపత్పరంపరలనుండి సంరక్షించుట ప్రభుత్వధర్మము.
2. ఆంగ్లపరిపాలనమున కప్రతిష్ఠదెచ్చి, ప్రభుత్వమును క్షీణింపజేయు సాహుకారు విధానమును నాశమొనరించుట ప్రభుత్వధర్మము.
3. 32. కోట్ల భారతీయులకు కావలసిన పరపతిధనమును ప్రభుత్వముతప్ప మఱి యెవరునొసగజాలరు.
4. ప్రజలు గమనించి, విశ్వసింపగల పరపతి ధనరూపము ప్రభుత్వపు కరెన్సీనోటొక్కటియే.
5. ప్రభుత్వ హస్తగతమై నిలువయుండిన స్వర్ణపరిమాణము, కాగితపుసొమ్ము నిలువ, మాత్రమే ప్రజలకు వలసిన మూలధనము నొసగగలవు.
6. ఎక్కువగనున్న పంటల నితరప్రదేశములకు పంపుటకు రైళ్లను నిర్మించుట ప్రభుత్వధర్మ మైనపుడు, ప్రజలకు తమశ్రమఫలములను లభ్యపఱచు చక్కని బ్యాంకు విధానమును గావించుటకూడ ప్రభుత్వ ధర్మమే.

7. ప్రజల ధనశక్తిని నిర్మాణ సంపన్నముగ గావించి, వృద్ధిగావించు బ్యాంకు విధానము లేనంతవఱకును, మాంటేగు ఛల్మ్సుఫర్డు సంస్కరణములుగానీ మఱి యే నూతన సంస్కరణములుగానీ నిర్జీవములుగనే యుండును. మఱియు స్టేటుకౌన్సిలును, సామ్రాజ్యశాసనసభయు నిర్జీవములుగనుండి ప్రజల నుద్ధరించు శక్తిలేకయుండును.
8. దేశములో ముఖ్యవృత్తియగు వ్యవసాయమునకు ధనమునొసగు బ్యాంకువిధానము లేక దేశము వృద్ధిగాంచుట యసంభవము.

32 కోట్ల ప్రజలకు ధనసహాయము గావించు బ్యాంకు విధానమున రెండు విషయములు గలవు.
1. ఋణమొసగుట కెక్కుడు మూలధనమును 2. అప్పుపుచ్చుకొనుట కెక్కుడు పరపతియు నవసరములు.

ప్రథమమున మూలధనమును గూర్చి నుడివెద. యూరపులో బ్యాంకులు డిపాజిట్లపై నాధారపడియుండును. కాని హిందూదేశ ప్రజల మూలధనములు శూన్యములగుటచే వారికి నిలువలులేవు. కాగితపు ధనమువలన నాణెములు తొలగనంతకాలము డిపాజిట్లపై నడచు బ్యాంకుపద్ధతి వృద్ధిగాజాలదు. కావున హిందూదేశము డిపాజిట్ల పద్ధతి వృద్ధిగావింపవలెనన్నచో, వెండి

రూపాయను తొలగించి, కాగితపురూపాయ నోటు రావలయును. నిలువలపై నాధారపడు బ్యాంకువిధానము కాగితపుధనమును వాంఛించు కారణము సుగమమే. నిలువజేసినచో వెండి మొదలగు లోహముల ధనము-నాణెములు నిలుచును. కాగితపు ధనము నాశమగును. కావున దీనిని రక్షించుకొనుటకు కాగితపు ధనముగలవారు బ్యాంకులో నిలువజేయవలసి వచ్చును. ప్రభుత్వమునకు, విశ్వసించినవాని నాచరించునంతటి ధైర్యసాహసములున్నచో, నీ రూపాయనోట్లను విరివిగ వృద్ధిచేయగలదు. అప్పుడు కాగితపుధనమును నాశమొనరించు చెమ్మ, చెదలు మొదలగునవి (దొంగలు కూడ) గతశతాబ్దినుండియు ప్రభుత్వము చేయజాలని సాయముకంటె నెక్కుడు సాయము చేయును.

సహకారసంఘములు విరివిగ వ్యాపించి, కాగితపునోట్లు వ్యాపింపజేయుటకు శక్తిగలిగి యుండును. మఱియు నిలువచేయు విధానము పెంపొందినకొలదియు నీసంఘములే నేడు ధనమును నడుపలేని ధనాధికారి (Controllar of Currency) దీన దౌర్భాగ్యము పరూపుమాపి, వెండిని స్వాధీనపఱచుకొనగలవు. నిలువచేయు బ్యాంకు విధానము ఎక్కువగనున్న వెండినాణెములను కాగితపునోట్లను లోబఱచుకొనును.

హిందూదేశము వృద్ధిగాంచి ముందంజవేయవలె ననిన, నది డిపాజిట్లకై నిరీక్షింపబనిలేదు. కాని 32 కోట్ల ప్రజలకు ధనమొసగు మూలధన సాధనముల నెక్కడ గాంచగలము? వీనిని మనము ప్రజలశ్రమయందును, కాగితపు నోట్లయందును, ప్రభుత్వపు బంగరు ప్రమాణముల నిలువయందును గాంచగలము. ఈ నిలువలు, లెస్సగ పరపతిధనము నొసగి, బ్యాంకులద్వారా ప్రవహించి, దేశమును సారవంతముచేసి హిందూదేశమును ముందునకు గొంపోవును. కొలదిసంవత్సరములక్రిందట సిమ్లాలో జరిగిన ప్రభుత్వ సహకార సభయందు హిందూదేశపు నిలువధనము నాంగ్లాది దేశములయందు నిలువచేయుటచే గలుగుచున్న నష్టములను, హిందూదేశ ప్రజలు ధనములేక చచ్చుచుండగా దానిని వారికై వినియోగింపకుండుటను నేను దెలిపియే యుంటిని. కావున ప్రజానాయకులీ నిలువలనుగూర్చి గ్రహించి, యీనిలువల మూలమున నూతనపరపతి నిర్మాణము గావింప ప్రభుత్వమును బ్రార్థించి యా ధనమును హిందూదేశ కళ్యాణమునకు వినియోగింప జేయుదురని నావిశ్వాసము. ఇట్లు హిందూదేశ ధనము నితరదేశములలో నుంచుటవలన సంభవించునష్ట మపారము. కొలది సంవత్సరములు గడచుసరికే, కొన్నివందలకోట్లనష్టము

కలుగుచుండును. ఈ నిలువలు అఖిలభారత ధనాగార విధాన నిర్మాణమునకు వినియోగించినచో, భారత రాజ్యాంగశాఖల కన్నిటికి వలసిన ధనము నొసగ గలవు.

అప్పుకొఱకు దహతహలాడు 30 కోట్ల జనుల పరపతివిషయమేమి? ఈపరపతి విలువయెంత? ఋణము దీసికొనువాని యాస్తి, 2 ఎకరముల బీదనేల, ఒకజత బక్కయెడ్లు. రు 0-8-0 విలువగల నాగలి, అక్కఱకు రాని యొకయావు, రు 2 విలువగల యొకమేక మాత్రమే. వీని నెవరునమ్ముదురు? నమ్మకమును (పరపతిని) ధనరూపముగ మార్చుటయే బ్యాంకుయొక్క ధర్మము. పరపతిలేనిచో, బ్యాంకు దీనిని ధనరూపముగ-సురక్షితముగ-మార్పజాలదు. కావునపరపతిని వృద్ధిచేయుటయే ప్రభుత్వ ప్రధానధర్మము, విధి. సర్వవ్యాపారములకును పరపతియే మూలము. కాని యిదియొక దినమున వృద్ధిగాంచునదిగాదు. ఇది, నవనవలాడుచు నిదానముగ బెరుగు లేత మొక్కవంటిది. దీనిని పెంచుటకు జాగ్రత్తగల తోటమాలులు వేలకొలది యవసరము. వీరెంత త్వరితముగ కార్యాచరణమునకు గడంగిన నంతత్వరితముగ నీ 30 కోట్ల ప్రజలు వృద్ధిగాంచగలరు.

పూర్వపు స్కాటిష్ పరపతి విధానమును సహా

కారరూపముగ నాచరణయందుంచుటయే హిందూ దేశము వాంఛించునది. స్కాటిష్ బ్యాంకులు అప్పు పుచ్చుకొనువాడు చెల్లింపగలిగినంత మొత్తమును, కాగితపు (పౌనునోట్లు) రూపముగ పరపతిని గావించినట్లు ప్రభుత్వము హిందూదేశ ప్రజల పరపతిని నిర్మాణము గావించి, నోట్లను సృష్టించి, సహకారపరపతి సంఘములు చెల్లింపగలిగినంత వఱకు వానికీయవలెను. ఈధనముత్పత్తి కార్యములకు మారకముగ వినియోగించుటచే, నాణెములు మితిమీఱునను (Inflation of currency) భయముండదు.

ప్రాచీన స్కాటిషు బ్యాంకుదారు కోశవిధానమును గ్రహించెను. అతడు వెండి, బంగారు, నోట్ల రూపమున నుండిన ధనముగాక, మానవుడే నిజమగు భాగ్యమును సృష్టించునను సత్యము గ్రహించి, తన్మూలమున వ్యయము లేకయే లభించు పౌనునోట్లు సృష్టించి, మానవుని శ్రమపడునట్లు గావించెను. ఈకాగితపునోటు బంగారునవరసువలె కార్యసాధనము గావించి, నవరసునకొక పౌనువ్యయమును తగ్గించెను. ఏమియు విలువలేని యీకాగితమునుండి యొకపౌను విలువగల ధాన్యము పండించుకొనగల యార్థికజ్ఞానము పురాతనపు స్కాచ్ బ్యాంకుదారునకుండెను. కాగితపు విత్తనముల

నుండి ఓట్సుధాన్యము పండించుకొని, స్కాచ్ రైతు బలవంతుడయ్యెను. అతడు తననోటును ఎడింబరో కోశాగారమున వ్యర్థముగ నిలువయుండు బంగారు ప్రమాణాధారమును బట్టి సృష్టింపలేదు. మఱియు నతడు లండను త్రెడ్ నీడిలు వీధిలో జీవచ్ఛవములవలె పడియుండు బంగారపు టచ్చులను లక్ష్యపెట్టను లేదు. బంగారము స్వల్పముగ నున్నపుడు ధనమును తగ్గించి, విలువ హెచ్చుట కవకాశమొసగి, వ్యాపారమును నాశ మొనరించు 1884 వ సంవత్సరపు బ్యాంకుచట్టము నాతడు నిర్వహించెను. ఈపార్లమెంటుచట్టము దేశము నకు, ప్రభుత్వమునకు, సర్వవిధముల నష్టకరముగాన త్రోసివేయబడెను. "బంగారు ప్రమాణముండుట యనాగరకలక్షణమని రాయల్ కమీషన్ ఆఫ్ ఇండియన్ కరెన్సీ అండు ఫైనాన్సు (Royal Commission of Indian Currency & Finance) వారిప్పుడు గ్రహించిరికాని స్కాటిష్ బ్యాంకుదారింతకుపూర్వమే గ్రహించియుండెను.

స్కాటిష్ బ్యాంకుదారు తనవెనుకనుండు బంగారు మొత్తమునుబట్టిగాక, తన ముందుగల మానవుల సుగుణ లక్షణములబట్టి తనవిధానములు నిర్ణయించుకొనెను. ఇదివరకుగల బంగారు మొదలగు ధనముల

పైగాక యిక సృష్టింపవలసిన వస్తువులపైనే తన విధాన ముల నాధారపఱచెను. వెండిబంగారములు తక్కువ మైనకొలది ఆహారపదార్థములు వృద్ధిగాంచుట యవసరము. ఇది తాత్కాలికముగ నిర్మింపబడి, పంటలతో ముగియుచుండు కొలది కాగితములతో, నాకలిగొన్న దేశీయులకు ధాన్యమును, తనకు నూటికైదువంతులు వడ్డీలాభమును సమకూర్చువిధానము. నేడు ప్రపంచమున వెండి, బంగారు గనులు లేకున్నను ఈవిధానము ప్రజలకు నాహారసౌఖ్యములను గూర్చును. కాన లోకము వాంఛించు కోశవిధాన మిదియే. దీనినే హిందూదేశ మవలంబింపవలెను. వస్తుసామగ్రి, ఆహారాదికములకంటె ధన మెక్కుడుగనుండిన ధనము మితిమీఱును. (Inflation of Currency) స్కాటిష్ పరపతి విధానమువలన శ్రమను ధనరూపముగ మార్చినచో, ధనమును మితిదప్పనీయక పదార్థములను పెంచి, తనయొగుమతుల వృద్ధిచే వెండిబంగారముల నెక్కుడుగ హిందూదేశము కూర్చుకొనగలదు. అప్పు డాహారపదార్థములయు, వెండి బంగారములయు వృద్ధి పెంపొంది, యాహారపదార్థముల వృద్ధివలన వాని విలువ తగ్గును. కావున ప్రభుత్వము వెంటనే సహకార పద్ధతులతో ప్రజలశ్రమను, ధనరూపముగ నిర్మాణము గావింప

వలెను. ఇంతకంటెను సక్రమమగు విధానము వేరొండు లేదు. సమష్టి మూలధనాగారముల (Joint Stock-Bank) విధాన మెన్ని శాఖలతో విలసిల్లినను, కోట్ల కొలది సామాన్యప్రజలకు దనసౌకర్యముల గూర్పజాలదు. ప్రజలు సాముదాయికముగ ధనమును బొందవలయును లేదా మానవలయును. కావున, నేడు హిందూదేశము సహకారధనాగార విధానమున వృద్ధిగాంచుట యో లేక సాహుకారు విధానముతో మడియుటయో తప్ప గత్యంతరము లేదు,

ఈ గ్రామనిర్మాణపునరుద్ధరణమునకు హిందూదేశయువకబృంద మత్యావశ్యకము. ప్రభుత్వము సహకార ధనాగారములు విరివిగనిర్మించి, వాని నఖిల భారత ధనాగారముతో సమన్వయించు చక్కని విధానమును నేడు నిర్మింపవలెను. ఈవిధానమును హిందూదేశమున వ్యాపింపజేయుటకు సుమారు పది సంవత్సరముల వ్యవధిని మనము నిర్ణయించుకొననగును. అప్పుడు భారతము చేతినిండ ధనముండుటచే ప్రతిసంవత్సరము లెక్కలేని నూతనోద్యోగములు సృష్టించి, యువకుల కొప్పగించి, వారివిజ్ఞానమును వ్యర్థముగాకుండ కాపాడగలదు. ఇట్లు హిందూదేశయువకుల నుద్యోగముల ప్రవేశబెట్టినచో నేమిజరుగునో చూడుడు. బ్రిటిషు

ఇండియాలో 25కోట్ల యెకరముల నేల సాగులోనున్నది. అఖలభారత ధనాగారమువలనను, పరపతిగల్పించు సులభకోశనిర్మాణ సహాయమువలనను, రైతుప్రతి యెకరమునకు నైదురూప్యములు నికరపుటాదాయము సంపాదించు ననుకొనినను, సంవత్సరమునకు రు 125 కోట్లగును. అప్పు డప్పు పుచ్చుకొనురైతు ఋణప్రదాతగామాఱి నిల్వజేసికొను ధనాగారవిధానము మూలమున నీధనము నార్థికమంత్రికిగాని, వలయు మఱియేరికిగాని యొసంగగలడు. ఈధనవృద్ధితో వడ్డీ రేటుతగ్గి, ప్రభుత్వపు 3 1/2వడ్డీరేటు క్రమమునకు హెచ్చి, ప్రభుత్వము నెడలను, ప్రభుత్వపు ఋణపత్రములనెడలను, (Gilt Edged Securities) ప్రజలకు విశ్వాసము గలుగును. ఈ ధనవృద్ధితో కఱవులంత మొందును. ప్రజలు తమ విముక్తికివలసిన సౌకర్యముల నేర్పఱచుకొందురు. ధనవృద్ధివలన నుపాధ్యాయులను, వైద్యులను పోషింపగల శక్తియుండును. అప్పుడు 700,000 గ్రామములకు, 700,000యుపాధ్యాయులను, 3,000 ప్రజలకొక వైద్యునివంతుననైనను, 100,000 వైద్యులను నేర్పఱచుకొనవచ్చును. నేడు వేనవేల నిరుద్యోగుల తయారుచేసి, యశాంతిని ప్రబలజేయుచుండిన పాఠశాలలకు, కళాశాలలకు, అప్పుడు రెండు

మూడంతలు విద్యావంతులనుతయారుచేయు నావశ్యకత గలుగును. అపుడు అఖిలభారత ధనాగార నిర్మాణము జరుగును. మఱియు దేశములోని వ్యాపారము వృద్ధి యగును. సేద్యపుపంటల యభివృద్ధి, యెగుమతిని వృద్ధిచేయును. అఖిలభారత ధనాగార సహాయముచే వృద్ధిగాంచు దేశీయ వ్యాపారము దిగుమతులను తగ్గించును. ఇందువలన నెక్కుడు బంగారము, దేశములోనికి పరదేశములనుండి వచ్చును. అప్పుడు ప్రవాహము (Drain) ప్రాగ్దేశమువంకకు మఱలును. దేశవృద్ధికి పరపతివృద్ధి ముఖ్యావసరముగదా! అందువలన దీనికాధారమగు నాణకరూపమగు ధనముహెచ్చగును. ఈ వ్యాపారవృద్ధిచే ప్రతిసంవత్సరమును నూరుకోట్ల పరపతిని [నిలువధనమును] వృద్ధిచేసికొనగలము. ప్రజలు ప్రతిసాలున గావించుకొను నిల్వకుతోడు, ఈ నిలువవాంఛనీయముగాదా?

క్రిందినుండి పైవరకును కోశవిధానము ప్రజల దిగా నేయుండును. ప్రజలేకీభవించి గ్రామసంఘములు స్వాధీనపఱచుకొందురు. గ్రామసంఘములేకీభవించి కేంద్రధనాగారములను (Central Banks) స్వాధీనపరచుకొనును. కేంద్రధనాగారము లేకీభవించి రాష్ట్రధనాగారములను ఇవి అఖిలభారత ధనాగారమును వశ

పఱచుకొనును. ఇది ప్రజలకు సంబంధము లేక ప్రభుత్వ మువారి దయాదాక్షిణ్యములతో ఋణము దయసేయు ప్రభుత్వధనాగారముగ నుండదు. ఇది మొదటనుండియు ప్రజలకోశముగనుండి ప్రభుత్వమునకును, ప్రజలకును ధనము నొసగగలదు. ఈవిధానము పూర్తియైన వెనుక హిందూదేశము ఋణముకొరకు పరదేశములకు పరుగిడ నవసరముండదు. అఖిలభారత ధనాగారము ప్రభుత్వమునకు వలసిన ఋణమొసగును. ప్రజలు లాభముల ననుభవింతురు. ప్రపంచమునకుగూడ హిందూదేశము ఋణమొసగగల స్థితికివచ్చును.

సహకార విధానము నారంభించుటకు వెలుపలి భాగ్యవంతుని భాగస్వామిగను, నిలువజేయువానినిగను కలుపుకొను నవసరముండవచ్చును. కాని నేటి ధనాఢ్యులవిధానమును, సహకారవిధానమును పరస్పర విరోధములుగనుండి వేరువేరు త్రోవల ద్రొక్కినవి. కాబట్టి, సాధ్యమైనంతత్వరలో నీరెంటిని వేరుపఱచి, ప్రజలనిలువలను వృద్ధిచేయుటకు కృషిసలుపవలెను. వెలుపలి మూలధనము లేకుండ నిపుడే కార్యమునిర్వహించు మార్గముగలదు. బంగారపు ప్రమాణపు నిలువలవలనను, కాగితపునోట్ల నిలువలవలనను నేడు ప్రజల కప్పియవలసిన ధనముకంటె నెక్కుడుపరపతిని చేకూర్ప

గలము. పత్రధనవృద్ధివలన నిలువలుగూడ వెంటనే వృద్ధి గాంచును. కర్జన్ ప్రభువుకాలమునుండియు నేటిదాక నిలువయుండిన బంగారుపరిమాణపు నిలువ 4 కోట్ల పౌనులు. ఈనిలువ యుద్దేశము రూపాయమారక మును 16 పెన్నీలకంటె తక్కువగ పడిపోకుండనాపుటకే.

నేటిస్థితి మఱింత యధ్వాన్నముగ నున్నది. పది సంవత్సరములలో, తొమ్మిదిసంవత్సరముల వ్యాపారపు నిలువ హిందూదేశమున కనుకూలముగ నుండును. అనుకూలముగ లేని పదియవ సంవత్సరమున ప్రభుత్వము రూపాయధరను నేటి మారకము (18 పె) కంటె తక్కువగ పడిపోకుండ జేయుటకు, భారత కార్యదర్శిమీది బిల్లులను 6 మాసములవో ఏడాదివో ఆరేటునకు వడ్డీచేర్చి ప్రజల కొసగనగును. తరువాత మరల వ్యాపారము భారతమున కనుకూలముగ నున్న వెంటనే బిల్లులను పునరుద్ధరించి, లండనులో విక్రయించుకొను కౌన్సిలుహుండీ వలన లభించు బంగారముతో హిందూదేశము ఋణపుబిల్లులను చెల్లింపవచ్చును. వాస్తవమేమనగా, ప్రతి పదియేండ్లలోను ప్రపంచమునకు హిందూదేశము ఋణపడు ప్రతి నవరసునకును ప్రపంచము హిందూదేశమునకు తొమ్మిది నవరసులు ఋణపడుచున్నది. కాబట్టి, యెప్పుడో యొక

ప్పుడు (కఱవు కాలమున) తాను ఋణపడు దానిని సుల భముగ నారు మాసములలోనో, సంవత్సరము లోనో నేను నీకు ఋణపడితిని (I. O. U.) అను పత్రముతో ఋణమును సులభముగ చెల్లింపగలదు. ఇంతమాత్ర మున ఈ 4 కోట్ల పౌనులు లండనులో నిష్ప్రయోజన ముగ నిలువయుంచుట హిందూదేశమునకుగాని, దాని పరపతికిగాని గౌరవప్రదమును, వాంఛనీయమును గాజా లదు. ఈ 4 కోట్ల పౌనులను అఖిలభారత ధనాగార మూలధనముగ వినియోగించినచో, 200 కోట్ల పరపతి నేర్పరచి దేశమున పంటలు వృద్ధిసేయు కార్యములకు వినియోగింప ననుకూలపడును. మఱియు ప్రతులకృషి వలననే లభించు పత్రధన సంగ్రహము (Paper Currency Reserve) పరపతిధన వసతులకు తోడ్పడని స్వర్ణప్రమాణ సంగ్రహమునవలెనే నేడు నిష్ప్రయోజన ముగనున్నది. స్వర్ణప్రమాణ సంగ్రహపు ఉద్దేశ మొక రూపాయను, 16 పెన్నీలకు తగ్గకుండనుంచుటయు, నడిగినపుడు కాగితమునకు వెండి నొసగుటయునే కాని మార్పులేని ప్రభుత్వ పత్రధనమే శాస్త్రసమ్మతమైన ధనరూపము. ఇదియే సందిగ్ధావస్థనుండి [Crisis] సంరక్షింపజాలును. నవీనప్రభుత్వము వాంఛించుచున్న ధనరూప మిదియే. కాని హిందూదేశమువంటి పరపతి

నిర్మాణము లేనట్టియు, వృద్ధినొందనట్టియు దేశములో కాగితపు నోట్ల కాధారముగ వెండినాణెము లుంచుట యవసరము. కాదేని [యుద్ధకాలమునందువలె] అవసరమగునపుడు వెండిగ మార్చుకొనుటకష్టము. పత్రధన-స్వర్ణప్రమాణ సంగ్రహములుగనున్న ఋణపత్రములను వెండిగమార్చి, హిందూదేశము నవీన ప్రపంచముతో ముందంజవేయవలయు ననిన, నీ వెండిని పరపతి వృద్ధికి వినియోగింప వలయు ననియే నా యభిప్రాయము. విద్యాభివృద్ధితోడను, నిలువను జేసికొను బ్యాంకువిధానవృద్ధితోడను, చెక్కువిధానము వృద్ధియగువఱకును, ఈపరపతిధనమును పత్రధనరూపమున నొసగి, నోటులనే ప్రజలకు చెక్కులుగ వినియోగింప వలయును. తానీయవలసిన ఋణముల [Libilities] లో నూటికొకపాలు ధనమును నిలువ యుంచుకొనుట మంచి బ్యాంకు లక్షణము. కాగా బయటకు రావీలు లేక యెంతధనము హిందూదేశమున నిరుపయోగమున నున్నదో అనుబంధమును జూడుడు. ఇందులకుమూలము అఖిలభారత ధనాగారము లేకుండుటయే. ఈయెక్కువ ధనమును వెంటనే ప్రజలకొసగుడని నాభావముగాదు. దీనిని క్రమముగ నుత్పత్తి పద్ధతులకు వినియోగించి, తిరిగి నమ్మకముగ చెల్లింతురను వారికే యొసగనగును.

క్రొత్త పరపతివిధానలోపముచే హిందూదేశ మనుభవించుచున్న నష్టమపారము. వెనుకటి బెంగాలు గవర్నరగు రోనాల్డుషే మలేరియానుగూర్చి యుపన్య సించుచు, 'నిట్టితావుల జలమును మురుగుతూముల మూల మున వెడలించి పంటలుపండింపగా, తూములవ్యయ మునకు రెట్టింపు విలువగల పంటలు లభించిన'వని నుడి వెను. హిందూదేశపు మూలధనములు లండనులోనో, మఱి యితరప్రదేశములలోనో నిలువయుండుటవలనను నిరుపయోగముగ బంగారు రూపమున బడియుండుట వలనను దేశమునకు నష్టము గలుగుచుండెను. కఱవు వచ్చువఱకు నూరకయుండి కఱవువచ్చినదని ప్రకటించు టకుమారుగ ప్రభుత్వము నేడు నిలువజేసిన ధనమును అఖిలభారత ధనాగారమువంటి చక్కనిసంస్థ కొప్ప గించి, తద్రూపముగ దేశపు పరపతిని వృద్ధిగావించి, కఱవుల నంతమొందింప వినియోగింపదగదా?

ఈనిలువను గూర్చిన ధనము రైతుల కృషి నుండియే లభించుచున్నది. ఇది రైతుతనపంటల నమ్ము కొనగా లభించిన నిలువధనములోని భాగమే. కాబట్టి యీధనముపై రైతునకు ప్రధానముగ హక్కుగలదు. ప్రభుత్వము తనధర్మమును చక్కగ నిర్వహింప వాంఛించుచో, (సహకారపు) పరపతి యుద్యమమును

స్థాపించి, తన్మూలమున నఖిలభారత ధనాగారమును నిర్మించి, రైతునకు తన హక్కు-ధనముతో సంబంధ మును గలుగ జేయవలెను.

రైతుసామాన్యుడే; కాని యొక్కనిని 30 కోట్ల ప్రజలను బెట్టి గుణింపుడు. ఆతని పరపతిని, శ్రమను నిర్మాణము గావింపుడు. చక్కని బ్యాంకువిధానము నాతని కొసగుడు. ఆతడు బ్రహ్మాండ స్వరూపధారియై ప్రపంచము నంతను నడుపగలడు. రైతునకు ధనమొసగుచో నతడు ప్రభుత్వమునకును, నూతన వ్యాపార వృద్ధికిని, పురపాలక సంఘమునకును, పురము నభివృద్ధి గావించు విధానములకును, జిల్లాబోర్డులు మొదలగు సర్వశాఖలకును ధనములభింపజేయును. ఆతని నిప్పటి రీతినే విడచిపెట్టినచో హిందూదేశమునకు క్షామము లును, బాధలును దప్పవు. రైతులకు ధనమునొసగి, యీవరకు విడనాడిన ధర్మమును- అఖిలభారత ధనా గారమును- స్థాపించుచో హిందూదేశము నేటిసామ్రా జ్యములోని నీచస్థితిని మార్పుగావించుకొని, సామ్రా జ్యమునకు నాయకరత్నమై ముందునడచును.

స్కాటిష్ పరపతివిధానము మానవుని కృషి నొనర్చు మూలధనముగ మార్చి ధనము నతనిబంటుగ జేయును. కాని యాంగ్ల పరపతి విధానమన్ననో ధన

మునే యజమానినిగగావించి మానవుని దానిసేవకునిగ జేయును.

హిందూదేశ పునరుద్ధరణ మార్గము రిజర్వ్ బ్యాంకొక గృహముగ నుండెడిదేమో? కాని హిందూ దేశము తన గమ్యస్థానమును జేరవలెననిన నీ గృహ మును రాజభవనముగ నిర్మింపవలెను. 32 కోట్ల ప్రజల కపుడే యీ భవన మాశ్రయము నొసగును.

ఆడమ్‌స్మిత్తు-రైతు.

రైతేహిందూదేశము. హిందూదేశమేరైతు. ఆర్థికదృష్టితో గాంచినచో ప్రపంచమున కాహార మొసగువాడే ప్రధానమైనవాడు. అతడే మానవ జీవనాధారమునకు మూలము. రైతు లేనిచో, బొంబాయి దూదియంత్రములును, కలకత్తాగోగునార యంత్రములును స్థాపింపబడియేయుండెడివిగావు. అతడు లేనిచో దప్పక వీనిని మూయవలసివచ్చును. రైతే రైళ్ళను, స్టీమరులను నడపించుచున్నాడు. అతడు లేనిచో నివి యన్నియును మూలబడును. రైతే బొంబాయి జూదరులకు వెండిబంగారముల నొసగు చున్నాడు. ఆయనయే లేనిచో వీరు మఱియొకవృత్తి నవలంబింపవలసినదే. రైతు లేనిచో క్లైవు వీధిగాని, బుర్రాబజారుగాని, ర్యాలీసోదరులకంపెనీగాని యుండ


సూచింపబడిన అఖిలభారత ధనాగారము తచ్ఛాఖల పటము
అభివృద్ధినిగాంచు వార్షిక.వర్తక నిలువ. ధనము నొసగును
హిందూదేశము
బొంబయి
బెంగాలు
చెన్నపురాజధాని
అఖిల భారత బ్యాంకు
ధనము నొసగును.
రాష్ట్ర బ్యాంకులు
ధనము నొసగును
కేంద్ర బ్యాంకులు
ధనము నొసగును
గ్రామ సంఘములు
ధనము నొసగును
వ్యక్తులగు రైతులకు
పరిశ్రమ వర్తకపు నిలువను గావించును

# సువర్ణ ప్రమాణ; కాగితపు నోట్ల నిలువలు.

బ్యాంకుల విధానముల ననుసరించి, అఖిల భారత బ్యాంకు రు 235 కోట్లు నిలువల వలన రు 705 కోట్ల ధనపరపతిని బడయగలదని నిరూపించు ప్రకటన.

| వ్యయము. | కోట్లు |
|---|---|
| బంగారము, వెండి, హామీ పత్రములరూపమున హిందూదేశ ప్రజలకు జెందియున్న మూలధనము... | 235 |
| కాగితపు ధన చెలామణి, డిపాజిట్లు, కరెంటు ఎంకౌంట్సు ద్వారా ... | 705 |
| కోట్లు రు... | 940 |

| రా బ డి. | | కోట్లు |
|---|---|---|
| | రు 97 కోట్లు వెండి,బంగారములు; వెండి,బంగారములలోనికి మార్చుకొనుటకు వలనుపడు రు 138 కోట్లు హామీపత్రములు... | 235 |
| ధనము నిల్వ [illegible] | నూటికి 6వంతునలభించు ఇండియా ప్రభుత్వపుబాండులు. | 20 |
| | నూటికి నూరును పంటలరూపమున నొసగు పంజాబుప్రభుత్వపు 5% జలాశయముల బాండులు ... | 4 |
| | నూటికి నూరును పంటలరూపమున నొసగు మధ్యపరగణాల ప్రభుత్వపు 5% జలాశయముల బాండులు .. | 2 |
| | నూటికి రెండువందలను పంటలరూపమున నొసగు బెంగాలు ప్రభుత్వపు 5%మురుగువసతుల బాండులు... | 1 |
| | సహకార పరపతి 5% బిల్లులు ... | 20 |
| | పురపాలక, మండల, ప్రజాసంస్థల 5% బాండులు ... | 25 |
| | వస్త్రకాభివృద్ధికి 5% బాండులు; వ్యాపారపుబిల్లులు ... | 15 |
| | పల్లెల ఋణాముక్తికి లభించు పరపతి నిలువ ... | 618 |
| | కోట్లు రు... | 940 |

జాలవు. రైతుతన వ్యయములకు వలయు ధనమును గూర్చుకొనలేక పోయినను ప్రభుత్వ వ్యయములకు ధనము నొసగుచున్నాడు.

సంఘమున రైతు స్థానమునుగూర్చి ఆడమ్‌స్మిత్తు తన 'దేశముల భాగ్యము' అనుగ్రంథమున నిట్లు వర్ణించినాడు.

"ప్రపంచమున విరివిగ లభించు వెండి, బంగారు, వజ్రముల గనులు విశ్వభాగ్యమును నిర్మింపనేరవు. వీని స్వల్పోపలబ్ధివలన నేర్పడు విలువ వీనిపుష్కలోప లబ్ధిచే పడిపోవును. ఆహారోత్పాదకమగు భూములఫల శక్తినిపెంచువస్తువు పంటనేలల విలువనేగాన బంజరు భూములలోను పంటలవృద్ధిజేసి వానిధరలనుగూడ బెంపొందించును. ఇట్లుభూమిని విరివిగసాగుచేయుటచే లభించు నాహారపదార్థములను ప్రజలనేకులనుభవిం చుచు సమృద్ధిగ నితరులకు సమకూర్చుటయేగాక ప్రజ లకు వెండి, బంగారు, వజ్రములు, ఆడంబరపు దుస్తులు, గృహములు, గృహాలంకారములు మున్నగువాని యెడ నభిలాష గలిగించి విలువనొసగుచున్నది. ప్రపంచ ప్రధాన భాగ్యములలో నాహారము చేరియుండుటయే గాక యితర భాగ్యముల కన్నింటికిని ముఖ్యమగు విలువ నొసగునది యాహారసమృద్ధియే."

ఇదియొక యర్థశాస్త్రప్రవీణునిచే నొసగబడిన యోగ్యతా పత్రము. కాని రాజ్యాంగవేత్తలు అర్థ శాస్త్ర సిద్ధాంతములనుగాని, తత్సంబంధములగు నితర విషయములగాని లేశమేనియు నెఱుగకుండుట విచార కరము. రాజ్యాంగవేత్త యాహారము నుత్పత్తిజేయ జాలడు. అతడు ప్రజలకు పొట్టు నొసగుచుండును. తాను సంవత్సరమునకు 400 పౌ॥ పుచ్చుకొనుచు దేశము నకు చెత్తచెదారమునే యొసగుచుండును.

నూతనమగు రిజర్వుబ్యాంకు చట్టము 'ప్రపంచ భాగ్యములలో ప్రధానాంగమగు భాగ్యము నుత్పత్తి గావించు' వారికి ధనసౌకర్యములను గావింపలేనిచో దానిని చిత్తుకాగితముల బుట్టలో పాఱవేయనగు. ఐరిషు ధనాగార విచారణసంఘము (Irish Banking Commission) ఆడమ్‌స్మిత్ యొక్కయు, లోకజ్ఞానము యొక్కయు పద్ధతులపైగావింప బడినది. కాని హిందూ దేశ ధనాగార విచారణ సంఘము అట్లుగాదు. ఆడమ్ స్మిత్ వలె ఐరిషు ధనాగారవిచారణసంఘము ఇట్లనుడు వుచున్నది.

"ఐరిషు స్వతంత్రరాజ్యములో వ్యవసాయమున కొసగు ప్రధానస్థానమును వర్తకవ్యాపారముల కొసగ బడజాలదు." హిందూదేశ సంఘము (Indian

Commission) వ్యవసాయ విషయమై నుడివియే యుండలేదు. వ్యవసాయమున నాలుగవ భాగమగు వర్తక, వ్యాపారములకే యగ్రస్థానమొసగి, సర్వధనమును వాని వినియోగమునకే యొసగుచున్నది.

హిందూదేశపు టార్థికనాణకసంఘము (Finance & Currency Commission) హిందూదేశ కోశవిధానమును బంగారముపై నాధారపఱుప నిశ్చయించినది. దీనికి, హిందూదేశమునుండి పరదేశములకేగు నాహారపదార్థముల పరిమాణమును బట్టియే హిందూదేశమునకే తెంచు బంగారుపరిమాణ ముండుననుు దూరదృష్టిలేకపోయినది. హిందూదేశ ధనమును బంగారుపై నాధారపఱచి, అవసరములనుబట్టి వృద్ధిచేయ నెంచుచో, మన ప్రథమకర్తవ్యము గోదుమలు, ధాన్యము నెక్కుడుగ నెగుమతి చేయుటయే. కాని రైతునకు ధనసౌకర్యములు గావింపక దీనిని చేయజాలము.

"నీవు బంగారు నెక్కుడుగోరుచో, నెక్కుడు గోదుమల బస్తాలను రవాణా చేయవలెను." అని ఆడమ్ స్మిత్ నుడివెను.

"నీవు గోదుమబస్తాల నెక్కుడుగోరుచో, పరపతిని వృద్ధిగావించుము. దీనికిగాను స్వర్ణప్రమాణనాణక సంగ్రహ రూపముగనున్న 188 కోట్ల వెండిబంగారము

లక్షో. వ్యవసాయ పరపతిసంఘము Agri eredit Corperation నేర్పఱచుము" "వ్యాపారి తన సౌక ర్యములను తాను గావించుకొనగలడు. చిన్నరైతున కంటె వ్యాపారి తన్ను, తనవ్యాపారమును బాగుగరక్షిం చుకొన గలిగిన స్థితియందుండుటచే, రైతునకు ప్రత్యేక సౌకర్యములు గావించుకారణములు వ్యాపారికి, ఉత్ప త్తికారునకును అన్వయింపవు." అని ఐరిషు ధనాగార విచారణసంఘము నుడువుచున్నది.

ఇండియా ధనాగార సంఘమన్ననో వ్యాపారు లకు ఉత్పత్తికారులకు మాత్రమే సౌకర్యములు గావింప జూచుచున్నది. ప్రజల 235 కోట్ల స్వర్ణప్రమాణ పత్రధనసంగ్రహధనమును ఈసంఘముతన్ను,తనవ్యాపార మును గాపాడుకొనగలుగు వానికేయొప్పగించి, ప్రజలకు ధన మందనీయక చచ్చునట్లును, ఇతర సౌకర్యముల నొసగక విడిచిపెట్టుటకును జూచుచున్నది. ఇది యన్యా యము. కావున హిందూదేశసామ్రాజ్య శాసన సభా ప్రజాప్రతినిధులు తమప్రజల సౌకర్యములను తమ్ము తాము కాపాడుకొనగలుగు (4 వ వంతుగనున్న) వ్యాపారుల కొప్పగింపకుందురుగాక. హిందూదేశార్థిక మంత్రి తన క్రొత్తరిజర్వుబ్యాంకు చట్టముతో శాసనభ

కే తెంచినపుడు, ఆర్థిక భారముచే క్రుంగిపోవు రైతును మఱువకుందుగాక!

రిప్పను ప్రభువు—రైతు.

నేటి బొంబాయి రాష్ట్రదారిద్ర్యము, అందువలన బొంబాయిరాష్ట్రపు బొక్కసపు ధనలోపము, 'అనావృష్టి, క్షామము, అను ప్రభుత్వ ప్రకటనలోని సత్యమును (అనుబంధము చూడుడు.) బలపఱచును.

"ఎంత క్లిష్టముగనున్నను, పరిపాలన సమస్యలన్నిటిని శాఖలుగ విభజింపనగును. అందు '5 ఎకరముల పరిమాణముగల భూమియు (Unit), దానిహక్కుదారు (రైతు) భాగ్యమును' అనునదే సర్వప్రధానసమస్య."

అనగా రైతును భాగ్యవంతుని గావించుచో, ప్రతి పాలన శాఖయు భాగ్యవంతమగును. రైతును క్షుద్బాధాపీడితుని జేసినచో, నార్థికమంత్రి మొదలు, కార్మికుని వఱకు నెల్లరును మలమలమాడి చత్తురు. 'అనావృష్టి, క్షామము' అను వ్యాసము 1895 లో ప్రభుత్వముచే (Statistical Atlas) లో ప్రకటింపబడెను. అం దార్థిక సత్యమును, కావ్యకళలును ఉండుటచే తప్పకచదువదగినది.

హిందూదేశపు చక్కని వర్ణనమిందు గలదని యే నాతలంపు. 1879 వ సంవత్సరపు మదరాసు కఱవుల

యనంతరము హిందూదేశార్థికస్థితి విచారింప భారత కార్యదర్శి ప్రభుత్వమును గోరెను. రిప్పను ప్రభువు దేశమున కొసగిన యీసందేశమున, 'రైతులస్థితి చక్కజేసి వారిని బలపఱుచుటకు వ్యవసాయభాగ్యమును బెంపొందించుటయే ముఖ్యము' అని నుడివెను. ఇదియే ఆడమ్‌స్మిత్ నుడివినట్లు "ప్రపంచ భాగ్యములలోని ప్రధానాంగము." రిప్పనుప్రభువిట్లు నుడివెను.

"వ్యవసాయ విచారణము కేవలము అంకెలపట్టికలు తయారుగావించుటతో పూర్తిగాదని జ్ఞప్తినిదుకొనదగు. వ్యవసాయపరిశోధనచేసిన క్షామపరిశోధకోద్యోగి నివేదికయందు వ్యవసాయాభివృద్ధిని పరిశోధించుటకు ఒకసంఘమును నియమింపవలయునని సూచింపబడెను. ఈ యుద్దేశమును, ఆదర్శమును హిందూదేశ ప్రభుత్వమంగీకరించుచున్నది.

వ్యవసాయకార్యములు చక్కగ నిర్వహించుట యన, వ్యవసాయవృత్తిని పోషించి, వ్యవసాయావసరములు దీర్చుటయే. హిందూదేశమున నిట్లు గావించుట యన, రైతులకు వారికుటుంబములకు, పశువులకు, సక్రమముగ నాహారముండునట్లు చేయుట యనియే గ్రహింపనగు. కార్మికులను జలాధారపు వసతులను, వ్యవసాయోపకరణములను వారికి లభింపజేయవలెను.

ఆహార లోపమును, యంత్రరూపక మగు వసతులు లేమియు శ్రమ శక్తిని తగ్గించును. అందువలన దేశమున పంటలుతగ్గును. కాబట్టి పన్నుల భారమువలనగాని, లేక పన్నులు వసూలుపఱచు విధానలోపమువలనగాని, మూలధనము సక్రమమగు వడ్డీకిదొరకమిచేగాని, ఋతువులు మొదలగువాని ధర్మలోపముచేగాని, శ్రమపోషణకును, భూమివసతులకును వలసినదానికంటె తక్కువ పంటలు పండుచో, ఇట్టి వ్యవసాయఫల క్షీణత నరికట్ట ప్రయత్నించుట ప్రభుత్వపు కనీసపు ధర్మము. మఱి యే విధమున వ్యవసాయకార్యముల నభివృద్ధిచేసినను పంట లెక్కువగ లభించును. మూలమున శ్రమను పోషించుటకును, యంత్రసౌకర్యములు వృద్ధిగావించుటకును, భూమిశిస్తును చెల్లించుటకును నవకాశ మేర్పడును."

రైతులకువారికుటుంబములకు, పశువులకు నాహారముదొరకుట చూడకపూర్వమే రిప్పను ప్రభువు హిందూ దేశమును విడచిపెట్టెను. ఆయనసందేశము నాచరించి దేశార్థిక పరిస్థితులు పెంచుటకును, ఆవిరి యంత్రమునకంటెను స్వల్పవ్యయముతో పనిచేయు రక్తమాంసమయమగు మానవయంత్రము, తనధర్మముల చక్కగ నిర్వహింప నవసరమగు విపులాహారపదార్థములు సంపాదించుకొనుటకు నీ దిగువమార్గములు చూపెను.

1. రైళ్ళు పెంపు, 2. కాలువల క్రింది వ్యవసాయము, 3. బావినీటి వ్యవసాయము, 4. బంజరు నేలల సాగు, 5. వంటచెఱకు, పశువుల మేతకు కావలసిన రిజర్వులు స్థాపించుట, 6. వ్యవసాయాభివృద్ధి మార్గములు ప్రవేశపెట్టుట, 7. వలసపోవుట, 8. అవసరమగుచోట్ల శిస్తు, పన్నుల విధానములు మార్పుగావించుట.

ప్రధానములగు రైలుమార్గములు పూర్తియగుచున్నవని విింటిని గాని రక్తమాంసమయమగు మానవయంత్రమింకను దుర్బలముగనే యున్నది. "హిందూదేశమున నాహారలోపము" అను టైమ్సు పత్రికావ్యాసమున వ్యవసాయముసేయు కార్మికుని దీనముఖదృశ్యమును, లిన్‌లిత్‌గో ప్రభుని వ్యవసాయసంఘము గ్రహింపగలిగెననియు, దీనికి కారణము తన భోజనమునందు నెయ్యి లేకపోవుటయే యనియు వ్రాసెను. కఱవుకాలమున రైళ్లు విశేషముగ రక్షించును గాన వీని నిర్మాణమునకై ప్రభుత్వమును భూషింపదగు. కాని ప్రజల యార్థిక, శారీరిక స్థితిని చక్కబెట్ట (వృద్ధిజేయ) లేశమేనియు కృషిసలిపినట్లు గానము. రైతింకను దుర్బలుడుగనే యున్నాడు. ఆతని సాహుకారాతని ధనమును, జాడ్యములతని బలమును హరించినవి. రైళ్ళవలెనే, కాలువల నిర్మాణము నయినట్లు తెలియుచున్నది. ఇట్లు పంటల నెక్కుడుగ వృద్ధి

గావించినందులకు ప్రభుత్వము ప్రశంసాపాత్రము. కాని ప్రజల యార్థికస్థితి యింకను దుర్బలముగనే యున్నది. ఆర్థిక నాణక విచారసంఘము వారిసూచనలపై తన వ్యతిరేక భావమును సర్. పురుషోత్తమదాసుఠాకూరుదాసు గారిట్లు వెల్లడించిరి. "హిందూదేశపు రైతుయొక్కయు, సామాన్య ప్రజలయొక్కయు, ఋణభారము విచారణీయము. పంజాబురాష్ట్రపు I. C. S. ఉద్యోగియగు డార్లింగుగారు పీరిఋణభారము (కాలువలక్రింద సాగు చేయు పంజాబు రైతులతోసహా) రు 600 కోట్ల రూపాయలకు పైబడియున్నది." కాబట్టి కాలువక్రింది సాగు జరుగవలసినంత జరుగ లేదు.

'అనావృష్టి-క్షామము' అను వ్యాస ప్రకటనమునకు పిమ్మట బావుల జలసౌకర్యముల నెంతవఱకువృద్ధి గావించిరో తెలియదు. కాని, నేటి బొంబాయి, మదరాసురాష్ట్రముల నీటిలోపమును గ్రహించినచో, బావులను పూర్తిగ సృష్టిచేయవలయునని స్పష్టమగుచున్నది. మధ్య రాష్ట్రములలో నుద్యోగమునుండి విరమించిన కమీషనరుగారు నాతో నిట్లు నుడివిరి. "హిందూదేశమునకు కాలువలకంటె బావులే యెక్కువగ కావలయును." ప్రభుత్వమువారు బావుల నెక్కువగ త్రవ్వరు. ప్రజలే ప్రభుత్వమునకంటె చవుకగ బావులను త్రవ్వ

కొనగలరు. కాని బావులను త్రివ్వుటకు ధన మావశ్య కము. 600 కోట్ల రు. ఋణభారము నెత్తిపై గలదీన ప్రజలు వ్యక్తిగతముగ ధనమును వీనికొఱకు వినియో గింపజాలరు. పురుషోత్తమదాసుగారు ప్రజలను ఋణ విముక్తులుగ నొనరింప సాయపడుదురా?

'అనావృష్టి క్షామము' అను వ్యాసప్రకటనా నంతర మెంత బంజరుభూమి సాగయినదో తెలియదు. కాని ప్రజలు సాహుకారు కొఱకే తమ పంటలు వృద్ధి చేయుచుండిరి.

వంటచెఱకు-పశువులమేత-రిజర్వ్ తోఁట వృద్ధి యైనవో తెలియదుగాని, రైతు బొగ్గును వంటచెఱకుగ వినియోగింప జాలనంతవఱకు నెరువును పిడకలుగ జేసి, భూమిని నిస్సారముగ గావించుచునేయుండును. ఇది క్లిష్టసమస్యయే. కాని రైతు సాహుకారునకు బానిస గానిచో నేడతడు కొనజాలని బొగ్గునొసగి యీసమస్యను పరిష్కరింపవచ్చును. బాటలపెంపును ప్రజలువాంఛించు చున్నారు. రైల్ల నిర్మాణము పూర్తియైనది గావున ప్రభు త్వము బాటలనునిర్మింపవలెను. అట్లగుచో రైళ్లకంటెను మోటారులు సులభమయి ప్రతి గ్రామమునకును బొగ్గును తేలికగ, చవుకగరవాణాచేయగలవు. నెలకొక రూపాయబొగ్గును వంటచెఱకుగ నుపయోగించుచో,

భూముల ఫలమును పెంపొందింపగల చాల యెరువులను మిగుల్చుకొని, వానికి నుపయోగింపవచ్చును. వంట చెఱకు, గొడ్లమేతల రిజర్వులను, బీళ్లను, అనుకూల ప్రదేశములందు తప్పక వృద్ధిచేయవలెను. ప్రజలు ధనాఢ్యులగుచో, పండ్లతోటలు పెంపొందింప ప్రోత్సహింప వచ్చును.

మామిడి, నిమ్మ, నారింజ మొదలగు తోటలు దేశమందంతటను పెంచినచో, పండ్ల చెట్లాహారమును వృద్ధిచేయుటయేగాక, వర్షజలము నాకర్షించి, యూరి బావులను జలముతో నింపును. మఱియు నాచెట్లకఱ్ఱ వంట చెఱకుగ వినియోగపడుటచే నెక్కువ యెరువు భూములకు దొరకును. ప్రతివిషయమును రైతు ధనవసతిపై నాధారపడియుండుటచే, ఆయనకట్టివసతి లభించువరకును నాయన గొడ్లపేడను వంటచెఱకుగ వినియోగించి భూమిని, దన్ను బీదలుగ జేయకయు-రక్తమాంసమయమగు యంత్రమునకును, కుటుంబమునకును ఆరోగ్యబలముల నొసగు నత్యావశ్యకఫలములు-పాలు, నేయి, గలిగియు-నుండజాలదు.

పదిసంవత్సరముల క్రిందట ఒరిస్సాయందు నేను నారింజచెట్లు నాటితిని. కొలది సంవత్సరములకు బిమ్మట మొదటి నారింజకాయ పండినది. అదిచూచుటకు చక్క-

గనే కన్పించెనుగాని దానిని కోసిచూడగా నందు రసము లేక కొరగాని పిప్పిమాత్రమే యుండెను.

కొన్ని వారములకు బిదప నావ్యవస్థాపకుడు (Manager) "మాల్టానారింజపండ్ల రుచి చాల పెరిగిన ద"ని నాకు వ్రాసెను. "ఒకటి రెండు సంవత్సరముల క్రిందట సున్నమును, ఈసంవత్సరమాను పేడను ఎరువుగ వినియోగించితి. ఇందువలన రుచియు, రసమును బూర్తిగ వృద్ధిగాంచెను. పూర్వమువలె రసశూన్యమై పొడిపొడిగనుండిన పండ్లు నేడందుగానవు."

దేశపు ఆర్థిక దారిద్ర్యమును రూపుమాపుటకు మంచిబలమగు గట్టి విత్తనములు తయారుచేసి, వ్యవసాయమును కొంతవృద్ధిచేసిరి. కాని యీలాభము సాహుకారునకే చెందుచున్నంత కాలము, రైతు తానాలాభము నొందుచున్నానన్నంత శ్రద్ధతో పంటలు వృద్ధిగావింప జాలడు.

ఇక వలసవిషయము:—కొన్ని వేలమంది దక్షిణాఫ్రికాకేగిరిగాని, మంచిఫలమేమియు వారికి లభింపలేదు. మఱియు నీకొలదిమంది వలసవలన, మిగిలిన 32 కోట్ల ప్రజలకు సౌకర్యములు లభింపవు. తుది చికిత్సయగు పన్నులవిధాన సంస్కరణమును గాంచుడు. ఇది కర్జను ప్రభువు రాజప్రతినిధిగ నున్నకాలమున విచారింప

బడెను. దీనిని 1902 లో ప్రకటింపబడిన హిందూదేశ ప్రభుత్వపు భూమిపన్నుల విధానమున గాంచనగు. అందిటుగలదు. "విశాలములు, దయాపూర్వకములగు సిద్ధాంతములతో నుద్యోగుల నేర్పఱచి యాయా రాష్ట్రముల సాంప్రదాయానుకూలములు గమనించి, పన్నులు సామాన్యముగ విధించి, వానిని సానుభూతితో వసూలు చేయుటయే నిక్కమగు ప్రభుత్వధర్మము.

నేటి విధానమును లోగడసూచించినట్లవలంబించినచో, నేటి దేశపరిస్థితులకును భావిదేశౌన్నత్యమునకు ననుకూలముగను నుండును. ఇంతియేకాక యిందువలన లభించు పన్నులు లోగడకంటె తక్కువగ నుండుటచే ప్రజలు కష్టములేకయే-యసంతృప్తి చెందకయే-యొసంగ గలరని రాజప్రతినిధి విశ్వాసము."

కఱవు కాలమున తాత్కాలికముగ పన్నులనాపుట మూలమునను, తీసివేయుట మూలమునను, ప్రభుత్వము దయజూపుచుండుట వాస్తవమే. కాని ప్రజలు శారీరకముగ, నార్థికముగ నింకను దుర్బలులుగనే యున్నారు. హిందూదేశ శారీరకార్థిక దుస్థితిని మాన్పి, వృద్ధిచేయుటకు 'అనావృష్టి, క్షామము' అను వ్యాసమునగల మార్గములనెల్ల జదివితిని. కాని యివి, 600 కోట్ల రు. ఋణబాధను మాన్పజాలకపోవుటచే, ప్రజలకు ధనము,

విద్య, వైద్యసహాయము లేక వృద్ధిగాంచ జాలకున్నారు. కాని రిప్పను ప్రభువు వేరొక చక్కని మార్గమును జూపెను. అయిన నీ సందేశము నతని యుద్యోగులు గ్రహింపనే లేదు. అదియే కోశవిధాన చికిత్స.

"మూలధనమును సక్రమమగు వడ్డీతో సంపాదింప శక్తిలేకపోవుటవలన శ్రమకును, భూమికిని కావలసిన ఫలము తగ్గిపోవుచో, వ్యవసాయ క్షీణదశ నాటంకపరచు సాధనములు సమకూర్చుట ప్రభుత్వవిధి. అట్లుగాక వ్యవసాయ కార్యములనే సర్వవిధముల వృద్ధిచేయుచో, పంట లెక్కుడుగ పండి, శ్రమను పోషించుటకును, యంత్రనిర్మాణమున కావశ్యకములగు వ్యయములు భరించుటకును, భూమిపన్నులు చెల్లించుటకును సాధ్యమగును." ఈవిషయ సూచనమున రిప్పనుప్రభువు రాజ్యాంగ విధానమునగల బలహీన విషయము మీదనే తన చేయి వైచెను. కాని యీచికిత్సకు ప్రారంభము మాత్రము కర్జనుప్రభువు వచ్చిన వెనకనే 'సహకారపు పరపతి' రూపమున జరిగినది. నేడు ప్రజలయార్థికాభివృద్ధిగావించి, ప్రజలకు తోడ్పడుచుండిన 70,000 గ్రామ సహకార సంఘములు గలవు. వీనికార్యాభివృద్ధికి సివిలు సర్వీసు ఉద్యోగులు గర్వింపవచ్చును. కాని హిందూదేశమున 700,000 గ్రామము లున్నవనియు, నింకను

గావింపవలసిన దానికి కృషిసల్పువారు కొలదిమంది మాత్రమే గలరనియు గ్రహించినచో, దీనిని వెంటనే నిర్వహించుట "ప్రభుత్వపు ముఖ్యవిధి" యని రిప్పను ప్రభువు నుడివినదానినే మనమును వక్కాణింతుము. ఏలయన, కాలముగతించిన కొలదియు, 600 కోట్ల రు॥ ఋణభారము వృద్ధియగును. అందువలన పైఫలము నెన్నటికిని మనమనుభవింపక పోవచ్చును.

'నెమ్మదిగ సాగిపోండ'ని కొంతమంది నుడువుదురు. హిందూదేశము కడచిన 150 సంవత్సరముల నుండియు నిర్లక్ష్యము గావించుటచే నందలి ప్రజలు 600 కోట్ల రు॥ ఋణమున మునిగిపోయిరి. సర్ బేసీలు బ్లాకెట్టు వీరిని పైకి లేవదీసి, సక్రమ సుకర మార్గమున నడుప సాయపడునా? ఆర్థికమంత్రియు తన ఋణములకు నూటికి 4.69 వడ్డీనిగాక 25 వడ్డీనే చెల్లించుచో, నిర్లక్ష్య మునిగిపోడా? బోల్షివిక్కు విషవృక్షమున కిచట చక్కని నేల సిద్ధముగ నున్నది. మనము దీని నియమింపనిచో, చీనాలోవలెనే యిచటగూడ మనల నిదియే యాక్రమించును.

రిప్పను ప్రభువు స్వరాజ్యమునకు తండ్రివంటివాడు. ఆయన సంతతి హిందూదేశ ప్రజల నెత్తిపైనున్న యీ 600 కోట్ల ఋణభారమును దొలగించి, హిందూ

దేశమున్నతినొంది తక్కిన వలస రాజ్యములతో బాటు సామ్రాజ్యమున తన స్థానము నధిష్ఠింపగల్గుటకు సాయ పడదా? చక్రవర్తి నూతన ఢిల్లీనగరమునకు శంకుస్థాపన గావించినపుడు శాసనమందిరమును, నేటి పత్రవిధాన మునకు నిలయము చేయక పాడియావుల కొట్టముగ నుంచి ప్రజల కాహారమును, బలకరమగు నేతిని ప్రసాదింప దలచెను.

## కర్జను ప్రభువు—రైతు

గతప్రకరణమున రిప్పను ప్రభువు హిందూదేశ పునరుద్ధరణమునకు రైతుల శారీరికార్థికస్థితి నెట్లు బెంపొందింపదలంచినదియు జూపించియుంటిమి. హిందూ దేశమునకు మఱియొక మిత్రుడగు కర్జను ప్రభువు ప్రతి రాజప్రతినిధి యొక్కయు ప్రధానలక్ష్యముగా నుండదగు రైతుస్థితి నెట్లు పెంపొందించినదియు జూపెద. తాను హిందూదేశమును వీడునపుడు గావించిన యుపన్యాస మునందిట్లు నుడివెను. "హిందూదేశమునగల వివిధజాతు లలో ప్రతివ్యక్తి వాంఛలను, అవసరములను తెలిసి కొనబ్రయత్నించి రాజులవిశ్వాసమును చూఱగొనుట కును, రాష్ట్రముల గౌరవప్రతిష్ఠల బెంపొందించుటకును చక్కని విద్యావిధానమును నిర్మించి, విద్యాధికుల కనే కావకాశములు గలిగించి, హిందూ మహాత్మ్యగౌరవ

బౌద్ధ సిక్కుల ప్రోత్సహించి, యల్పసంఖ్యాకులగు శ్వేతముఖులయందు మైత్రిని గలిగియుండుటకును, నిజమగు హిందూదేశ ప్రజవంకకేనాదృష్టి సర్వదాప్రసరించెను.”

సామాన్యదృష్టి యందులేనివాడు- రాజ్యాంగ తత్వము నెఱుగకపోయినను దానిలాభనష్టములకు గురియగువాడు-వ్యవసాయమే జీవనాధారముగ గలిగి నూటికి 80 పాలున్నవాడు-దయాక్షమా శీలుడగు హిందూదేశపు పేదరైతునుగూర్చియే నేను ముచ్చటించుచుంటిని. నేనవలంబించిన ప్రతివిధానమున నారైతునే ముఖ్యునిగ తీసికొని నాశక్తికొలది సాయముగావించితిని. భోగ్యములదులదూగుపట్టణములలోమనమువానిని గాంచజాలము. చదువు సంధ్యల నెఱుంగని యతడు వార్తాపత్రికలు చదువడు. రాజ్యాంగ తంత్రము లతడెఱుంగడు కాని దేశముయొక్క రక్తమాంసము లతడే. అతడు చెమటకార్చుట వలననే భూమి సాగుచున్నది. దేశపు రాబడిలో నాలవవంతున కతని శ్రమయే కారణము. కావున ప్రతిరాజప్రతినిధియు నీరైతును దనదృష్టియందిడుకొనదగు.

“ఇతని కళ్యాణమునకే యుప్పు పన్ను రెండుపర్యాయములు తగ్గింపబడెను. రెండు సంవత్సరములు

25 లక్షల మొత్తపు భూమిపన్ను రైతులకు వాపసు చేయబడినది. అతనికొరకే భూమిశిస్తు క్రమముగ తగ్గించి, వసూలుచేయు సులభ మార్గముల నారయుచుంటిమి. అతని పరపతిని వృద్ధిచేయుటకు పరపతి సంఘములు స్థాపించితిమి తన్మూలమున నతడు ధనమును తక్కువ వడ్డీకి బడసి సాహుకారుల యుచ్చిత్రాళ్ళనుండి తప్పించుకొనగలడు. ప్రపంచములో మనచేనుద్ధరింప బడవలసిన వా డతడే. అతనిసంతతికి విద్యను గఱపనగును. వారిపై దౌర్జన్య మొనరింపకుండుటకు, వారి నన్యా లణగద్రొక్కకుండుటకు, హిందూదేశ రక్షకభట విధానమును మార్పు గావించితిమి. అతనిని దారిద్ర్యమునుండియు, క్షామములనుండియు తొలగింపవలెను. మఱియు నతనిని ఋణబాధములనుండి తప్పించి, భూమికి హక్కుదారుగ జేయవలెను. హిందూదేశ ప్రజలపక్షమున మాటలాడువారు నన్ను నిందించునపుడు నాకు కోపమును, మనస్తాపమును గలుగదు. ఏలన, వాస్తవముగు హిందూదేశప్రజలెవరు? వారిస్థితియేమి? యని నాయాత్మను ప్రశ్నించుకొందును. నాశక్తికొలది సాయపడి వారిని మంచిస్థితికి దెచ్చినందుల కానందించెదను...... వారెల్లరు నా భావములతో సర్వదా యేకీభవింపక పోవచ్చును. కొంతమంది నాతో నేకీభవింపనివారునుగలరు.

కాని నేను గావించు ప్రసంగ మొక్క తెగకు, జాతికి సంబంధించినది కాక సమగ్ర హిందూదేశమును గూర్చి నదియే. ఏది యెట్లున్నను, ఎద్దాని యభివృద్ధి మార్గాను సరణ మాంగ్లేయుల ధర్మమో, ఎద్దానిని ప్రతిష్ఠా గౌరవ ములతో జూచుట యాంగ్లేయులకు ప్రతిష్ఠయో, యెద్దాని భవిష్యజ్జీవన మాంగ్లేయులతో నైక్యమై యుండునో యట్టి భారతదేశమునే నేను కోరునది. సామ్రాజ్యము కొఱకును, హిందూదేశ కల్యాణము కొఱకును నాశక్తి కొలది నిట్లొనరింప బ్రయత్నించెదను. మఱియు, హిందూ దేశ లాభములను, సౌఖ్యములను, సామ్రాజ్యార్థిక సౌక ర్యములకై బలి యొసగుటగాని జరుగదని నేను గట్టిగ నుడువగలను. ఈ దేశమునం దుద్యోగ నిర్వహణ మొన రించు ప్రతి యాంగ్లేయుడును ధర్మరక్షణ మొనరించె ననియే నా తలంపు. ప్రతి వ్యక్తియు విశ్వాసముతో హిందూదేశమునకు సేవ సలిపెను. తదితర జయము లన్నియు కృత్రిమములు. ఈ ఆదర్శమునకు భిన్నాభి ప్రాయములు కొలదిగ గలవు. కాని యిదియే మన యాదర్శముగ నుండనగు. న్యాయముకొరకు పోరాడుట, అక్రమమును, అన్యాయమును, నైచ్యమును గర్హించుట, సత్యమార్గమును తొలగకుండుట, దూషణభూషణ ద్వేషాద్వేషములను సరకు గొనకుండుట, మున్నగు

గుణములలో వేనినైన సంపాదించుట హిందూదేశమున మాత్రము సులభమే. ఎన్నడు నుత్సాహ, ధైర్యములు గోల్పోవరాదు. భగవంతుడు మనచేత నొక గొప్పనాగరి నిడెననుట మఱువవలదు. దీని చాలునుండియే భావిజాతు లంకురించి, యాకృతిని దాల్చుచున్నవి. ఆకట్టుతోడనే మన కాలమున కొంతలోతుగ నైన దున్నింపవలయును. ఈ కోట్లకొలది ప్రజలమధ్య నెచ్చుటనో కొంతన్యాయ మును, సౌఖ్యమును, నీత్యభివృద్ధి గావించితివి. మగటి మియు, నైతిక ప్రతిష్ఠయు గల విజ్ఞానమును, దేశభక్తి ప్రవాహమును, విజ్ఞాన వికాసోదయమును, ధర్మ నిర్వ హణోత్సాహమును, ప్రబలజేయుటయే నీ యాదర్శ ములని జ్ఞప్తియం దుంచుకొనుము. ఇదియే యాంగ్లేయుడు హిందూ దేశమునం దుండుటకు నర్హత నొసంగును. ఇది యిటనున్నపు డతని ధర్మనిర్వహణమునకు జేయూతగను, ఈదేశమును విడిచిపెట్టి సీమ కేగినపుడు స్మర్తవ్యముగను నుండును. నే నింతకంటె మఱి యే యుద్దేశముతోను హిందూదేశమున వ్యవహరించి యుండలేదు. దీనికి హిందూదేశమే సాక్షి."

కర్జను ప్రభువు వెళ్లిపోయెను. కాని యితడు జూపిపోయిన యాదర్శవిధానమును మన మనుకరింప వలెను. హిందూదేశమునకు సర్వస్వము నొసగి తన

7 సంవత్సరముల కాలములో భూమిని పదనుజేసెను గాని పంట యింకను లభింపలేదు. "ముందునకు సాగిపొండని ఐసిరియల్ బిడ్డలతో నుడువుడు" అని భగవంతుడు సూయజ్ జలసంధివద్ద యూదులతో జెప్పెను. కాని హిందూదేశపు బిడ్డలు తమకును, ఆంగ్లప్రభుత్వము వాగ్దత్తముగావించిన మధుక్షీర ప్లావితమగు భూమికిని మధ్యనున్న జలసంధిని తమపాదములు రు 600 కోట్ల ఋణశృంఖలముచే బంధింపబడి యున్నంతకాలము దాట జాలరు.

కర్జనుప్రభువుయొక్క నాగళ్లలో సహకార పరపతి సంఘముల చట్టమే ప్రధానమయినది. అతడు హిందూదేశమును విడచి 20 సంవత్సరములు గావచ్చి నను ఆనాగలి ఒకచాలుగూడ దున్నలేదు. హిందూదేశపు ప్రభుత్వనాణకార్థిక సంఘము (Royal currency Finance commission) మఱచిన 700,000 గ్రామములలో 630,000 గ్రామములంగల సహనస్వ రూపులును, నమ్రభావులును, శాంతప్రకృతులును నగు కోట్లకొలది ప్రజలింకను ధనమును, ఉపాధ్యాయులను, వైద్యులను ఆసించుచునే యున్నారు. బ్రిటిషుస్వాతంత్ర్య పతాకముక్రింద ముప్పాతికమంది యింకను నంధకార కూపమున బడియుండి సాహుకారుచే బందీకృతులై

యున్నారు. సకాలవర్షమునకు నోచినరైతు సర్ బెసీలు బ్లాకెట్‌గారి నతని గృహమున కత్యంతోత్సాహముతో సాగనంపుచున్నాడు. ఇతడు రైతుకు రు 600 కోట్ల ఋణ బంధముల జిక్కించి, స్వదేశమున కుత్సాహముతో నరుగునా ? ఇదియా ధర్మము !

కర్జనుప్రభువు కాలమున నేను కొంతకాలము శాసనసభయందున్నప్పుడు, ఆతని యార్థిక మంత్రియగు సర్ ఎడ్వర్డులాగారు నన్ను వ్యవసాయమును గూర్చి ముచ్చటింపుమనియు, తాను దానికి బలపఱతుననియు, నుడివెను. మేమిరువురమట్లే మాధర్మములు నిర్వహించితిమి. అట్లే వైస్రాయి (ఇర్విను) గారి యార్థికమంత్రి స్టేట్ కౌన్సిలును, సామ్రాజ్యశాసనసభను వ్యవసాయమును గూర్చి ముచ్చటింపుమని కోరి వానిని బలపఱచునా ? ఒక వంగదేశ యంత్రజ్ఞుడు కనిపెట్టిన నూతనమగు నినుపనాగలిని గాంచ నెడ్వర్డులాగారి వెంట నేను వెళ్లితిని. ఎడ్వర్డులాగారు తన స్వదేశీయులగు ఐరిషు బ్యాంకింగు కమీషను వారివలె హిందూదేశ జీవనమున నాగలి ప్రాముఖ్యమును గ్రహించెను. అతడు కర్జను ప్రభువుతోబాటు దీని నభివృద్ధిగావింప శక్తికొలది పాటుపడెను. దీనిని జ్ఞప్తినిడుకొని సర్ బెసీలు బ్లాకెట్టు హిందూదేశపు నాగలియగు 'సహకారము' నభివృద్ధిగావించునా?

"ఎంత క్లిష్టముగ నున్నను పరిపాలన సమస్యల నన్నిటిని శాఖలుగ విభజింపవచ్చును. అందు 5 ఎకరముల పరిమితి భూమియు, 5 ఎకరముల హక్కుదారు భాగ్యమును' అనునవే సర్వప్రధాన సమస్యలు." రైతు తన వ్యయములకు వలయు ధనమును సంపాదించుకొనగలిగిననాడు. సక్సెసేలుగారి వ్యయ పత్రము తనంతట తానే పరిష్కరింప బడును. ప్రపంచములో రైతుల నెత్తిపై నుండి రు. 600. కోట్ల ఋణభారము తొలగిననాడే హిందూదేశమునకు ఉత్తమధనాగారము లభింపగలదు. నేటి రిజర్వుబ్యాంకు చట్ట మసంపూర్తిగనున్నది. ఇది తమ్ము తాము బాగుగ చూచుకొనగల 4 వ వంతు వ్యాపారుల సౌకర్యములకే యేర్పడనున్నది. ప్రతి రాజప్రతినిధి దృష్టియందు ప్రధాన లక్ష్యముగ నుండదగినవారు, వార్తాపత్రికల జదువజాలనివారు, రాజ్యాంగ పరిస్థితులందు జోక్యము లేనివారు, శాంత నమ్రస్వభావులునగు నూటికి 80 మంది గల రైతుల కిది స్థానము నొసగనేలేమ. రైతు, రాజప్రతినిధియొక్క ప్రధానలక్ష్యమే యగుచో, నతడు ప్రతి ఆర్థిక మంత్రికిని శిష్ట, సామ్రాజ్య శాసన,సభలకును ప్రధాన లక్ష్యముగనే యుండవలెను. కాబట్టి హిందూ దేశమున పాతికపాలున్న వ్యాపారుల సౌకర్యమునకు, నూటికి ముప్పదివంతున 'రిజర్వుబ్యాంకు'

మూలధనమునుండి 'ఇంపీరియల్ బ్యాంకు' తీసికొనుచో, ముప్పాతిక పాలున్న రైతులకు మిగిలిన 70% ఒసగుట ప్రభుత్వపు కనీసధర్మము. దీనిని గావించుటకు ఐరిషు బ్యాంకింగు కమీషనువారు ఐరిషుగ్రామ ప్రజలకు చేసినట్లు, రాష్ట్రీయ సహకారపు పరపతి బ్యాంకులను ప్రజలకు ధనసౌకర్యములను గావించు నఖిల భారత సహకారపు పరపతి సంఘముతో సమ్మేళన మొనరింపవలెను. రైతులకును వ్యాపారులకును వలసిన ధనము స్వర్ణప్రమాణ, పత్రనాణక సంగ్రహమునగలదు. నేటి సహకారపరపతి శాఖయందు రు 50,60 కోట్ల మొత్తముకలదుగాన తాను రిజర్వుబ్యాంకునకు నూటికి 70 వంతు చెల్లింపవలసిన ధనము రు $3\frac{1}{2}$ కోట్లను సులభముగ చెల్లింపగలదు. అప్పుడు ప్రజలకు గావలసిన పరపతి ధనము మొత్తమును రిజర్వుబ్యాంకునుండి తీసికొనగలరు.

'హిందూదేశ సంపదలు సామ్రాజ్యార్థిక పరిస్థితులను చక్కబఱచుటకు బలియొసగ రాదనుటలో కర్జను ప్రభువుభావమేమియో తెలియదు కాని రైతుల ధనసౌకర్యముల కొఱకు కర్జనుప్రభువుచే స్థాపింపబడిన సహకారపరపతి యుద్యమమును రిజర్వుబ్యాంకునుండి వేరుచేయుచో హిందూదేశసంపదలు సామ్రాజ్యార్థిక పరిస్థితులను చక్కబఱచుటకు బలియొసగబడుట

వాస్తవమని నుడువవచ్చును. రిజర్వుబ్యాంకు రైతునకు ధనమొసగుపద్ధతి నవలంబింపనిచో పాశ్చాత్యకోశాధికారులాడు బంగరుజూదమున హిందూదేశ మొకచిన్న పణముగ మారిపోవును. అనగా కర్జనుప్రభువు కృషిగావించిన శాంతసహన విధేయతలుగల శక్తిని 25కోట్ల రైతులయందు సక్రమనిర్మాణ మొనరించుచో, నప్పుడు ప్రకటమగు మహాశక్తినిగాంచి పిరుదద్దరిల్లుచున్నారనియే భావము. వలన,నిర్మాణము గావింపబడిన 25కోట్ల ప్రజల శక్తి గోధుమపంటల నెక్కుడుగ పండించి, పాశ్చాత్యుల కెగుమతి గావించి, తమ బంగారమును వశపఱచు కొనగలరని భీతిజెందుచున్నారు. నేను వారు కాలూని నిలువబడుట కాధారమైన బంగరుపునాది (Gold Base నశించును. ఇది ప్రాగ్దేశము వంకకు ప్రవహించుచుండినపుడే 'ఇంగ్లాండు బ్యాంకు గవర్నరు' బంగారముతో మానవుడు జీవింపజాలడని గ్రహింపగలడు. ఆతడుఇంగ్లాండుబ్యాంకును స్థాపించినది స్కాచ్ దేశీయుడని తెలిసికొనును. ఈ విషయమై తెలిసికొనగోరినచో 'డివలిమెంట్సుఆఫ్ బ్యాంకింగు' అను గ్రంథమును చదువుచో నందు పూర్వపు స్కాచ్ బ్యాంకుదారు కాగితపు ధనబీజమునుండి ఓట్సుధాన్యమును బండించి తనదేశమునకు బంగరుపంట నెట్లు సంపాదించినదియు గమనింపగలడు.

హిందూదేశ విధానమునకు బంగారము పునాది యగుచో, నదియు నీ బంగారుజూదమున జోక్యమును కలిగించుకొని పాశ్చాత్య ధనాధికారుల నోడించియే యుండెడిది. బర్కెనుహెడ్డుప్రభువు తనకు కోశవిధాన మును గూర్చి యేమియు తెలియదని నుడివెను. ఇది వాస్తవమే. అతనికి కోశవిధానము తెలిసినచో, హిందూదేశము ధనానవసరముతో బాధపడు చుండగా నితడు హిందూదేశపు బంగారమును, ఆంగ్లప్రభుత్వమున కును, సామ్రాజ్యమునకును ఋణమొసగ సమ్మతించెడి వాడుగాడు. హిందూదేశ ధనవిధానమునకు బంగార మును పునాదిచేసినచో ఈ పునాదిని బలపఱచుటకే హిందూదేశ ప్రభుత్వము తన బంగారము నంతటిని వెచ్చపెట్టవలసియుండును. స్వర్ణప్రమాణ సంగ్రహము నందు నాలుగు కోట్ల పౌ॥ బంగరు ఋణపత్రములు (Gold Securities) గలవు. వీనిని లండనులో విక్రయించి, ఇంగ్లాండు బ్యాంకునుండి బంగారమును తీసికొన వలెను. హిందూదేశపు బంగారు పునాదులు బలపఱుప, ప్రభుత్వ మీ బంగారమును వశపఱచుకొనవలెను. సక్రమమగు బ్యాంకు విధానముతో నది యీ బంగార మును, ఇంత కెసిమిది రెట్ల పరపతిగమార్చి దేశకల్యాణ మునకు వినియోగింపగలదు. ఈ నాలుగుకోట్ల పౌ॥

బంగారమునకు ప్రతిఫలముగ హిందూదేశమునకు నేడు లభించుచున్నది, ఆంగ్ల ప్రభుత్వముల యొక్కయు, సామ్రాజ్యములయు నూటికి 5 వంతున వడ్డీ నొసగు ఋణపత్రము మాత్రమే. ఇంతకంటె, హిందూదేశ రాష్ట్రియప్రభుత్వ ఋణపత్రములకును, అఖిలభారత సహకార పరపతి సంఘ ఋణపత్రములకును ఎన్నియో మడుంగుల మూల్యమువచ్చును. ఏలన, నివి ప్రభుత్వము నకు నూటికి 5 వంతున నొసగు వడ్డీతోబాటు, పంట కాలువలకును, వంగదేశమున ముఱుగు వసతులకును, వ్యవసాయకార్యములకును వినియోగించుచో పంటల రూపముగ నూటికి నూరురూపాయల లాభమును లభింప జేయును. ఇది యీక్రిందివిధముగ నగును.

| | |
|---|---|
| రాష్ట్రీయ ప్రభుత్వములయు, అఖిలభారత సహకార సంఘములయు, నూటికి 5 వంతున వడ్డీలనొసగు (ఋణపత్రములగు) 4 కోట్ల-పౌనులను 8 తో గుణించిన 32 కోట్ల పౌ. అగును. దీనిపై నూటికి 5 వడ్డీ చొ॥ న | 16,000,000 పౌ |
| పంటలవలనలాభము నూటికినూరుచొ॥ | 320,000,000 పౌ. |
| మొత్తము. | 336,000,000 పౌ. |

| | |
|---|---|
| ఆంగ్ల ప్రభుత్వముయొక్కయు, సామ్రాజ్య వలస దేశములయొక్కయు, ఋణపత్రముల వలన 40,000,000 పౌ. కును నూటికి 5. వంతున వడ్డీ | 2,000,000. |
| హిందూదేశపు స్వర్ణప్రమాణ సంగ్రహమును ఆంగ్ల ప్రభుత్వము వద్దను, సామ్రాజ్య వలసదేశముల వద్దను, ఋణపత్రముల రూపముగ నుంచుటవలన గలుగుచున్న సాంవత్సరిక నష్టము. | 334,000,000. |

దీనినిబట్టి హిందూ దేశము గర్భదరిద్రముగనున్న దన్నను, లిన్‌లిథుగో ప్రభువుగారి రాయల్ వ్యవసాయ కమీషను దరిద్రుడును దుర్బలుడును నగు రైతునుగాంచి, విచారపడిన దన్నను నాశ్చర్యము గలదా ?

“నలుదెసల విచ్చలవిడిగ వెదజల్లినదే వృద్ధి నొందును. అవసరమగుదానికంటె నధికముగ దాచిపెట్టు కొనుటచే దారిద్ర్యము సంభవించును”అనియొక ప్రాచీనార్థ శాస్త్రవేత్తనుడివెను. ప్రాచీనస్కాటిష్ బ్యాంకుదారు బైబిలుచదివి అర్థశాస్త్రమును, మంచికోశవిధానమును నర్థము చేసి కొనగలిగెను. స్కాటిష్ బ్యాంకుదారు వెద

జిమ్మి, వృద్ధిగావించుకొనెను. అతని యాంగ్లసోదరుడు బైబిలునకు విరుద్ధముగ, అనగా గాంధిమహాత్ముడు నుడివినట్లు నరకపద్ధతి నవలంబించి దాచుకొనుటచే దారిద్ర్యమువంకకు మఱలనయ్యెను. ఆర్థికమంత్రి సక్రమముగ తనధర్మమును నిర్వహించి, 25 కోట్ల ప్రజలను సక్రమనిర్మాణము గావించి, పత్రధనబీజముల వెదజల్లి, పాశ్చాత్య దేశములనుండి బంగరు ధాన్యమును ప్రోగు జేయునుగాత !

## రైతు—అమితము (Ryot & the Glut)

హిందూదేశపు టింపీరియల్ బ్యాంకు తనయాంత్య నివేదికయందిట్లు వ్రాసెను. "గతించిన యర్థసంవత్సరము నందు వర్తక క్షీణస్థితిని, ఆహారపదార్థముల క్షీణతను, గోగునార కదను లేమిని గాంచితిమి. అందువలన ధన మపరిమితముగ మార్కెట్టులో నిలువ యుండెను. ఈ ధనమునకు ఫలము (వడ్డీ) నిచ్చుమార్గములు గను గొనుటలో బ్యాంకునకు చాలకష్టములు సంభవించెను."

ఈ ప్రవాహమున కవ్వలి తీరమున రైతు అపరిమిత ఋణములో చిక్కుకొనియున్నాడు. అతనిని గూర్చి సర్ పురుషోత్తమదాసు ఠాకూరుదాసుగారు నాణక-ధనసంఘమున (Currency & Finance Commission) నిట్లువ్రాసెను.

"హిందూదేశపు రైతుల, సామాన్య ప్రజల ఋణభారము మనదృష్టినాకర్షించుచున్నది. 'కాలువల క్రిందసాగు చేసి యెక్కుడుగ పంటలను పండించు పంజాబు రైతుతో జేరి పేరిఋణము రు 600, కోట్లకు పైబడియున్న'దని పంజాబురాష్ట్రపు ఐ. సి. యస్. ఉద్యోగియగు డార్లింగు గారనిరి. ఎంతవిచిత్రము! ఒక తీరమునందపరిమిత ధనమును మరియొక తీరమందపారమగు ఋణమునుగలవు. ఈ రెండుతీరముల మధ్యనుగల ప్రవాహముపై వంతెన లేదు. ప్రభుత్వధనాగారధన మొకతీరమున కోట్లకొలదిగ నిరుపయోగముగ మూల్గుచుండినను వేరొకతీరమునగల 20 కోట్లప్రజలు దీనినిబొందవంతెనలేక విలపించుచున్నారు. పరిస్థితులిట్లుండుటకు హిందూదేశబ్యాంకు విధానమున నేదోగొప్ప లోపముండితీరవలెను. ఈ నదిపై వంతెన నిర్మింప మ్యానేజింగు గవర్నరులు, డైరెక్టరులు ఏలప్రయత్నింపరో? రెండవతీరమున నమ్మకము మిక్కుటముగనున్నది. అందువలన లాభమునిశ్చయము.

దీనికి సమాధాన మొసంగుట సులభమే. తమ నిర్మాణ విధానమువలనను, వ్యాపార విధానము వలనను ఆంగ్లసమష్టి మూలధనాగారములు (English Joint Stock Banks.) వ్యవసాయమునకు ధనమును విరివిగ నీయజాలవు. ముఖ్యముగ హిందూదేశ రైతునకు వల

యు ధనము నొసగజాలకున్నవి. ఇవియిచ్చు ఋణములు ( Loans ) ముఖ్యముగ వీనికి లభించు డిపాజిట్లులపై నాధారపడి యున్నవి. వీని డిపాజిట్లులడిగినప్పుడు చెల్లింపవలెను గావున, నవి తమ ధనమును 3 లేక 6 నెలలకంటె నెక్కుడు కాలపరిమితి పై ఋణము లొసగి సంకటముల పాలుగావు. ఇంగ్లాండు బ్యాంకులు ఉత్పత్తిదారులవి గాక వ్యాపారుల వగుట చేతను, హిందూదేశమున ప్రధాన వృత్తి ఉత్పాదకమగు వ్యవ స్యాయ మగుటచేతను, దీనికి పెద్ద వాయిదా ఋణము లవసర మగుట చేతను. ఈ బ్యాంకులు హిందూదేశ మునకు ప్రయోజన కరములు గానేరవు. ఆహారము నితర ప్రదేశములకు బంపుటకంటె నాహారము నుత్పత్తి జేయుటయే చాల యవసర మనుట వాస్తవము. కాబట్టి హిందూదేశమున వ్యవసాయ దారున కవసర మగు ధనము నొసగగల బ్యాంకు లుండవలెను. అట్లు గానిచో నీ దేశమునకు లాభము లేదు. మారకపు జూదము నణచుటకు బ్యాంకు రేటును నూటికి 7 వంతున వృద్ధి జేసిరి. కాని యే కొలదిమందియో తప్ప హిందూదేశ ప్రజ లెల్లరును నూటికి 70 వంతున బ్యాంకు రేటుచే క్రుంగి కృశించుచున్నను లక్ష్యపెట్టువా రెవ్వరును లేరు. ఈ యమిత ధనమును, అమిత ఋణ

మును సహకారోద్యమము తప్ప మఱి యేదియు కలుప జాలము. దీనికి మోక్ష మెన్నటికో! సామాన్య ప్రజలెల్లరు నూరు సంవత్సరముల క్రిందట నెట్లుండిరో నేడును నట్లే యున్నారు. కొలది కాలము క్రిందట, నేను హిందూదేశ ప్రభుత్వ వివిధ శాఖలపై హైందవోన్నతోద్యోగు లేడుగురచే వ్రాయబడిన బ్రిటీషు హిందూదేశ చరిత్రను గాంచితిని. వారు 1844 వ. సంవత్సరపు హిందూదేశ గ్రామ జీవన విధానము నిట్లు చిత్రించిరి.

"హైందవ కర్షకుని స్థితి యతని ఋణభారము వలన గతిహీనముగనున్నది. నూటికి 36 వంతున వడ్డీ వేసి అతనికిగల కొలదివసతులు గూడ నపహరించుచు సాహుకారు బాగుపడుచున్నాడు. పదుగురలో నెన మండుగురకు నదనున విత్తనములకును, వారి గ్రాసమునకును ఋణములొసగి పంటరాగానే సాహుకారును, జమీందారును దానిని స్వాధీనము గావించుకొని రైతును పీల్చి పిప్పిచేయుచున్నారు."

1884 వ సంవత్సరపుస్థితి యిది. నాటినుండి నేటి వఱకభివృద్ధియేమి? 'మ్యాక్లగన్' సహకార సంఘము 1913 లో నిట్లు నుడివెను.

"హిందూదేశమున పెక్కుప్రదేశములందు రైతుల యార్థికస్థితి సరిగ లేదనియు, ఋణభారము తఱుగుటకు

మారుగ పెరుగుచున్నదనియు, వడ్డీరేటు ఎక్కుడగు చున్నదనియు, వ్యవసాయవిధానము వృద్ధిగాలేదనియు, సంతృప్తికరములగు ప్రాచీనార్థిక పరిస్థితులే పాదుకొని యున్నవనియు, స్పష్టముగ తెలియుచున్నది."

1924-25. లో హిందూదేశ నైతికార్థిక పరిస్థితు లిట్లు ప్రకటింపబడెను. "హిందూదేశదారిద్ర్య సమస్య వృద్ధిగాంచు చున్నదని గ్రహింపనగు. ప్రజలువృద్ధిగాంచు చున్నను, ప్రాచీన సాంప్రదాయములను సంస్కరించు కొనక తమకులభించునవకాశముల నాసాంప్రదాయముల యందు దిగ్రొక్కుచుండుట ఇందుకుమూలము. ఈయవకాశములవలన కాలక్రమమున హిందూదేశపు వ్యక్తిభాగ్యము సగటున పెరిగి దేశభాగ్యము పెంపొంద వచ్చును. తనకృషి వలన, విద్యాధికుల సాయమువలన హిందూదేశపు రైతు బాగుపడనిచో ప్రభుత్వము శాస్త్రీయవ్యవసాయ ప్రచారమును, సహకారసంఘ ములద్వారా మితవ్యయప్రచారమును, తమకుదాము సాయపడు విద్యావ్యాప్తిని తప్ప మరేమియు చేయజా లదు." "పట్టనవాసులగు కూలీలపరిస్థితులు, విధానములు పల్లెల రైతులను బోలియున్నవనియే చెప్పనగును."

కావున రైతును, అట్టివాడగు నతని కార్మికసోద రుడును, తీఱుటకుమాఱు పెరిగిపోవుచున్న ఋణభార

ముచే నార్థిక నైతికములందు క్షీణించి నాశమగుచు న్నారు. వీరికిధనముగూడక పూర్వమే మృత్యువువాతను బడి శ్మశానవాటిక కరుగుచున్నారు. వీరిపుత్రీభార మును వహించి, వంతెనలేక యధికఋణమునుగల నదీ తీరమున, తమతండ్రుల ననుకరించి, మృత్యువు వాత బడుచున్నారు. బ్యాంకు విధానము నకును శ్మశాన వాటికకును చాల సంబంధముగలదు. నైతికార్థిక నివే దిక యేమనుచున్నదో చూడుడు. "హిందూదేశ ప్రజా రోగ్య కార్యములలో శిశుమరణముల సమస్య విచార కరమైనది. ప్రతిసంవత్సరమును అచట 20 లక్షల బాల బాలికలు మరణించుచున్నారు. పుట్టిన యేటనే 5-6 గురి కొకడు వంతున గిట్టుచున్నాడు. ఇట్లు చచ్చువారు పట్ట ణములలో కొన్ని తావుల వేయికి 200 మొదలు 600 వరకును గలరు. ఆంగ్లదేశమున నన్ననో సగటున వేయికి 80 మంది మరణించుచున్నారు."

శోచనీయము లగు హిందూదేశ శిశుమరణములు దుర్భర దారిద్ర్యము వలననే తటస్థించుచున్నవి. ఏలన, ధనము లేనిచో వైద్య సహాయమును విద్యావివేకమును, ఎక్కడివి? సాహుకారును, కోర్టులును, నీ శిశు మర ణములను బెంపొందించుచున్నవి. ప్రతివ్యక్తికిని, బ్యాంకు సాయము లభింప నంతవఱకును ఈ మరణము లిట్లు

విజృంభించుచునే యుండును. నీల గ్రంథములలో (Blue Books) గొప్ప యుద్యోగులు వ్రాసిన యీ క్రింది విషయముల గాంచుడు. ఇవి హిందూ దేశాంధకారబంధుర దశను విశదము చేయుచున్నవి. ఈ నీలగ్రంథములే, అంధకార కూపమునుండి వెలువడు మార్గములను గూడ జూపుచున్నవి. కాని ప్రభుత్వము వాని నాచరణయందుంపవలెను. నైతికార్థిక నివేదిక యిట్లు తెలుపుచున్నది.

"పైన మనము గాంచిన విచారపరిస్థితులను బట్టి ప్రజల నభివృద్ధిగావించు సక్రమ నిర్మాణవిధాన మావశ్యకమని విశదపడుచున్నది. ఇట్టియభివృద్ధి కావశ్యమగు నుత్సాహమును నేడు ప్రజలయందు గానబడదు. పరిపాలకులు మాత్రమే దీని నభివృద్ధి గావింపజాలరు. జయమును వాంఛించుచో ప్రభుత్వావిరళ కృషికితోడు ప్రజల కృషియు నావశ్యకము. దీనికి తగిన యౌషధము సహకారోద్యమమున గలదు."

దీనికిదోడు విద్యార్థికుల ప్రోత్సాహమున్నచో, నంధకారమునుండి వెలుతురులోనికి వచ్చుమార్గ మేర్పడును. తమదేశమును నిర్మాణవంతమును గావించుకొని, తమప్రజలను, బిడ్డలను సంరక్షించుకొనగోరు యువకులు వేనవేలుగలరు. కాని యితరులవలె నీవిద్యార్థి

కులు గూడ జీవింపవలెను గదా! దీనికివలయు ధన సౌకర్యమును గూర్చి మఱియొకచోట వివరించెదను. హిందూదేశ ప్రజలు దారిద్ర్యస్థితినుండి సౌభాగ్య సంపన్నస్థితికి జేరుటకు హిందూదేశ సహకార ధనాగార విధానమును సంస్కరింపవలసి యుండగా నిష్ప్రయోజన మును, అమెరికానిరసించునదియు, పెద్ద వారియుదారఋణ ముల నీయజాలనట్టిదియు నగు ఇట్టిదానివలనలాభము లేదని యెఱిగియు, వ్యవసాయ ప్రధానమగు హిందూదేశము నకు అమెరికావారి బ్యాంకువిధానమును నెలకొలుప ప్రభుత్వము వాంఛించు టేలకో గ్రాహ్యముగాకున్నది.

ఈ యమెరికాసమాఖ్య ధనాగార పద్ధతిని (American Federal Banking System) గూర్చి యాదేశపు రైతులయభిప్రాయములు దెలియునా? లండను 'టైమ్సు' పత్రికలో 'అధ్యక్షుడు, రైతులు, అను వ్యాస మునందిట్లు వ్రాయబడెను. "బహిరంగ సమస్యలెంత విచిత్రముగనుండి యుత్సాహమును గలిగించినను నవి య ప్రధానములే. సెనెట్టు సభ్యులకును, కాంగ్రెసు సభ్యుల కును, తమదుస్థితిని వెలిబుచ్చు నమెరికారైతుల సమ స్యల యెదుట నితరదేశసమస్యలు నిస్తేజములుగ నుండ వలెను. ఇతర సమస్యలు వచ్చుచుండును, పోవుచుండును. కాని రైతుల దుస్థితిలోగడ కాంగ్రెసును బాధించి

నటులే 69 వ. కాంగ్రెసును గూడ బాధించుచున్నది. దేశమున నేడు వారేయెక్కుడు దీనస్థితియందున్నారు. అమెరికా చరిత్రము వ్యవసాయవిషయక విపత్పరంపరాగ్రస్తము. "(హిందూదేశము దీనికంటె సహస్రగుణాధికముగ బాధాపరిపూర్ణమైయున్నది.) "అమెరికా రైతు కష్టములు పాపనిచో మనదెత్తిపై మొట్టు"నని మిడిల్ వెస్ట్రిక్ సెనెటరునుడివిన వాక్యములును, 19. వ. శతాబ్ది ప్రజాపక్షమును, "తక్కువ పంటలను, నెక్కువ నరకమునుత్పత్తి చేయుడు' అని కాన్సాస్ రైతులకు మిసెస్‌లీజు ఒసగిన సలహాయును, కోశవిధానము నందా ప్రజలకు బెంపొందిన యసంతృప్తిని బ్రకటించుచున్నవి. కాన నేటిస్థితికి యుద్ధము, బ్యాంకువిధానము 1921. వ. సంవత్సరమునందలిపంటలక్షీణత మూలములు. రైతులకు యితరప్రజలకంటెసంకటములలో నెక్కుడుభాగమున్నను అభివృద్ధియందు మాత్రము భాగములేదు. తమసంకటములకు మూలకారణమని సమాఖ్యసంగ్రహసంఘమును (Federal reserve Board) గర్హించిన రైతులకు 1923లో వ్యవసాయపుపరపతిచట్టమునుగావించియుద్ధధన సంఘము(war finance corporation)ద్వారా రైతుల కష్టవిమోచనము నకు మార్గములనేర్పరచిరి. ఫెడరల్ రిజర్వుబోర్డు (Federal Reserve Board) యొక్క

వట్టపురేట్ల (Discount rates) వృద్ధియు, ధరలక్షీణతయు, పరపతిఋణముల దీర్చుటయును (Credit liquidation) బ్యాంకుసంరక్షణ కొఱకు రైతులపంటలను తక్కువ ధరల కమ్మునట్లొత్తిడి పెట్టినవి. కాని నిర్బంధముచే, రైతుపరపతి సౌకర్యములెక్కుడుగ సంపాదించు కొనగలిగెను".

ఆంగ్లపరిపాలనా రంభమునుండియు హిందూదేశపు రైతుతనకునరకమును, ఇతరులకొఱకువడ్లు, గోధుమలు, ఇత రాహారపదార్థములను పైరుచేయుచున్నాడు. ఈవిధానము దలక్రిందగుకాల మాసన్నమైనది.
హిందూదేశపురైతు తనచిరకాల ఋణభారమును రూపుమాపుకొనుటకును, తనజీవనసౌకర్యమున కావశ్యమగు విధానమును కొనసాగించు కొనుటకును, కావలయు ధనమును కూర్చుకొనుటకును, పెద్దవాయిదా ఋణావిధానమును వాంఛించుచున్నాడు. ఇతడు పంట నీటికి చెఱువులు బావులు త్రవ్వుకొనుటకును పెద్దవాయిదా ఋణవిధానము నభిలషించుచున్నాడు. రైతుల వ్యవసాయాభివృద్ధికిని, బావులు త్రవ్వుకొనుటకును పెద్దవాయిదా ఋణ విధానమును బ్రోత్సహించుచు, 1901-3వ. సంవత్సరమున 'సర్ కొలినుసాట్- మాక్రేఫ్' వ్యవసాయ జలాధారసంఘ మిట్లు నుడివెను.

"194 పేరా:—ఈపెద్ద వాయిదా ఋణవిధానము హిందూదేశమునం దన్ని భాగముల నేర్పఱుప వలెను. వ్యవసాయవృద్ధిని వాంఛింపని ప్రదేశమే లేదు. గాన ప్రభుత్వ మీవిషయమున బూర్తిగ తనశక్తిని విని యోగింపవలెను. ఈ సిద్ధాంతము నాచరించుట కొఱకు దీర్ఘ కాలనియమ శాసనము గావింపజనదు. మఱియు నట్టి దీర్ఘకాలము ఈవరకున్న 35 సంవత్సరములకు మించజనదు. కాని పరిస్థితులనుబట్టి 50 సంవత్సరముల యవధిమంచిది."

వ్యవసాయ జలాధారాభివృద్ధి సంఘము గావించిన 44 కోట్ల పంటకాలువల సాగుబడివిధానము పూర్తి యగుచున్నది. కాని జలాధారాభివృద్ధిసంఘము చెఱువులను, బావులను వృద్ధిగావించుకొనుటకు రైతులకు ధన మొసగవలయునని సూచించిన విధానపుగతి యేమి? ఈ కార్యసాధనమునకు హిందూదేశపు బ్యాంకింగు కమీషనేమి సిఫార్సులు చేసినది? ఏమియు చేయలేదు.

బావి త్రవ్వకొనుటకుతన కొసగు రు 1000 తో నీ దీనకర్షకుడు రు 50,000 విలువగల యాహారమును 50 సంవత్సరములలో బెంపొందింపగలడు. భాగ్యవంతు డేమియు నుత్పత్తి చేయజాలకపోగా ప్రజల ధనమునుండి తమకు వలసినవానినెల్ల సమకూర్చుకొనుటచే, ప్రజలు

ధనమును, ఆహారమును లేక నైతికార్థికముల వెనుకబడి కృశించుచు మరణించుచున్నారు. ఇట్టి కోశవిధానముచే హిందూదేశమున నెల్లరకు ధనము సులభముగ లభించి నిశ్చలముగ మంచి బలవంతముగ నుండునని నుడువుచున్నారు. హిందూదేశమున స్థాపింపనున్న ఆంగ్లో అమెరికన్ బ్యాంకువిధానము, హిందూదేశ జీవితాధారమగు వ్యవసాయమున కెట్టిసౌకర్యమును చూపకుండుటచేతనే వాంఛనీయముగాదు. ఇది సులభమునుగాదు. నిశ్చలమును గాదు. ఇది బొంబాయిద్వారా బంగారమును యూరపునకు బంపి, క్షీణించుచున్నవారి బంగారు పునాదులను బలపఱచుటకే గావింపబడినది. ఇట్టి దుస్థితిలో మార్క్సు్వెయిను నుడివినదాలించి అమెరికా రైతీహాస్యము నెట్లనుభవించినదియు చూచుట మంచిది.

హిందూదేశమునకు తన రు 600 కోట్ల ఋణవిముక్తికై చెఱువులను, బావులను త్రవ్వుకొని సమృద్ధముగ పంటలు పండించుకొనుటకు పెద్ద వాయిదా ఋణసౌకర్యములను గావింపనిచో, నట్టి రిజర్వుబ్యాంకు ఏమియు నుపకారము చేయజాలదు. అప్పుడది ప్రవాహమార్గము లేక పరపతి నిల్వవృద్ధియగును. అప్పుడు రెండవ తరమునగల ప్రజలు బహుళఋణభారముచే నాశమగుచుందురు. దీనితో ఇంపీరియల్ బ్యాంకును, ప్రజల బ్యాం

కగు సహకారపు పరపతిసంఘమును, నైక్య మొనరించి నచో నీ కాలువద్వారా పరపతి ప్రవహించి, హిందూ దేశ భూములను ఫలవంతములు గావించును. ఇట్టి మూటి సంయోగమువలన ప్రపంచమునం దన్నిటికంటె గొప్పబ్యాంకు హిందూదేశమున నుండగలదు. ఈ సంయోగము లేనిచో, హిందూదేశము నిర్మాణ శూన్యముగను, విభాగవంతముగను నుండును. అప్పుడది యొక దేశముగ నుండజాలదు. ఒకదేశమును—రాజ్యమును నీ విధముగ విభజించుచు వచ్చినచో, నాదేశము-రాజ్యము నిలువజాలదు. హిందూదేశము న్యాయసమ్మతమగు తన రైతుల యభీష్టమును ఈ రైతు రాజప్రతినిధి మూలమున బడయవచ్చును. ఏలన

"ఎంత క్లిష్టముగ నున్నను పరిపాలన సమస్యల నన్నిటిని శాఖలుగ విభజింపనగు. అందు 5 ఎకరముల ఖండమును, 5 ఎకరముల హక్కుదారు (రైతు) భాగ్యమును అనునవే సర్వ ప్రధానసమస్యలు."

రైతు — రూపాయనోటు.

దీర్ఘకాలమునుండి నాకుమిత్రులుగనున్న రిట్రెంచి కమిటీవారు తమగొడ్డలితో హిందూదేశార్థిక మహా వృక్షమునుండి రూపాయనోటును ఖండించి, దేశపు నైతికార్థిక జీవితమును చావుదెబ్బకొట్టిరి. ఏలన, కాగి

తపునోట్లు-ముఖ్యముగ రూపాయనోట్ల యభివృద్ధి లేనిదే హిందూదేశపు భావిజీవితము గౌరవముగ నుండజాలదు. వెండికంటె కాగితము చౌక. వెండి రూపాయకంటె నోకరూపాయనోటు చౌక. కాగా మితవ్యయమను నెప మున నీరూపాయనోటు నేల తొలగించిరో గ్రాహ్యము గాకున్నది. మఱియు నితర భాగ్యవంతములగు దేశ ములన్నియు నమూల్యములగు లోహములుమాని, కాగి తపు నోట్లనే వృద్ధిచేసికొనుచుండ దరిద్రహిందూదేశ మెందులకీ నాణెములు వాంఛింపవలెనో గోచరింప కున్నది.

హిందూదేశము వాంఛించు ధనవిధానము నాణె ముల రూపమునగాక, పరపతిరూపముననే యుండ వలెను. హిందూదేశ ప్రజలలో 30 కోట్లమంది చదు వను, వ్రాయను జాలకున్నస్థితిలో వీరివాంఛలుదీఱగల పరపతిని చిన్ననోట్ల—రూపాయనోట్ల రూపమున నొసగవచ్చును. హిందూదేశమునకు జీవితాధారమై యున్న వ్యవసాయాభి వృద్ధికివలయు ధనసౌకర్యములను గావింపనందులకు నాణక-ధనసంఘముCurrency & Finance Commission) ను నేనుపూర్తిగవిమర్శించి నను రూపాయనోటునుతిరిగి యొసంగినందులకు మాత్రము ప్రశంసించెద. ఏలన నిదిలేనిచో హిందూదేశము

పాతాలమునబడి పైకిరాజాలదు. ధన-నాణకసంఘము (Finance & currency Commission)సూపాయి నోటును పునరుద్ధరించెనుగాని దీనిని దేశీయజీవనమున నుపయోగించువిధమును సూచింపలేదు. దీని యుప యోగ విధమును, ప్రపంచకోశవిధానమును జూపించు వాల్టరు బ్యాగ్‌హాట్టుయొక్క లాంబార్డుస్ట్రీటునుండి గ్రహింపనగు.

"ఏదేశముగాని ప్రథమమున కోశవిధానస్థాపనకు నాణెమునకంటె కొంతయెక్కువవిలువగల కాగితపు నోట్లులేనిదేతనబ్యాంకుయొక్క నిల్వవిధానమును (Deposit Banking Systam) వృద్ధిచేసికొనలేదని బ్యాగ్‌హాట్ నుడివెను. ఇంపీరియల్ బ్యాంకువంటి కేంద్రపుబ్యాంకు సామాన్యప్రజలకు అందుబాటులో నుండదుగాని హిందూదేశమునకు ప్రయోజనములేదు. నోట్లఋణమొసంగు సంఘము అదేమండలములో నివసించి, యామండల పరిస్థితులను, మార్పులను, చరిత్రను, బాగుగ నెఱుగగల బ్యాంకుదారుగ నుండవలెను. ఇట్టి బ్యాంకుదారే యామండలములోని ధనమును తనప్రజలకు సురక్షితముగ ఋణములొసగగలడు" అని బ్యాగ్‌హాట్‌నుడివెను.

కాబట్టి హిందూదేశము పరపతిబ్యాంకు విధానమును వృద్ధిచేసికొనుటకు బూర్వము, కాగితపునోటు విధానము నలవఱచుకొనవలెను. దీనిని సులభముగ వ్యాప్తికి దేవచ్చును. ఈకార్యమును నిర్వహించు పంచాయితీదారులు, పరపతిసంఘముల మూలముననే ఋణముల స్వీకరింపనిచ్ఛగించువారిని బాగుగనెఱింగి యుందురు. కాబట్టి కాగితపు ధనవిధానమును, పరపతి బ్యాంకు విధానమును వృద్ధిచేయవలయు ననినచో బ్రథమమున సహకారపు పరపతి యుద్యమమును వృద్ధిచేయుటత్యావశ్యకము. దీనిని చేయునంతవఱకు, నైతికార్థికాభివృద్ధి హిందూదేశమునకు గలుగ జాలదు.

కాబట్టి యీసహకారోద్యమమునకు వలసినధనపు వసతులు గావించుట బ్రభుత్వపు కనీసమగు ధర్మము. బ్రాముఖ్యము లేక నాలవవంతు సంఖ్యగల వ్యాపారులకు ధనమొసగు ఇంపీరియల్ బ్యాంకు వివిధశాఖలకు విరివిగ ధనసహాయము గావించు బ్రభుత్వమునకు 3/4 వ వంతుండి హిందూదేశార్థిక జీవనమునకు బ్రాణములగు రైతులకొఱకు కర్జనుబ్రభువు స్థాపించిన బ్రజలబ్యాంకునకు శాఖలు నెలకొల్పుటకు ధనమొసగుట బ్రధాన ధర్మము గాదా ?

వ్యవసాయాభివృద్ధికి ధనమొసగజాలని బ్యాంకు విధానము హిందూదేశమునకు నిష్ప్రయోజనము. హిందూదేశము ఆహారపదార్థములను సమృద్ధముగ వాంఛించుటలేదా ? అట్లగుచో, వీనిని లభింపజేయు బ్యాంకువిధానము దాని కవసరము. భారతము మంచి పాడియావులను, పాలను, నేతిని వాంఛించుటలేదా ? అట్లగుచో, వీనిని సమకూర్చు సక్రమమగు బ్యాంకు విధానము దాని కవసరము. అది తాననుభవించుటకు పుష్కలముగ ఫలములు కోరుటలేదా ? అట్లగుచో వీని నొసగు సక్రమమగు బ్యాంకువిధాన మక్కరలేదా? అది తనజీవితము నుత్సాహవంతముగ నొనరింప నధికముగ బంచదారను, ఇతరాహారపదార్థముల నభిలషించుటలేదా ? అట్లగుచో, వీని నొసగు బ్యాంకువిధాన మవసరము. భూమిలోని జలమును బడయుటకు విరివిగ చెఱువులను, బావుల నది కాంక్షించుటలేదా ? అట్లగుచో వీనిని సమకూర్చు బ్యాంకువిధాన మత్యవసరము. అది తన 20 లక్షల బిడ్డలను సంరక్షించుకొన నాసించుట లేదా ? అయినచో నిట్టి సౌకర్యములు గూర్పజాలని బ్యాంకువిధానము దాని కెందులకు ?

"హిందూదేశ ప్రజలలో నూటికి 75 వంతులు గల రైతులను హిందూదేశ కల్యాణమునకు పాటుపడు

డనియు, భూమినుండి పంటల నెక్కుడుగ పండించు డనియును, కోరుటకు పూర్వము వారిని నేడణగ ద్రొక్కు ఋణభారమునుండి తప్పించి, వ్యాధులనుండి విముక్తులగావించి, వారికార్థిక నష్టములను గలిగించు కార్యముల నాపివేయవలెను."

హిందూదేశ నైతికార్థిక స్థితిని దెల్పు నివేదిక యిట్లు ప్రకటించెను. కాని ప్రజల ఋణభారమును తగ్గించుటకును, వారిని దుర్బలులుగ జేయు వ్యాధుల నివారించుటకును, వారి యార్థిక పరిస్థితులు సమమొనరించుటకును నీ క్రొత్త రిజర్వు బ్యాంకు చూపునదెద్ది ? అది చూపునది సున్న. ఈ నైతికార్థిక నివేదికనుబట్టి హిందూదేశ సార్వజనిక కళ్యాణమును సంతృప్తికరముగ నొనర్చుటకు జిన్నాముస్నగు సామ్రాజ్య శాసన సభ్యులకు తావులేదు గాన నాణక-ధనసంఘము (Currency and Finance Commission) లో పాల్గొన నిరాకరించిరి. అప్పుడు సర్ బెసిలు బ్లాకెట్ ఈ కమీషను సర్వ హిందూ దేశీయ కళ్యాణమునే గావింపనున్నదని నుడివినట్లు తెలియుచున్నది. ఈ ప్రకటనమును మన మంగీకరింతము. 1921 వ. సంవత్సరపు జనాభాలెక్కల ప్రకారము నూటికి 73 వంతులు వ్యవసాయదారులును, 5 . 7 వంతులు వర్తకులును మాత్రమే గలరు. కాబట్టి

యీ క్రొత్త బ్యాంకు విధానము నూటికి 73 గల రైతుల కేమిదారి చూపుచున్నదో సర్ బెసీలును ప్రశ్నింపవచ్చునా ? ఈ బ్యాంకు విధానము నూటికి 5 గురు గల భాగ్యవంతులకే సౌకర్యములు గావించి, ఆంగ్ల ప్రభుత్వారంభమునుండి నేటివఱకును ధనసౌకర్యములేని నూటికి 73 గల పేదరైతులను విడచిపెట్టుచో, నీవిధానము నిష్ప్రయోజనము, నిరర్థకము; కేవలమిథ్యా, బంధన స్వరూపము.

'సోమరి ధనమన, సోమరి మనుజులు' అని సర్ బెసీలు నుడివియుండెను. నూటికి 12 నుండి, నూటికి నూరు పరపతిని నిర్మించు నవీనాంగ్ల ధనాగార విధానమునుబట్టి, స్వర్ణపరిమాణము, పత్రధన సంగ్రహము (Gold Standard and Paper Currency Reserves) మూలమున హిందూదేశపు రు 1600 కోట్ల రూపాయలు నిరుపయోగముగ నున్నవి. సర్ బెసీలు, ఈసోమరి ధనమును, సోమరులుగ నున్న రైతులచెంతకు ప్రవహింపజేసి, అమెరికా రైతులవలె నూటికి 5 గురుగ నున్న భాగ్యవంతులవలె జీవింప, హక్కుగల వారికి తోడ్పడ కూడదా ?

వరి ధాన్యము, గోధుమలు, దుస్తులు, గృహములు, రైళ్ళు, బాటలు, పడవలు, కాలువలు, బావులు,

యంత్రములు, బంగారము, వెండి మున్నగు సంపదలు మానవుల శారీరిక, మానసిక శ్రమచేత నుత్పత్తి చేయ బడునవగుచో, శక్తిసంపన్నులును, బలాఢ్యులును నగు మనుష్యుల నుత్పాదక కార్యముల బ్రవేశింపజేయుటకు పరపతినొసగునదే శాస్త్రసమ్మతమగు బ్యాంకువిధాన మని సుస్పష్టము. ఈపరీక్షలో రిజర్వ్‌బ్యాంకు ఏమి సమాధానము నొసగును? దీనికి ప్రత్యుత్తర మొసంగుట కేని ప్రయత్నించపదు. ఇది వాస్తవమునకు వ్యాపారుల బ్యాంకుగాన హిందూదేశ జీవనాధారమగు వ్యవసాయ మునకు ప్రయత్నము గావింపదు. ఇది నూటికి 5 గురుగ నున్న భాగ్యవంతులకొరకే యేర్పడిన బ్యాంకు అగు టచే, నూటికి 73 గురు -నొప్పునగల దుర్బలులును, వారి భార్యలు, హిందూదేశపు బీదలు, శాంత సమాశ్రయు లగు రైతులు ప్రతిసంవత్సరమును మరణించుచున్న 20 లక్షలబిడ్డలు దీనినిధిక్కారపూర్వకముగ గర్హించు చున్నారు.

ఈ క్రొత్తరిజర్వ్‌బ్యాంకు యొక్క ప్రధానధర్మ మును నాణక-ధనసంఘము. (Currency & Finance Commission) ఇట్లు నుడువుచున్నది. "ధనప్రమాణపు (Rupee) కొనుగోలుశక్తిని నిశ్చలస్థితియందుంచుటయే ధనవిధానపు గమ్యస్థానము. కాబట్టి ధనప్రమాణపు

కొనుగోలుశక్తి స్వదేశమునందును, పరదేశములందును నిలుకడగ నుంచుటయే నోట్ల ప్రకటనాధికారమును బ్యాంకుల కొసగబడినపుడు కోరెడిష్వరతు స్వదేశమున నీనిలుకడ దేశీయవస్తువుల సగటుధరలపై నాధారపడి యుండును. పరదేశములందు, ధనప్రమాణమగు రూపాయయొక్క కొనుగోలుశక్తి నిలుకడకును, బంగారమున కునుగల సంబంధముపై నాధారపడియుండును. కాబట్టి బంగారముతో సంబంధముగల దేశముల మారకములు బంగారముతోగాని, బంగారు మారకపు ప్రమాణము (Gold exchange standard) తోగాని యుండును.",

దీనిని సామాన్యులకు విశదపఱుప వలయునని నాణకాధికారము (Currency Authority) అను వ్యక్తి గోతములు (సంచులు) మొదలగు వస్తువులధరలు హెచ్చుని భావించినపుడు, బ్యాంకురేటును హెచ్చించి, ప్రజలు తమయవసరములగు వీనినిగొనుటకు వలసిన ధనము నందకుండజేసి, యావస్తువులధరలు తగ్గించును. మఱియునతడు సాగనారపట్టాలు చౌకయనిభావించుచో, ప్రజలువీనిని సులభముగ కొనుటకుగాను ధనమును ఋణముగ పుచ్చుకొనుటకు బ్యాంకురేటును తగ్గించును. అప్పుడు ధరలు పూర్తిగ పెరుగును. (ఇట్లు ధరలవృద్ధి క్షయములు తన యిష్టమువచ్చినట్లు గావించును.) సర్

ఆంధ్రమా ముష్టే యొక్క భాగస్వాములు రెండవ విధాన మును సమ్మతింతురు. కాని యతడు నాణెముల ధరను (Price of heavyc's) క్షణమాత్రమున పడగొట్ట గల నని భావింపజనదు. ఏలన నాణకాధికారమునకు (Currenecy Authority) బంగారుమొత్తము తగ్గిపోవును. ఈపద్ధతిని అమెరికారైతులు బోధపఱచుకొన జాలరు గాని రైమ్సుపత్రిక నుడివినట్లీవిధముగ జేయు ప్రతివాని పుత్రి బిడ్డలుగొట్టుటమాత్రము గ్రహింపగలరు.

నాణకధనసంఘము (Currency & Finance Committee) విధానమునకంటె కడు సులభమగు ఛాంగుట్సొవినుగారి ధన ప్రమాణపు (Monetory Units) కొనుగోలుశక్తిని నిలువబెట్టగల విధానమును సర్ బెసీలుగారికి జూపవచ్చునా ? ఈవిధమును నేను కొలది కాలము క్రిందటనే చదివియుంటిని. యుద్ధప్రేరేపకుడొక రాష్ట్రమున కేతెంచి, యచటి ధనప్రమాణపు విలువ తగ్గుటను గాంచి, మూడుప్రధాన మండలముల నుండి, ఐదుగురు బ్యాంకునాయకులను తన కడకు రావించెను. పిమ్మట వారిని తుపాకితో కాల్చి చంపి, యితరుల కీ మారకపు విధానముతో ననవసరముగ జోక్యము కలుగజేసికొనవలదని హెచ్చరిక చేసెను. ఈ చీనావారి విధానమును సర్ బెసీలు అవలంబించుచో

బొంబాయి వారతనికి నిద్రాభంగమును గావించుటచే, రూపాయవిలువ రెండు-రెండున్నర షిల్లింగులవఱకు పెరుగుటను జూడగలడు. అప్పుడాయన యుప్పుపన్నును తొలగించగలిగి, రాష్ట్రమునగల తన దీనసోదరుల కెక్కుడు సాయపడగలుగుటయే గాక హిందూదేశపు తేయాకు సంఘమువారికి మఱియొక వరమును ప్రసాదింపగలడు. కాబట్టి బ్యాంకుయొక్క ప్రధానకార్యము ధరల నిలబెట్టుటగాదు. గోతములు, వడ్లు, గోధుమలు, ప్రత్తి మొదలగువాని ధరలను నిర్ణయించుటవంటి యసంభవ కార్యముగాదు. ధనవిధానపు గమ్యస్థానము దూదిధరలు పడిపోవుట నాపి, అమెరికారైతులను సమాఖ్య సంగ్రహాసంఘము (Federal Reserve Board) ఏల సుఖవంత మొనరింపలేదు ? దాని కట్లొనర్చుశక్తి లేకపోవుటవలననే ఇంగ్లీషుబ్యాంకు బాగుధర వృద్ధిని గతవత్సరమేల యాపజాలక పోయెను? దీనికిశక్తి లేకపోవుట వలననే, నవీననాయకుల కుత్సితబోధనల నణగద్రొక్కి పురాతనమునుండియు జరుగుచుండిన, రవాణా, అవసరచట్టములు సక్రమముగ జరుగుచునే యున్నవి. నేడు హిందూదేశమునకు గావలయు బ్యాంకు ప్రకృతి విరుద్ధమయినదిగాదు. హిందూదేశాహార పదార్థమును పెంపొందించి, ప్రతిపురుషుడు, స్త్రీ, బాల

బాలికలు కడుపునిండుగ నాహారమును సంపాదించు కొనగలుగుటకై ఒకరూపాయ-పదిరూపాయనోట్ల నన్ని టిని ఋణము నొసంగగల బ్యాంకే. బ్యాంకు రేటు పెంప కము ధనవసతి నరికట్టును, అనగా నాహారపదార్థముల నరికట్టి యాకలిబాధను బెంపొందించును. ఏవ్యాపార మైనను తనకు వలసినధనమునకు నూటికి రు25-100వంతున వడ్డీచెల్లించుచో నది దివాలావ్యాపారమని ప్రతివ్యాపారి కిని తెలియును. ప్రజలుతమకు ధనముచౌకగ లభించ నంతవఱకును నిర్ధనులై దివాలాకోరులుగనే యుందురు.

బొంబాయిలోనిల్వయున్న 400 ఔన్సుల బంగా రువలన, విలువక్షీణించినపుడు బ్యాంకురేటును బెంచి, కార్మికుల నిరుద్యోగులుగ గావించుట తప్ప వేరు లాభము హిందూదేశమునకుండజాలదు.

హిందూదేశపు 700,000 గ్రామములలో నేజం ట్లను నియమించి, వారిమూలమున ధనమును ప్రజల వ్యవ సాయాభివృద్ధి నిమిత్తమును, బిడ్డల జీవననిమిత్తమును, ఋణమొసంగిన బ్యాంకుదారునే హిందూదేశము కోరుచున్నది. రైతులెంత ధనమును వాంఛించుచున్నారో నమ్మకముగ తిరిగి యీయగలరో—యంతధనమె న్నికోట్ల రూపాయ నోట్లయినను వెంటనే వారిస్వాధీన మొనరింపవలెను.

"పరపతికి సక్రమనియమములెవ్వి? యనునదే ప్రధాన సమస్య" యని డన్నింగు మ్యాక్లాడు తన (Elements of Banking) గ్రంథమున ప్రశ్నించి, "యెంతమొత్త మైనను నది తిరిగిలభించునంతవఱకును పరపతికి మిత ములేదు." అని జవాబొసగెను. మరియు ధనముతిరిగి వచ్చుటయే చూడక, దానిని ప్రజలయాహారపదార్థముల బెంపొందించుటకే వినియోగింపవలయునని నేనుడివె దను. 'ఇదియే స్కాట్లాండును నిర్మాణముగావించిన బ్యాంకు విధానము. ఇదియే హిందూదేశమును నిర్మా ణముగావించును. ఇది ప్రజలకాహారము నొసగుటయే గాక పరదేశములనుండి యధికముగ బంగారమును స్వీకరించి, నాణకాధికారమును (Currency Authority) చిరస్థాయిగ తన బంగారుసింహాసనమున గూర్చుం డబెట్టును. ఏమియు వ్యయములేని 1000, యొకరూపా యనోట్లుగాని, 100 పదిరూపాయలనోట్లుగాని చెలా మణియై యేబది సంవత్సరములలో రు 50,000 ధాన్య మును, పంచదారవగయిరాలను ప్రజలకు లభింపజేసి, వారి బలారోగ్యములు వృద్ధిగావించి తిరిగిలభించు ధన విధానము, మంచిబ్యాంకువిధానముగాదని సర్ బెసీలు ఋజువుచేయగలిగినచో నాతడు చేయవచ్చును. అట్లు చేయజాలనిచో నాణకధన సంఘము (Currency

& Finance Commission) సిఫారసు గావించిన నాణకాధికారమును (Currency Authority) తీసి వేసి, దానిస్థానమున కోశవిధానము నెఱిగినవాని నేర్ప ఱచుచో నతడు ప్రకృతిశాస్త్రముల ధిక్కరించుటయందు తన సమయమును, హిందూదేశ సమయమును వ్యయ పఱుపడు.

అశాస్త్రీయ కోశవిధానమువలనను, ధన విహీనత చేతను హిందూదేశ మనుభవించు చుండిన నష్ట మపారము. స్వర్ణప్రమాణ సంగ్రహమును (GoldStandard reserve) హిందూ దేశమునకు వెలుపల ఋణ మొసగుటవలన దానికి గలుగుచున్న నష్టముల నీ వఱకే వివరించితి. ఈ స్వర్ణప్రమాణము, పత్రధన సంగ్రహమును (Gold standard and Paper Currency reserves.) ను ధన నాణకసంఘము (Finance & currency Commission) సూచించిన విధముగ వినియోగించుచో నింక నెక్కుడు నష్టమును హిందూ దేశము బొందును. ఈ రిజర్వు బ్యాంకు చౌకగ లభించు ధన సౌకర్యమును నూటికి 73 దీనులగు రైతులను విడిచి, 5 గురు వర్తకులకే ధనసౌకర్యమును గావించుచో నది తన శక్తిలో నూటికి 73 వంతుల వృథాచేయు యంత్రముగనే యుండును. ఈ ప్రభుత్వ

నౌక (Ship of State) వాను కోరిన స్వర్గమునకు-
-ఆరామ స్థలమునకు- శాంతి నికేతనమునకు- పూర్ణశక్తి
తోనడచుటకు మాఱు గంటకు 5 మైళ్ళ చొప్పుననే
నడచుచో నెటకు జేరునో యెవరికిని దెలియదు.

వర్తకుల కొఱకేర్పడిన ఇంపీరియల్ బ్యాంకునకు
తోడుపడునట్లు ప్రజలబ్యాంకునకు దోడుపడుచో రిజర్వు
బ్యాంకు 30 కోట్ల మానవులశక్తితో దనగమ్యస్థాన
మును జేరగలదు. అప్పుడు చైతన్యముగల హిందూ
దేశము ప్రపంచమును నడపును. అది తన అక్కఱకు
రాని ధనమును, మానవశక్తి, నిక వృధా చేయకుండు
గాక !

పట్టభద్రుడు-రైతు-ఖాతాలెక్క.

నేడు పట్టభద్రుడును, రైతును దరిద్రులే. కాని
వారిట్టిస్థితిలో నికవిశేష కాలముండ నవసరములేదు.
భౌతికసంపద యంతయు మానవులశారీరిక, మానసిక
శక్తులచే సృష్టింపబడినదిగాన హిందూదేశ మానసికశక్తి
సర్వోత్కృష్ట మగుటవలనను, దానిశారీరికశక్తి నిర్మా
ణమునకు మాత్రమే వేచియుండుటవలనను, హిందూ
దేశము నావరించియున్న దారిద్ర్యాంధకార మంత
మొందును. దానికి కావలసినది ధనము మాత్రమే నేటి
ధనము ఖాతాలెక్కయే. ఈఖాతాలెక్కలుతయారుచేయు

వాని కెట్టివ్యయముతోడను బనిలేదు. కాబట్టి హిందూ దేశమింకను నంధకార కూపమున గూలియుండుట కగత్యము లేశమేనియులేదు. నేటిధనము ఖాతాలెక్కయే యని నుడువుటకు సామ్రాజ్యమునగల గొప్పసంస్థ కర్జాలిఫ్‌కమిటీయే నాకాధారము యుద్ధానంతరము కోశ, పరివర్తన విషయములయందు సంస్కరణమార్గములను కనుగొని సలహాల నొసగుట కీసంఘమును ప్రభుత్వ మేర్పఱచెను.

ఈకర్జాలిఫ్ నివేదిక యీవరకు ప్రకటితమయిన కోశవిధానములలోని కెల్ల నుత్తమమైనది. 1884 వ సంవత్సరమున గావించిన బ్యాంకు చట్టము కాక యింత కంటె సక్రమ విధానము నేడు మనకు లభింపదు. ప్రభుత్వపు ఖాతాదారగు నింగ్లీషు బ్యాంకు, దేశమున కొసగిన వస్తువులకు గాను, ఖాతాలో దేశముపేర 10,000,000 ఖర్చు వ్రాసి కంట్రాక్టరులపేర జమకట్టును. కంట్రాక్టరు తాను తీసికొను చెక్కును తన బ్యాంకు ఖాతాకు జమకట్టును. అక్కడినుండి యింగ్లీషు బ్యాంకునకు డిపాజిట్టుగ బంపబడును. అచట దీనిని బంగారముగనే పరిగణింతురు. ఈ గిల్టు కాగితపు—ఖాతా విధానబలముచే, నీ చెక్కు బంపిన బ్యాంకు నూటికి 5-6 వడ్డీ చొప్పున పౌ 50,000,000 ఋణ మొసగును (అనగా

ఖాతాలో లెక్క వ్రాయును). బ్యాంకు జమా ఖర్చుల లెక్కలో నిల్వల వైపున గల ఋణములు, ఖర్చులవైపున నిల్వలుగ మాఱును. ఈనిల్వలను బ్యాంకులే స్వయముగ తయారు చేయుచున్నవి. ధనము నుత్పత్తిచేయు వ్యాపారము ప్రపంచ వ్యాపారములలో లాభదాయకమైనది. వేలకొలది కోట్ల ధనమును సృష్టించి; దానిపై నూటికి 5-6 వడ్డి చొప్పున లాభము గడించు బ్యాంకునకు గుమాస్తా ఖర్చులుదప్ప వేరు వ్యయముండదు. కాని యీపనికి బ్యాంకులు కోట్ల లాభమును గడించుచున్నవి. ఈకాలపు చెక్కు ఖాతా పద్దుమాత్రమే నేను 'వేయిరూపాయలను నామిత్రునకు చెల్లింపుడ'ని నాబ్యాంకుదారున కొసగు చెక్కు నాఖాతాలో ఖర్చు వ్రాసి, నామిత్రుని ఖాతాలో జమకట్టుమని వ్రాయు లేఖవంటిదే. బ్యాంకునోట్లన, ఖాతా లెక్కలే. అట్లే ఒక-రూపాయ పదిరూపాయనోటు ఖాతాలెక్కవంటిదే. కాని యిది ఖాతాపుస్తకములోని లెక్కవలెగాక నాదేశము పేర ఖర్చును, నాపేర జమయునుండి ప్రభుత్వముచే ధ్రువపఱుపబడిన చిన్నకాగితము. ఇది ఆయావిలువలకు తగిన వస్తువులను (ధాన్యమువగయిరాలను) నాకు లభింప జేయును.

తమవద్ద వాస్తవముగ లేని ధనమును వడ్డీకిచ్చి

బ్రిటీషుబ్యాంకులు చాలలాభములనుగడించి, నూటికి 16–18 లాభములను (Dividents) పంచి పెట్టును. న్యాయవాదులవలె నివి యితరుల మరదృష్టముపై లాభమును గడించును. ప్రజలకు ధనముగావలసినయపుడు, బ్యాంకులు ప్రజలపరపతిమీాదనే ధనమును సృష్టించి, యందులకు నూటికి 5-6 వంతున వడ్డీని విధించును. యుద్ధముగాని, వ్యాపారక్షీణతగాని తటస్థించినపుడు, ఖాతాదారులందరును తమధనమును చెల్లింపుమని బ్యాంకుల నొత్తిడిజేయుదురు. 1914 లో నాంగ్లప్రభుత్వము గావించినట్లును, 1927 లో జపాను ప్రభుత్వము గావించినట్లును ప్రభుత్వము లా నిర్బంధసమయముల, బ్యాంకులకు సాయపడి కాగితపునోట్ల రూకముగ ధనమును చెల్లించుటకు నొసగును. (వాస్తవముగ బంగారమునే చెల్లింపవలెను. కాని యివిచెల్లింపజాలవు). ఈవిధముగ క్లిష్టసమస్య నెదుర్కొనుటచే వ్యాపారము సక్రమస్థితికివచ్చి, మెట్టిప్రమాదమును లేక బాగుగ సాగుచుండును.

హిందూదేశము దీర్ఘకాలమునుండియు తన వస్తుపరిశ్రమాభివృద్ధిని గావింప ప్రయత్నించుచున్నది. నేడది దూది, గోగునార, యినుము, వ్యాపారముల యందు వృద్ధిగాంచినది. కాని యీా ఖాతాలెక్కల—

కాగితపు ధనవ్యాపారమును మాత్రము గమనింపకుండు టాశ్చర్యము. దీని నారంభించుట కిదేమంచితరుణము. కావలసినదెల్ల, ధనమునుగోరు నమ్మకముగల పెక్కురు ప్రజలే. ధనము, బ్యాంకులలోగాక ఋణము దీసికొను బీదప్రజలయందేగలదు. హిందూదేశమున నిట్టిపేదలు 25 కోట్లున్నారు. వీరిని సహకారవిధానమున సంస్కరించి, నమ్మకముగలవారినిగ జేయవచ్చును. ప్రథమమున వీరు సాహుకారులనుండి సంరక్షింపబడుటకు రు. 600 కోట్లు వాంఛించుచున్నారు. ఇందులకు నూటికి 5-6 వడ్డీని చెల్లింప మనస్ఫూర్తిగ నిష్టపడుదురు. ప్రభుత్వమీ వ్యాపార నిర్వహణబాధ్యతను వహించి, 600 కోట్ల రూపాయల నోట్లను సృష్టించుచో, నీపేదప్రజలు ప్రతి సంవత్సరమును ప్రభుత్వ కోశాగారమునకు రు 30 కోట్లను చెల్లింతురు. ప్రభుత్వము 25 కోట్ల ప్రజలకు జీవితనిర్వహణమునకు జేయూత నొసగుటకు మఱి రు 600 కోట్లను సృష్టించుచో, వారుమఱి రు 30 కోట్లను కోశాగారమునకు చెల్లింతురు. హిందూదేశనౌక ప్రబల శక్తితో ప్రయాణము చేయుటకు రు 1200 కోట్ల కంటె నెక్కుడవసరమై యున్నది. ప్రభుత్వము విశ్వాస పాత్రులును, అవసరము గలవారు నగు ప్రజలకు ధనము నెక్కుడుగ సృష్టించినకొలదియు, వారు దానిని

తిరిగి చెల్లించుచుందురు. అందు వలన ప్రభుత్వము, ప్రజలును, భాగ్యవంతులగుదురు. ఆపత్కాలమున ప్రభుత్వము—దేశము-కష్టములను సహించినపుడు, శాంతి సమయమున లాభము స్వీకరించుట న్యాయమే. బ్యాంకు విధానమువలన షట్టభద్రుడును, రైతును పరిపూర్ణ లాభమును దేశమునకు గలిగించి, తాము తమ దారిద్ర్యమునుండి విముక్తులు గాగలరు.

"వసుంధరోప లబ్ధమగు లాభము సర్వజనులకు వర్తించును. భూపాలునంతవానికిని భూమియే జీవనాధారము." రాజప్రతినిధులు, ఆర్థిక మంత్రులు, శిష్ట-సామ్రాజ్య-శాసనసభాసభ్యులు, వ్యాపారులు, న్యాయవాదులు, ఉద్యోగులు, నిరుద్యోగులు, నేతగాండ్రు, గోగునారను తీయువారు, బ్రాహ్మణులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, అస్పృశ్యులు, ఎవరయినను భూమిచే జీవింపవలసిన వారే. కాబట్టి హిందూదేశపు క్రొత్త బ్యాంకుయొక్క ప్రథమధర్మము మనయందఱకు జీవనోపాయమగు వ్యవసాయవృత్తికి ధనమొసగుటయే. మహాత్ముని యార్థికసిద్ధాంతములు సర్వతోముఖములును సులభానుష్ఠేయములునై యొప్పుచున్నవి. ఈసిద్ధాంతములను బ్రకటించుటలో మహాత్ముడు తన యాంగ్లేయాదర్శాచార్యుడగు రస్కినను గొప్ప యర్థశాస్త్రవేత్త ననుకరించు

చుండెను. "జీవనముకంటె వేరొండు భాగ్యములేదు." అని రస్కిను నుడివినపు డాయన యర్థశాస్త్రములోని గొప్ప సత్యమును ప్రకటించెను. ఏలన, ఆహారముగ మార్చు కొనరాని బంగారమునకు విలువలేదు. ఆహారము రక్త మాంసములుగ—జీవితముగ బరిణమించినపుడె విలువ గలదగును. బొంబాయి తన 400 ఔన్సుల బంగారము బజారుల నలంకరించినను, గోధుమలు, పిండి, పంచ దార, బియ్యము మొదలగు నాహారపదార్థములు లేకున్న నా బొంబాయి యొక్క మృతనగరము నే యుండును. హిందూదేశ మెక్కుడాహారమును, జీవన వికాసము నొసగు బ్యాంకువిధానమునే వాంఛించుచున్నది. సహ కారవిధానమే యీ బ్యాంకువిధానము. ఏలన, హిందూ దేశపు కోట్లకొలది పేదరైతులకు మఱియేవిధానమును సహకారిగనుండుట దుస్తరము.

ఈ విషయమై నాకొకింత స్వానుభవముగలదు. ప్రథమమున, సహకార పరపతిసంఘములచట్టము గావిం చిన కర్జనుప్రభువు సభలో నేను సభ్యుడుగనుండి, దానిని నిర్మించుటలో కొంతబాధ్యత వహించినందులకు సంతసించెద ఈచట్టము అమలులోనికి వచ్చిన పిదప నీ యుద్యమమునకు ప్రథమమున నేనేకడంగితిని. క్రొత్త బ్యాంకువిధానమును ప్రారంభించుటకు నేను ప్రభుత్వము

నకు రు 20,000 ఋణ మొసగితిని. ఈధనము, వివిధ రాష్ట్రములలో ఋణముగ నీయబడి, సురక్షితముగ తిరిగి వచ్చుటచే, రైతునునమ్మనచ్చునను విషయము ధ్రువపడు చున్నది. రైతునుసక్రమముగనిర్మాణము గావించుచో, నీ క్రొత్తబ్యాంకువిధానమునకును,ప్రభుత్వమునకును-దేశము నకును, నతడు లాభకారియగును. హిందూదేశమును సహాకారపద్ధతిపై నిర్మించుచో, దేశమున నిక పన్నులు విధింప నవసరములేదు. ఈబ్యాంకువలన లభించు లాభ ములు, ప్రభుత్వమునకు క్రొత్త పన్నులకు మారుగ దోడ్పడును. దేశములో నూతనమగు పన్నుల విధింప నక్కరలేదు. ప్రజలకు దమ కార్యములు బాగుగ నిర్వ హించుకొనుటకు వలసిన ధనముండును. పన్నులే విప్ల వములు సృష్టించును. పన్నులు వసూలుచేయువాడే మాస్కో-పట్టణమునకు (బోల్షి విజమునకు) సేవకుడ గును. నేను ముఖ్యముగ సూచించునదేమన, ప్రభు త్వము వెంటనే సహాకారవిధానపు బ్యాంకును నిర్మించి దీనికి పట్టభద్రుని మానసిక శక్తిని, రైతుయొక్క శరీర కష్టమును నిర్మాణము గావించుకొనుటకు వినియోగింప వలెను. ఈరెంటి సంయోగము ప్రపంచమున కొక నూతననిర్మాణరూపమును,సమష్టిసంపదను( Common wealth.) నొసగును. ఇదివ్యక్తిస్వాతంత్ర్యమును నిలువ

బెట్టును, ఈ (Common wealth.) లో ధనముగాక మానవుడే యజమానుడుగ నుండును. ఈనిర్మాణము, తక్కిన పార్టీ విధానములన్నియు నిర్మింపగలిగిన దానికంటె బలము గలిగి, ముసాలినీ గావించిన (Corporative Common walth) కంటెను గొప్పదిగనుండును. దీనికిఁ గ్రిందశ్రేమయు, మూలధనమును నేకమై, హిందూ దేశము నైకమత్యశోభితముగ జేయును.

రైతు—పెద్దవాయిదాఋణము.

సర్ హిల్టనుయంగుగారి 'కోశవార్తలు' అను వ్యాసముఁవలన (25 ఏప్రియలు 1927) (Financial news) హిందూదేశపు క్రొత్త బ్యాంకు విధానమున కాధారమయిన (పునాదియైన) అమెరికాదేశపు సమాఖ్య సంగ్రహధనాగార (Federal Reserve Banking) విధానమాక్ర్యతిబద్ధము కాలేదనియు, ఇంకను చాల కాలమువఱకును గా నేరదనియు, అమెరికాప్రజలు వాంఛించు పెద్దవాయిదాఋణముల నొసగుమార్గమునకు మార్పు గోరుచున్నదనియు, తెలియుచున్నది.

శాఖా ధనాగారములలో 1926 వ. సంవత్సరమున గాంచిన పరపతియభివృద్ధి, తనఖాలవలనగానీ, తనఖాలపయి నీయబడు ఋణముల వలనగానీ కాదు. ప్రస్తుతవర్తక వ్యాపారముల యవసరములవల

ననుగాదు. కేవలమిది భవననిర్మాణమునకును (Real-estates)వ్యవహారములకును నొసగబడిన పెద్దవాయిదా ఋణముల పరపతివిధానమువలననే పెంపొందినది.

(Loans Policy) ఋణవిధానము.

దీర్ఘకాలవిధానమును చక్కగపరిశీలించి మంచి విధానము నేర్పఱచుకొని జాతీయ ధనాగారమందు (National Banks) తమమూలధనములో నెక్కుడు భాగమునుపెద్దవాయిదా పెట్టుబడులీయవలయుననిని వేదిక సిఫారసుచేసెను. ఏలన నీవిధానము 1922 నుండి 5 సంవత్సరములలోనే యభివృద్ధి గాంచినది. అప్పులలో పెట్టుబడులు (Investiments) క్రమముగ నిల్వ (Stock) కంపెను (Bonds) హుండీల కంపెను వృద్ధియైనవి. ఈవఱకు సంయుక్తప్రభుత్వములో నీవిధమగు ఋణములు (Stock Exchange Securi ties)లో(సొమ్ము మారకపుహామీలు) వ్యాపారము గావించుటకే యేర్పడినవని భావింపబడెను, ఏలన, వర్తక, వ్యాపార వ్యవసాయములకు వలసినఋణము లితరవిధములగు హామీల (Securities) రూపమున లభించుచుండెడివి.

"మఱియు, ప్రస్తుతమీశాఖాధనాగారముల (Member Banks) యొక్క యభివృద్ధిని గాంచినచో, పెద్దవాయిదా పెట్టుబడుల యందును, తనఖా ఋణ

ములయందును, నెక్కుడుగమార్పులుగలినవనియు తెల్పు చున్నది. కాబట్టిమనసమక్షమునగల యాధారములునవీనా ర్థికప్రపంచము వ్యవసాయ, పరిశ్రమ, వ్యాపారములు మున్నగు సర్వశాఖలయందును పరపతియవసరమగు వఱకు వాంఛనీయమగు చున్నదనియు, ఋణమును దీసి కొనినవాడు తిరిగిచెల్లించుచో, బ్యాంకులన్నియు నీవాంఛ నెఱవేర్ప సిద్ధముగనున్నవనియు, స్పష్టముగ ధ్రువపఱచుచున్నవి. హిందూదేశము దీర్ఘకాలము నుండియు మంచిబ్యాంకు విధానమును వాంఛించు చున్నది. కాని నేటి పరిస్థితుల కననుగుణ్యామగు బ్యాంకునుగాని, యీవఱకే నిష్ప్రయోజనమని గర్హింపబడిన రిజర్వుబ్యాంకు చట్టమునుగాని వాంఛింప నొల్లదు. కాబట్టి వ్యవసాయ వర్తకవ్యాపారములు మొదలగు సర్వశాఖలలో ప్రధానశాఖయగు వ్యవసాయమునకు (ఇది సర్వ వ్యాపారములకు పునాది గావున) ధన మొసగగల సక్రమమగు బ్యాంకువిధానమునే దేశము వాంఛించుచున్నది. అమెరికా ననుకరించుటకు మాఱుగ, హిందూదేశము ప్రపంచములోనికెల్ల గొప్పబ్యాంకును నిర్మించి, అమెరికాకు మార్గదర్శకముగ నుండవలెను. ఇందులకు క్రమములగు పునాదులను హిందూదేశపు 750,000 గ్రామములలో నేర్పఱుపవలెను. ఇందులకు

న్యూజిలాండునుండి ప్రభుత్వమువారు పాఠమును నేర్చు కొనిహిందూదేశపుగొప్పవ్యాపారమగు వ్యవసాయమున కునుతదితరసహకారోత్పత్తివ్యాపారములకును,వలసినంత ధనసహాయము గావించుటకు ఇంపీరియల్ బ్యాంకునకు సహకారసంఘములు స్థాపించునధికార మొసగవలెను. ఇట్లుగావించుట యన ఐరిషుధనాగార-సంఘము. (Irish Banking Commission) గావించిన సూచనల ననుకరించుటయును, 50 కంటె నెక్కువ దేశముల ప్రతి నిధులుగల నానాదేశ సమితిగావించిన యార్థిక సభ తీర్మానముల ననుసరించుటయునే. ఆతీర్మానమిది.

"వ్యవసాయమును, వ్యవసాయపరిస్థితులు చక్క పఱుపనేర్పడిన వ్యవసాయసంఘములను, ప్రోత్సహించుట వలన ప్రభుత్వములకు లాభమే. ముఖ్యముగ ప్రభుత్వ సహాయముతో పరస్పరము పరపతి నభివృద్ధి పఱచు కొనవలెను."

కాబట్టి హిందూదేశప్రభుత్వము సహకారోద్యమ మును స్థాపించి, నిర్వహించుటకు వెనుకముందాడ నక్కరలేదు. ఏలన, సహకారమార్గము వలననే హిందూ దేశము తన గమ్యస్థానమును జేరగలదు. నిక్కమగు నర్థశాస్త్రవిజ్ఞానము, దరిద్రదేశపు క్షుద్రవ్యయమును మఱింత తగ్గించుట యందులేదు. అది యాదేశపు కొలది

రాబడిని బెంపొందించుట యందేగలదు. గొడ్డళ్లకంటెను మంచి నాగటి కఱ్ఱులే విరివిగ గావలయును.

కావలసినంత పరపతిధనమును సృష్టించుటకు (నానాదేశసమితివారు నుడివినట్లు) "పరస్పర సహకారనిర్మాణాభివృద్ధికి" ప్రభుత్వపు నిలువలను ఇంపీరియల్ బ్యాంకునకుగాని, అఖలభారత దేశీయపు బ్యాంకునకు గాని విరివిగ నొసగవలెను. మఱియు, ప్రజానిర్మాణము సక్రమము గావించుటయు, ధనమును సురక్షితముగ ప్రభుత్వమునకు నూటికి 5 వడ్డీ వంతునను, ప్రజలకు నూటికి నూరువంతున పంటల లాభమును లభించునట్లు ఋణముల నొసగుటయు; సహకార సంఘముల యొక్కయు, వాని రిజస్ట్రారులయొక్కయు విధి.

## రైతు-నానాదేశసమితి.

రిజర్వుబ్యాంకు చట్టము త్వరలోనే హిందూదేశ శాసనసభ్యుల విచారణకు వచ్చునుగాన ప్రపంచార్థిక జీవనములో వ్యవసాయ ప్రాముఖ్యము నెఱిగిన నానా జాతిసమితియొక్క నానాదేశార్థికసభ తీర్మానములు తెలియుట మంచిది. ఈ సభచే నిర్మింపబడిన వ్యవసాయ సంఘప్రకటనము, కడచిన యిరువది సంవత్సరముల నుండియు హిందూదేశ సహకారోద్యమము ప్రభుత్వము నొత్తిడిగావించిన విషయమును; అనగా హిందూదేశ

ప్రధానవృత్తియగు వ్యవసాయమును సక్రమనిర్మాణము గావించి, సహకార పద్ధతులపై ధనమొసగినచో, నది దారిద్ర్యగ్రస్తముగనే యుండునను విషయమునే బలపఱచుచున్నది. నానాదేశ సమితివారి యీ దృష్టినిబట్టి చూచిన హిందూదేశపు రాయల్ బ్యాంకింగు కమిషను వారు హిందూదేశమునకును, ప్రపంచమునకును జీవనాధారమగు వ్యవసాయమునకు ధనసౌకర్యమును గావింపక విచారకరమగు దృశ్యమును ప్రదర్శించిరి. ఏలనో నానాదేశసమితి ప్రకటన మిట్లు దెల్పుచున్నది. "ప్రపంచమందంతటను పెక్కురు కార్మికుల వృత్తి వ్యవసాయమే. దీనివలన లభించు వివిధపదార్థములే విశేష మానవశ్రమ యొక్క ఫలము. ఈ పదార్థములను వ్యాపారోత్పత్తి వస్తువులతో మారకము గావించుటయే ప్రపంచపు వ్యాపారమునకు పునాది." ఇంత స్పష్టముగనున్నను, ఇండియన్ కరెన్సి, ఫైనాన్సు కమిషను దీనిని గమనింపనేలేదు. కావున రిజర్వు బ్యాంకుచట్టము తమయెదుట బెట్టబడినప్పుడు స్టేటుకౌన్సిలును సామ్రాజ్య శాసన సభయు నింత జడమతితో తప్పుమార్గమును ద్రొక్కరని భావింపవచ్చును. జినీవానివేదిక నుదహరింతుము.

"నానాదేశార్థికసభ, 6. వ్యవసాయము.

" I ఉపోద్ఘాతము:—ప్రపంచమందంతటను

పెక్కురవృత్తి వ్యవసాయమే. దీనివలన లభించు వివిధ పదార్థములే మానవశ్రమ ఫలమున గొప్పభాగము. ఈ పదార్థములను వ్యాపారోత్పత్తి వస్తువులలో చూరకము గావించుకొనుటయే ప్రపంచపు వ్యాపారమునకు పునాది.

"వ్యవసాయము వృత్తిగాగల ప్రజలకే మానవశక్తి భాండారము (Reservior) నుండి, వ్యాపారాధిక వృద్ధిచేగలుగు వ్యర్థమగు శక్తివ్యయమునుండి దేశములను రక్షించు సామర్థ్యముండును.

"వ్యాపారాభివృద్ధియొక్క హద్దుల నేర్పఱచుటకు వ్యవసాయము వలనను తృప్తిగావింప బడిన యాహారపదార్థములు, ముడి పదార్థములు గలిసి యొక ప్రబలకారణము. దేశములయందు గానగు నన్యోన్యాశ్రయము వివిధవృత్తులగు వ్యవసాయ, వర్తక వ్యాపారముల పరస్పర సంబంధమును జూపును. కాబట్టి తక్కిన తెగలసాయములేక యొకే తెగ శాశ్వత సౌఖ్యము ననుభవింప వాంఛించుట వ్యర్థప్రయత్నము.

" ఆహారపదార్థములకును, ముడి సరకులకును ప్రపంచమున కాధారభూతములైన వివిధదేశముల క్షీణత వలన నేడు వ్యవసాయము ఆర్థికవిషయమున పనస్థానమును సమర్థించుకొనజాలకున్నది.

"వ్యవసాయపదార్థముల ధరలకును, పారిశ్రామిక వస్తువుల ధరలకునుమధ్య నేర్పడిన యెగుడుదిగుడులవలన వ్యవసాయమునందార్థికక్షీణతయేర్పడినది. తత్ఫలముగ చాలదేశము లందలి రైతులు తమశ్రమకును, మూలధనమునకును తగిన ఫలము ననుభవించుటలేదు. సరియగు వడ్డీరేటుతో ధనమును బొందజాలని కష్టమువలనను, ఈ క్షీణత హెచ్చి, వ్యవసాయదారుల కొనుగోలు శక్తిని క్షీణింపజేయుటయే గాక యీ యాహారపదార్థముల ధరల క్షీణతవలన వాని ననుభవించువారుగూడ చాల విషయముల లాభమును బడయలేకున్నారు.

"వ్యవసాయదారుల కొనుగోలుశక్తి క్షీణత, వ్యాపారమునకు ప్రతిక్రియగావించి తత్ఫలముగ నిరుద్యోగుల బెంపొందించి, వ్యవసాయ పదార్థముల వ్యాప్తిని (అమ్మకమును) తగ్గించును "ఈధరల సమానత్వమును నిలుపు సత్క్రమమార్గముల నాచరణయందిడనిచో శీఘ్రముననో ఆలస్యముననో వ్యవసాయ పదార్థముల యుత్పత్తి తప్పకక్షీణించి, మానవకల్యాణము నిరోధింపబడునను భీతికలుగుచున్నది.

"కాని వ్యవసాయోత్పత్తిని గావించుటకు మంచి మార్గములుగలవు. వీనినాచారణయందిడవలెను. జనులు సర్వసాధారణముగ వీనినవలంబించిన ప్రపంచకళ్యాణ

మునకును, ఆర్థిక శాంతికిని లాభదాయకము లగు ఫలముల నొసగును.

"II సామాన్య తీర్మానములు:- (1) వ్యవసాయ పదార్థముల యుత్పత్తివృద్ధి, ఆర్థికసమస్యకు జీవగఱ్ఱ వంటిది. వ్యవసాయదారులకు సంతృప్తికరమగు జీవన నిర్వహణస్థితిని, వారిశ్రమకు, మూలధనమునకును తగిన ప్రతిఫలమును లభింపజేయుటకు వ్యవసాయమును, వ్యాపారమును సమానస్థితియందుంచవలయును. కాబట్టి వ్యవసాయమునే సర్వప్రధానమగు వ్యాపారముగ గుర్తింప జాలనట్టియు నప్రధానమని భావించునట్టియు ప్రజలమానసముల నప్రాముఖ్యమును గాటముగ నాటు నట్లు చేయుటత్యవసరము.

"(2). వ్యవసాయమును వృద్ధిజేయుకార్యమెల్లర కంటె రైతులకు ముఖ్యవిధి. సామాన్యముగ నభివృద్ధి దాయకములగు విషయముల నాచరించుట, పంటలు పండించుటకు, పశుజాతుల వృద్ధిజేయుటకు శాస్త్ర సమ్మతములగు సిద్ధాంతముల ననుకరించుట; పశువు లయు, వృక్షములయు వ్యాధులను నివారించి, చీడలు మొదలగువానిని రూపుమాపుట, క్రయవిక్రయముల గావించుట, యుత్పత్తిదారులయు, ననుభవించువారియు, క్షేమముకొఱకు వ్యవసాయపదార్థముల శుభ్రతను,

స్వభావమును రక్షించువిధానములు గావించుట, పంటల నితరప్రదేశములకు బంపుమార్గముల నన్వేషించుట, భీమా-పరపతుల సౌకర్యములు గావించుటచే, వ్యవసాయదారుల కుత్పత్తివ్యయమును తగ్గించును. తన్మూలమున వ్యవసాయ నిర్వహణమునకు చిన్నవియు, మధ్యశ్రేణికి జెందినవియు, నగు సాగుబడి భూములుండుట చేతను, దీని నిర్వహణమున కేంద్రీకరణ వ్యవహారము నేడు లేమిచేతను, చాలదేశములలో పరీక్షింపబడిన సహకార సమ్మేళన పద్ధతులపై రైతుల నిర్మాణమును సాగింపవలెను. మఱియు పరస్పరాంగీకారములతో రైతులయు, ననుభవించువారియు సహకారసంఘములు నెలకొల్పవలెను.

"వ్యవసాయమును, వ్యవసాయపరిస్థితుల చక్కబఱుప నేర్పడిన వ్యవసాయసంఘములను, ప్రోత్సహించుటవలన ప్రభుత్వములకులాభమే. ముఖ్యముగ ప్రభుత్వసహాయముతో పరస్పరము పరపతి నభివృద్ధిపఱుపవలెను.

"ఎక్కువ వడ్డీలును, పన్నులభారమును వ్యవసాయ పదార్థముల యుత్పత్తి కాటంకములని ప్రభుత్వములకే సభవారు తెల్పుచున్నారు.

(3) "ఇతరాభివృద్ధి విధానములు ముఖ్యముగ

శాసనములపై నాధారపడియున్నది. కార్మికుల క్షేమమును, రక్షణమును గావించు సాంఘిక శాసనములు వ్యవసాయదారులకును, వ్యాపారములయందలి కార్మికులకును, యజమానులకును లాభదాయకములుగ నుండవలెను. కాని యీ చట్టములు మాత్రము వ్యవసాయపు ప్రత్యేకావసరములకును, గ్రామప్రజల ప్రత్యేక జీవన, శ్రమనిర్వహణములకును ననుకూలముగ గావింపవలయును. మఱియు సన్నితరగతులయందు వ్యవసాయ విద్యాబోధనమును, వ్యవసాయపు పనిముట్లు మున్నగువానికి సంబంధించిన జ్ఞానబోధనమును, అన్ని ప్రభుత్వములయు, వ్యవసాయసంఘములయు దృక్పథము నాకర్షించి, యాచరణమునందుంపవలయును.

"(4) వివిధ దేశములయొక్కయు వానికార్మికులయొక్కయు ప్రధాన సౌకర్యముల కాటంకము గానివిధమున వ్యవసాయ వస్తువుల వ్యాపనమునకును, వాని వ్యాపారమునకును గలయాటంకములు తొలగించుట వాంఛనీయము.

వ్యాపారముపై సుంకములున్న దేశములు వ్యవసాయ వ్యాపారములకు సంబంధించిన సుంకములను జాలవఱకు దగ్గింపవలెను. ఒకదాని యవకాశమును గైకొని మఱియొకటి లాభించునట్లుగాక వ్యవసాయ వ్యాపారముల

సమత్వమును స్థాపింప గడు జాగరూకతను వహింప నగును.

"దీర్ఘ కాలానుభవముచే నిష్ప్రయోజనములని తేలిన యెగుమతి బహిష్కరణ విధానమును, ఎగుమతి సుంక ములను (ఆవ్యాపారలాభమునకై విధింపబడిన పన్నులు దప్ప) వ్యాపారపు సుంకములను తఱచుగ మార్పుట లును పూర్తిగ తొలగింపవలయును.

(5) వ్యవసాయదారు తన వస్తువుల ధరను సాహ సముగల బేరములయందుగాక ధరల క్రమవిధానము నందే గాంచవలయును. ఇతరోత్పాదకులకు వలెనే రైతు నకుగూడ సమానమగు వసతులు గల్పింపవలెను.

" (6) చిట్టచివరకు, వర్తక, వ్యాపారసమస్య లలో నవలంబించువిధానము, వ్యవసాయార్థిక విధానము నకు ప్రతిక్రియ గావించునుగాన తద్వ్యతిరేకమును సత్యమే. కాబట్టి ఈసభవారు నానాదేశసమితిని, దానిచే లోగడ నేర్పఱుపబడిన, నికముం దేర్పఱుపబడు ఆర్థికసమస్యలతో సంబంధమున్న సంఘములందు సాంఘి కార్థిక విషయములతోగూడి వ్యవసాయమున కుచితస్థాన మొసగుటకు సిఫార్సు చేయుచున్నారు.

"III ప్రత్యేకపు తీర్మానములు:—పైనగావించిన సాధారణములగు తీర్మానములతోబాటు ఈక్రింది

సమస్యలపై తమదృష్టిని ప్రసరింపజేయవలసినదని నానా దేశసమితి నీసభవారు వాంఛించుచున్నారు.

"I వ్యవసాయసహకారము:—వ్యవసాయ సహకార సంఘములకును, అనుభవించువారి సహకార సంఘములకును గల సంబంధములు:—

"i సర్వవిధములగు సహకారములను విరివిగ వినియోగించుకొని వివిధదేశముల రైతులు తమ జీవన పరిమాణాభివృద్ధికిని, సకలకల్యాణములకును తోడ్పడుదురు. సభ్యుల యుపకరణములకును, గృహనిర్వాహణావసరములకును, సహకారపు సప్లయి సంఘములు, సాయపడును. వివిధపదార్థముల విక్రయములకు సహకార విక్రయ సంఘములు సహాయముచేయును. ముడిపదార్థముల యుత్పత్తికిని, పారిశ్రామికవస్తువుల విక్రయమునకును, ఉత్పత్తిదారుల సహకారసంఘము లుపకరించును. మూలధనావశ్యకతను దీర్చుటకు (వ్యవసాయనూతనోపకరణములు సంపాదించుకొనుటకు, భూమిసాగును వృద్ధిచేయుటకు, పదార్థముల నిలువజేసికొనుటకు,) సహకారపరపతి సంఘములు సాయపడును.

"ఈవిధముగ సహకారసంఘములు, ఉత్పత్తిదారులుగను, అనుభవించువారుగను నుండు రైతుల కొనుగోలుశక్తిని వృద్ధిచేయును. మఱియు నివి యుత్ప

త్తిని, దానిగుణమును వృద్ధిగావించి ఆర్థికోన్నతిని గావించును. ఇంకను భూమినుండి లభించుపదార్థములను, ఆ పదార్థములనుండి లభించువానిని పూర్తిగ వినియోగించుకొనుట కవకాశముల నొసగును. మఱియు నివి క్రయవిక్రయ నిర్మాణమునకు తోడ్పడి, వస్తువులవితరణమును వ్యయమును తగ్గించును.

ii "అనుభవించువారి సహకారసంఘములతో వ్యవసాయ సహకార సంఘముల సంబంధము పెరిగిన కొలదియు నార్థిక జీవన విధానమభివృద్ధిగాంచును. ఉత్పత్తిదారులకును, అనుభవించువారికిని, ఉత్పత్తిదారుల సంఘములకును, అనుభవించువారి సంఘములకును మధ్యగల పరస్పర సంబంధములు వీని మధ్యనుండు దలారులను దొలగించి, వీనిని చక్కగ వ్యాపింపజేసినపుడు వీరిరువురకిని లాభదాయకములగు ధర లేర్పడును. ఈభౌతిక లాభమునకు దోడు, నైతికలాభముగూడ గలుగును. పరస్పర వ్యాపారసంబంధముచే నుత్పత్తిదారులును, అనుభవించువారును ఒకరినొకరు బాగుగ తెలిసికొని, వారు తమతమ ప్రత్యేక లక్షణములను, వాంఛలను గమనింతురు. ఉత్పత్తిదారుల సంఘములును, అనుభవించువారి సంఘములును పరస్పర సంబంధముల విలువను, తమకుగల ఐక్యసిద్ధాంతములచే గ్రహించి

యానందించును. వ్యాపారనిర్వహణము వాంఛించు పరస్పర సహాయ విశ్వాసముల విజ్ఞానము, దీర్ఘకాలము నుండియు సిద్ధాంతముగనుండిన యుత్పత్తిదారుల వ్యవసాయ సహకార సంఘములకును, అనుభవించువారి సహకార సంఘములకును అత్యావశ్యకములై యాచరణయుక్తమగు వ్యాపార సంబంధముల నేర్పఱచును.

"ఆచరణయుక్తములగు ఫలములగాంచ, వ్యవసాయదారులు తాముత్పత్తిచేయు పదార్థములను మంచి విగను, కల్తీలేనివిగను చేయుటయు, ననుభవించువారి సహకారసంఘములు అవకాశమున్నంతవఱకు వ్యవసాయపదార్థములను వ్యవసాయోత్పత్తి సహకార సంఘములనుండి కొనుటయు, ప్రభుత్వములు, ప్రజాసంఘములు నీసహకారోద్యమమునకు కళాశాలలయం దుపాధ్యాయుల నేర్పఱచియు, నితరశాస్త్ర విజ్ఞానావసరముల నేర్పఱచియు, బోధనలగావించియు, సహకార సంఘములకు విరోధములగువానిని ధనవ్యయముచేనయిన రూపుమాపియు ప్రోత్సహింపనగును.

"ఒకదేశములోని వివిధోత్పత్తిదారులయొక్కయు, ననుభవించువారి యొక్కయు సహకారసంఘముల నైక్యమొనరించి, వాని నార్థికసంఘములుగ నేర్పఱచుచో, నవివారియందనోన్యతను బెంపొందించి, వారికార్యము

లనేక ముఖములకుదెచ్చి, ఫలవంతములుగ గావించును.

"తన విధానశక్తిని ప్రసరింపజేయుచున్న సర్వ శాఖలలో సహకారమును స్థాపించుటకు (ఇదివరకు లేనిచో) సహకారమును పాలించుచట్టముల నైక్యమొన రించి. సాధ్యమైనంతవరకు కాటంకములు తగ్గింపవలెను.

"iii పెక్కు ఉత్పత్తిపదార్థముల విషయమున, వివిధసహకార వ్యవసాయసంఘముల మధ్య, క్రయ విక్రయములు మంచిపునాదులపై నుంచుటకును, ఉత్ప త్తిని క్రమపద్ధతియం దుంచుటకును, ఉత్పత్తికిని, అనుభ వించుటకును గల సమత్వమును నిలువబెట్టి ధరలసమతను నిలుపుటకును నానాదేశపు టొడంబడిక లమూల్య ములు.

"నిరంతరవ్యాపారముమూలముననను, దీర్ఘకాలపు కంట్రాక్టుల మూలముననను (దేశీయ, నానాదేశీయము లగు) ననుభవించువారి సహకారసంఘముల సమ్మేళ నము లభించును. అందువలన నానాదేశపు టొడంబడి కలు ఫలించును.

"iv వ్యవసాయదారులయొక్కయు, అనుభవించు వారియొక్కయు సహకారసంఘముల యీ యాదర్శ ములు దేశీయ నానాదేశీయపు వ్యవసాయదారుల యొక్కయు, అనుభవించు వారియొక్కయు సహకార

సంఘముల పక్షమున నొక సంఘమును స్థాపించి, తద్ద్వారమున నాచరణీయములుగ గావింపనగు. ఈ సంఘమునకు పరిశోధనలకు, ఆధారపత్రముల (Documents) కు ప్రయత్నించుటకును పూర్వానుభవములవలన నూతన ఫలములనుగాంచు సాధనములు చూపుటకు నధికారముల నొసగవలెను.

2. వ్యవసాయపు పరపతి:—వ్యవసాయదారులకు వలసిన మూలధనము ననుకూలమగు వడ్డీకొసగు వ్యవసాయపు పరపతిసంఘముల నిర్మాణముతో వ్యవసాయ పదార్థములయుత్పత్తిని బెంపొందింపవచ్చును.

కొన్ని దేశములకు వ్యవసాయమునకు వలసిన మూలధనము గలదు. కాని చాలదేశములందు సాధారణార్థిక పరిస్థితులచే, నాదాయము క్షీణించుటవలనగాని తగిన సంఘముల నిర్మింపక పోవుటవలనగాని, వ్యవసాయపు పరపతికి వలసిన సౌకర్యము లింకను గావింపబడలేదు.

"అట్టి దేశముల యీస్థితి వ్యవసాయ క్షేమమునకు భంగకరము. ఏలన, ఈస్థితి, రైతులకు తమపంటలు పెంపొందించుకొనుట, భూమి యొసగజాలినంత ఫలమును సంగ్రహించుట, ఉత్పత్తివ్యయమును తగ్గించుకొనుట, వ్యవసాయమునకు వలయు పనిముట్లను, సామ

గ్రిని, మూలధనమును సంపాదించుకొనుట మున్నగు వాని కాటంకములు గలిగించును.

"ఈకష్టముల బాపుకొనుట కిదివఱకు సహకార సంఘములు లేని దేశములు వానిని నిర్మించుటయు, నవియుండినచో వాని నభివృద్ధి పఱచుటయు నత్యావసరము. దీనికి తగిన యేర్పాటులను ఉద్యోగుల సాయముతో గాని, వారిసాయము లేకయేగాని, వలసినపదార్థములను చేకూర్చుకొని, వానిద్వారా సహకారపరపతి సంఘమును స్థాపించుటవలననే చేసికొనగలము.

"మఱియు జాతీయనిర్మాణముల సహకారము వలననే, దేశీయపు, నానాదేశీయపు పరపతికొఱకు గావించు విన్నపములు సులభముగ సఫలములుగాగలవు.

"వ్యవసాయపు పరపతులు తక్కువగనున్న దేశములకు, వివిధసంఘముల సభ్యులచే సూచింపబడిన విధానములు తమయెదుట నుంచుటచే, నానాదేశ నిర్మాణము వానిని వృద్ధిచేసికొనుటచేతను;

"పరపతి పూర్ణవిశ్వాసమువలననే లభించునని యీసమస్యాపరిశోధనల గాంచుటవలనను;

"నానాదేశ వ్యవసాయ సంఘము, వ్యవసాయపు పరపతుల ప్రత్యేకవిషయములు ప్రోగుజేయుచున్నదని వినుటవలనను;

"నానాదేశ వ్యవసాయసంఘములవారు కూడ బెట్టినవిషయములు గ్రంథరూపమున నుంచి, తన్మూల మున ననుభవమున మిక్కిలి యనుకూలముగనున్న వ్యవసాయపు పరపతులను, నానాదేశ సాహాయ్యమును పరిగ్రహించుటకును, వ్యవసాయమునకు మూలధనము లేనపుడావ్యవసాయమును వృద్ధిచేయుటకును, నానాజాతి సమితి నీసభవారు గోరుచున్నారు.

"3. పశువులకు, వృక్షములకు సంభవించు జాడ్య నిరోధము:—వృక్షములకు. పశువులకు గలుగు జాడ్యములు వ్యవసాయోత్పత్తిని క్షీణింపజేయును. కాబట్టి వీనిని నానాదేశీయ సాధనములవలనను, ఒడంబడికల వలనను నివారింపదగును.

"ఈ నానాదేశీయ విధానము 43. దేశములచే సిద్ధాంతరూపముగ నీవఱకే సమ్మతింపబడి, (International Epizootic office)స్థాపనమునకు కారణమయ్యెను.మఱియునానాదేశవ్యవసాయసంఘముప్రత్యేకసభ గావించి, ఉద్భిజ్జరోగ నివారణశాస్త్ర (Phyto-Pathology) వ్యాపకమునకు నానాదేశైక్య కృషిని (కార్యాచరణమును) గావింప దలచుచున్నది.

"ఆరోగ్యరక్షణ విచారణమునుగావించు నానాదేశపు డొడంబడికల కనుకూలమగు సూచనలనిచ్చుచో

(Guarantees) రాజకీయాధికారములను ధిక్కరింపక, గుప్తరక్షణగల చట్టమే దీనికావశ్యకమని తోచుచో వెంటనేదానిని తొలగింపవలెను.

జయప్రదమగు నుత్పత్తి నిర్వహణమునకు కారణమగు వ్యాపారసంబంధమగు సమత్వమును గాపాడ బ్రయత్నములు గావింపనగును.

"4. వలసరాజ్యముల వ్యవసాయము:— వలస రాజ్యములందే జన్మించి, నివసించువారిని ముఖ్యముగ నుష్ణప్రదేశములందును, సమశీతోష్ణ ప్రదేశములందును నివసించువారికి వ్యవసాయ విషయములు పెంపొందింప బ్రోత్సహించి, ఆయాప్రదేశము లందుండువారి కళ్యాణమును, దేశసౌభాగ్యమును చేకూర్చు విధానములు పరిశీలింపదగునని యీసభవారు సిఫారసు గావించున్నారు.

"5. అడవులు:—అడవులలోనగు పదార్థములను, వానినుండి లభించుపదార్థములను కొని, వ్యాపారములకు గావలసిన పదార్థములను క్రమముగ నొసగగలుగుటకు దగిన ప్రత్యేక విజ్ఞానాభివృద్ధిని గావింపుడని యీసభవారు సిఫారసుచేయుచున్నారు.

"వ్యవసాయ సమస్యల నెల్ల పత్రరూపమున గూర్చుట:— సంఖ్యలపట్టికలు; విచారణము:—

"వ్యవసాయ సమస్యలు తర్కించుటకు, పత్రికము

(Documentation) లమూల్యములు. కాని యింక నీసమస్యలనెల్ల విమర్శించుటకును, వానికి దగిన విధాన మును నిర్మించుటకును, మంచి పునాదులు లేవు.

"వ్యవసాయ ప్రాముఖ్యమునకు సంతృప్తిజనక మగు నార్థికపరిస్థితు లుండవలెను. 'ఈ విజ్ఞానము వ్యవ సాయపు లెక్కల పరిశీలన విధానమువలననే లభించును. ఇట్టి పరిశోధనలు వ్యవసాయాభివృద్ధిని గావించును. దేశములు పరస్పర మంగీకరించుకొనుట కివి ప్రయోజన కరములు. అందువలన సకలదేశముల వ్యవసాయదారు లకు సమానములగు నుద్దేశములను, విధానములను, బాగుగ స్పష్టపఱపగలము. మఱియు నుత్పత్తిదారున కును, అనుభవించువానికిని మధ్య పరస్పరసంబంధము బాగుగ నేర్పడును. "ఈవిధానమును విజయముగావించు కొనుటకు సక్రమ వ్యవసాయపు లెక్కలపద్ధతిని వివిధ దేశములం దేర్పఱచు టావశ్యకము. ఈలెక్కలు ప్రతి దేశమునందును సాధ్యమైనంత విపులముగ, విశ్వసనీయ ముగ నుండునట్లు వ్రాయుచో, నాయాదేశములందు శీతోష్ణస్థితి, భూమిస్వభావము, భూమి పరిమాణము, వ్యవసాయ విధానము, ప్రధానములగు పంటలు మొద లగు వ్యవసాయఫలితములు పోల్చి చూచుకొనగలము. మఱియు నుత్పత్తికిని తత్ఫలితములకును సాయపడువాని

('కూలి, రాసాయనికపు ఎరువులమూల్యము, పన్నులు, సాంఘికవ్యయము, ధరలు, కైతులఋణములు) వలన లభించులాభముల వివరములనుగమనింపగలము." కాబట్టి యీ విషయమునకు వలయు పద్ధతులను సిద్ధము చేసి వానిని బాగుగ చదువుటకు నిపుణుల (experts) సంఘ మొకదానిని స్థాపింపవలయును.

"ii. కాలక్రమాగత వ్యవసాయపు లెక్కలను ముఖ్యముగ పశువులవిషయమునను, వానినుండి లభించు (పాలు, వెన్న మొ॥) వానివిషయమునను గావించుటావశ్యకమని యీసంఘము భావించుచున్నది. నానాదేశ సమితివారిచే నిర్ణీతములగు సిద్ధాంతములవలన గడచిన 25 సంవత్సరములలో, ప్రపంచమున నర్ధభాగమునకంటె దక్కువగ, నూటికి 30 వంతున జనాభాగల 37 దేశములుమాత్రమే, వ్యవసాయకుల జనాభాలెక్కలు దేల్ప ప్రయత్నములు చేసెను.

"నానాదేశ వ్యవసాయసంఘమువారిచే సూచింపబడిన ప్రపంచవ్యవసాయపు లెక్కలు (Census) నేటి వఱకును లేని వివిధదేశముల వ్యవసాయసిద్ధాంతముల కైక్యస్వభావము నొసగును.

"దేశీయముగను, నానాదేశీయముగను, ధరల నిర్ణయముల కావశ్యములగు పంటలయు, పశు

వ్రులయు, అనుభవించు విధానములయు వివిధ పదార్థములయు రవాణాల విషయమున వ్యవసాయ దారులకు వార్తలు శీఘ్రముగ జేర్చుటకు నేర్పాటులు గావించు టత్యావశ్యకము. వివిధదేశముల వ్యవసాయ పదార్థములను వ్యాపారవస్తువ్రులను, వివిధ వ్యవసాయ వస్తువ్రులను పండించుటకగు వ్యయముల, నెలసరిలెక్కల ప్రకటన మమూల్యమగు సహాయము చేయును.

"iii. ప్రభుత్వములన్నియును ప్రస్తుతవ్యవసాయ పరిస్థితులను, వాని నభివృద్ధిగావించుటను, భూములు ఖండములుగ విభజించువిధానమును, పంటలను పండించుటకు వానిని వినియోగించు పద్ధతిని, వ్యవసాయ, వ్యాపారపదార్థముల యుత్పత్తిసంబంధమును, వ్యవసాయ, వ్యాపారముల ధరల తారతమ్యమును, వాని నుత్పత్తిచేయునట్టియు, విక్రయించునట్టియు ధరలను, కార్మికుల స్థితిగతులను, భూసంపాదనమున వారికిగల యవకాశములను (ఆర్థిక, సాంఘిక, విజ్ఞాన, ధనవిధానముల యందు) బాగుగ పరిశోధించి, తన్మూలమున భావ్యభివద్ధిని గావించు సౌకర్యముల నేర్పఱుపవలయును"

జినీవాసభ యిట్లు ప్రకటించుచున్నది:— ఈసర్వ కష్టములను విచారించుకొనుటకు సక్రమమగు పరపతి సంఘ నిర్మాణమే ప్రథమమార్గము.

"ఈకష్టముల బాపుకొనుట కీవఱకు సహకార సంఘములు లేని దేశములలో వానిని నిర్మించుటయు, నవియున్న దేశములలో వాని నభివృద్ధి పఱచుటయు, నవసరము. దీనికితగిన సక్రమనిర్మాణము నుద్యోగుల సాయమునగాని, వారి సాయములేకగాని వలసిన పద్ధతుల నవలంబించి సహకారపు పరపతిసంఘములు స్థాపించి వాని నున్నతినొందింపవలయును. మఱియు,

"ప్రధానముగ ప్రభుత్వసహాయముతో ఒండొరుల పరపతి నిర్మాణమును, అభివృద్ధిని, నెక్కుడుగ గావింపవచ్చును."

ప్రపంచశాంతిసభ (50 దేశముల ప్రాతినిధ్యము గలది) యొక్క సిద్ధాంతసారాంశము హిందూదేశ కళ్యాణము ప్రప్రథమున సహకారపు పరపతినిర్మాణమునందు తదభివృద్ధియందే గలదని తేలుచున్నది. కాని యింతవఱకు హిందూదేశమున 1/12. వ వంతున మాత్రమే సహకారపు పరపతియుద్యమము వ్యాపించియున్నది. ఇందుగల యుద్యోగులసంఖ్య, సక్రమపు బ్యాంకువిధానమున కుండవలసినంతలేదు. ఉదా:-బెంగాలు ప్రభుత్వ సహకారోద్యోగుల సంఖ్య 450 మాత్రమే. కాని బెంగాలునకు సేవయొనరించుటకు కనీసము 5000 మంది యైనను కావలసియున్నారు. తన గతవార్షిక ప్రకటనమున

రిజిస్ట్రారిట్లు నుడివెను. "నూతనాభివృద్ధిని సక్రమమార్గముల గావించుటకు వాస్తవముగ నవసరమయినంద ఉద్యోగుల బెంచుటయే వివేకమగు పద్ధతి."

నానాదేశసమితి సిఫారసుచేసినట్లు సహకారోద్యమమును నిర్మించి, బాగుగ నిర్వహించుటకు హిందూదేశమునగల కార్యదక్షులగు 30,000 మంది యువకులు పూనుకొనవలయును. వీరు వేలకొలది జనుల కుద్యోగములు గల్పింపగలరు. కాబట్టి ప్రభుత్వమువారీ యువకులకు తమ మాతృదేశమును పునర్నిర్మాణము గావించుకొని, వివిధదేశములయందు తమగౌరవ స్థానమును స్థాపించుకొనుట కవకాశము లొసగెదరా? ఈ యువకులు తమకుగల యవకాశములను మించిపనిచేసి చూపింప సమర్థులు. గ్రేట్‌బ్రిటను యొక్క $4\frac{1}{2}$ కోట్ల ప్రజలు వినాశకములగు యుద్ధములకు 10,000 కోట్ల రూపాయలు ప్రోగుచేసికొనగల్గగా, హిందూదేశ ప్రభుత్వము శాంతినిర్మాణ కార్యసఫలతకు కొలదికోట్లరూపాయల నొసగజాలనిచో, 32 కోట్ల భారతీయుల ధనవిధానము నందేదో ప్రమాదకరమగు లోపముండియుండకతప్పదు.

"బ్యాంకు, ధనము నప్పుబుచ్చుకొని, ఇతరులకు ఋణములొసగు సంస్థగాదు. అది పరపతినే సృష్టించు

సంస్థ" యని యొకవిజ్ఞానవేత్త నుడివెను. బ్యాంకుధనము బంగారమునుండిగాక, ఋణములనుండియే సృష్టింపబడుచున్నది. రైతులకు ఋణములు తలమునుకలుగనున్నవి. కావున దీనినుండికోట్లకొలది ధనమును సృష్టింపవచ్చును. కాని నానాదేశసమితి నుడివినట్లు, రైతు సహకారముగ నిర్మాణము గావించుకొనినపుడే, యీధనము సురక్షితముగ నతనికి ఋణముగ నొసగబడును. కాబట్టి సత్వరమే నిర్మాణమునకు గడంగుడు. త్వరపడుడు లేశమేని జాగుసేయకుడు. వలన, నిర్మాణమునందే హిందూదేశము వెలి బాగా పరిగెచులను, ఆహారపదార్థముల సమృద్ధిని, జీవనవికాసమునుగాంచు దివ్యమార్గముగలదు.

సహకారోద్యమము—ప్రజాయత్త ప్రభుత్వము.

1913 సం॥ మార్చిలో కలకత్తాయందు జరిగిన రాష్ట్రీయ సహకారసభయందు వంగప్రభుత్వ కార్యనిర్వాహకసభ్యుడగు లెయుక్గారొసగిన యుపన్యాస సారము.

ఆర్యులారా;

సమ్మేళనము (Consolidation)

రిజష్ట్రారు తన వార్షిక నివేదికయందు మన సహకారసంఘ సమ్మేళనమును గుఱించిన ప్రత్యేకవిషయమును వక్కాణించెను. ఈపదముపై గొన్ని దురభి

ప్రాయములింకను ప్రబలియుండుట శోచనీయము. సమ్మేళనమున సంఘములన్నియును సహేతుక సిద్ధాంతముల నంగీకరింపవలయు ననియే మాభావము. మనము వీనిని సమ్మతించుటకుపూర్వము మీయుద్యమాభివృద్ధికి నిర్మింపబడిన సాధారణ విధానమును సమ్మతింపనగు. యీ సహకారసంఘముల సంకుచితపఱచుట లేదు. సహేతుకమగు దూరదృష్టి యుంచగలదు. మేము దీర్ఘకాలమునుండియు పునాదులనుండియే యారంభించుటావశ్యకమని నుడువుచున్నాము. నిచ్చెనయొక్క దిగువమెట్టునుండియే మేము పైకెక్కుటకు ప్రయత్నింతుము.

నేడు వినియోగపఱచుట కేర్పడిన ఋణములు గోరువారు గ్రామసంఘములతోడను, వ్యక్తిగతమగు పరపతిచేతను పైబడినభాగమును భరింపజాలమిచే, వీని సంయోగ పరపతిని వాంఛించువారితో నారంభింతుము. ఇట్టి సక్రమ-నిశ్చల సంఘముల నేర్పఱచినపుడు వీనిని తనిఖీచేసి, యవి సక్రమమార్గముల నడుపబడుచున్నవని తెలిసికొనుటకును, గ్రామసంఘములకంటె విపులమార్గములనుండి సంపాదించిన మూలధనముతో ధనసహాయ్యమొనరించుకొనుటకును, వీనినెల్ల నైక్యమొనరించి యొక కేంద్రబ్యాంకు క్రిందకు తీసికొనివచ్చెదము. మఱియు, నీ కేంద్రపుబ్యాంకులుఎక్కువపరీక్షయు, మూలధనముకు

గావలసినంత వృద్ధిగాంచుచో నాభాగ్యవంతమగు రాష్ట్ర మునందంతటను జరుగు మనకార్యముల నడుప వీనిని రాష్ట్రీయపు బ్యాంకుక్రిందకు జేర్చెదము.

ఇట్లాలోచింపబడి, నిర్వహింపబడు విధానమునకు ప్రభుత్వము స్వతంత్రముగ జాగ్రత్తగ ఖాతాలు సరి చూచుటయందును, పూర్తిగ నుద్యమపు పరపతిని, నిశ్చలతకును వినియోగించు పరీక్షచేయుట యందును సాయము చేయుచున్నది. ఇకముందుగూడ పూర్తిగ సాయపడును.

హిందూదేశమున నితరభాగములందు అక్రమ కోశవిధానముల వలన నపజయము గాంచినట్లు మాకు దెలియనయ్యెను. బ్యాంకుకార్యములను క్లిష్టముగావించు (Askance) సామాన్యమగు నపనమ్మకమును, అనిష్ట తయు వ్యాపించుటయే దీని గొప్ప యపాయము. తక్కిన చాలబ్యాంకులు నాశమయినపుడు, సహకారపు పరపతి సంఘములు దృఢముగ నిలువబడుట, సహకార సిద్ధాంత ముల గొప్పతనమునకు గౌరవ మొసగుచున్నది. పెక్కుర నిలువదారులను నాశమొనరించిన తక్కిన బ్యాంకులకును, సహకారపరపతి సంఘములకును చాల భేదముగలదు. మనమొక నూతనసంఘమును స్థాపించు టకు పూర్వము, దాని సక్రమసిద్ధాంతములను వాంఛిం

పనిచో! మనమును దక్కిన బ్యాంకులవలెనే సర్వనాశ ప్రతిఫలము ననుభవించియే యుందుము. మనమిట్టి తుపానునెదుర్కొంటిమి. తక్కిన బ్యాంకుల వినాశముతో మీ కేమియు సంబంధము లేదని చూపితిము. మఱియు నే ప్రతిబంధ భయమును లేక మన విధాన విజయమునకు తీవ్రకృషిగావించుటకు స్వతంత్రులమై యుంటిమి.

మనలో కొందఱు మనోహర స్వప్నములు గాంచుచున్నారు. ఇవిత్వరలోనే సఫలములు గావచ్చును. నేడు బహాళసంఖ్యాకులగు మీ దేశజులను నడుపుచుండిన దేశభక్తి భావమున నా కొకింత యనుభవముగలదు. ఈ దేశభక్తి యుత్సాహము కొలదిమంది యువకులను వక్రమార్గముల నడపిన నితరులకిది తమదేశజులకు సేవజేయ గంభీరశక్తి నొసగినది. ఇది, భావి వంగదేశాభ్యుదయమునకు, పాటుపడవలయునను భావమును శక్తిని పలుకుబడి గల పెక్కురయందు గాఢముగ నాటినది. గవర్నరుగారు మీకు జ్ఞప్తిపఱచినట్లీవాంఛను బర్ద్వాను, మిడ్నపుర ములయందలి వరదలకాలమున పెక్కురు కష్టములకు లోనైన గావించిన సేవయందు గాననగు. సజీవమును, ఆరోగ్యదాయకమునునగు వ్యాయామమున కిదియొక విశాల వ్యాప్తిగాంచిన కార్యోత్సాహము.

## రాజ్యాంగ తత్వము.

పెద్ద యుద్యోగులకును, మీనాయకులకును పరస్పర సంబంధము గలిగించుటకు నేడు మీ శాసన సభలయందు గావించుచున్న సంస్కరణములను నేను తృణీకరింపను. ఏలన, మనము రాజ్యాంగభవనము నుదృఢముగనుండ వాంఛించుచో, సాంఘికార్థిక విష యములందు గట్టిపునాదులతో భవననిర్మాణ మొనరించు నట్లు రాజ్యాంగభవనమును సంయుతము బలమగు పునాదులపయి గట్టనగును. ఒక ప్రతినిధియొక్క గౌరవ ప్రతిష్టలు, తన్నెన్నుకొనిన ప్రజలయభిమానముపయి నాధారపడియుండును. తాను నడపుపక్షమునందు జీవన వికాసమును, శక్తియు లేనిచో నాతడు నామమాత్రా వశిష్టుడుగనే యుండును. ఈప్రజాబలము తనకు పునాదు లయిన గ్రామములమీదనే యాధారపడియున్నది. మిమ్ములను, తమ సమష్టిలాభమునకు కృషిసేయ శాసనసభలకు బంపుప్రజలను, నెవ్వలైక్య మొనరింప గలరు? భావినిర్వాచన సంస్థలకు సక్రమ నిర్మాణ వంతములగు పునాదులు వేయు సహకార పరపతి సంఘములు చూపించినటులే వారి నైక్య మొనరింప వలెను. గ్రామకల్యాణ కరములగు సర్వకార్యముయందు నైక్య మొనరించుట గ్రామ, కేంద్రప్రభుత్వములతో కలిపి

గ్రామ సహకార సంఘమును ఎన్నిక సంస్థగ భావించు కాలమును నిరీక్షించుచున్నాను. కొన్ని యూనియనుల కేర్పడిన శాసనసభకు సమ్మతి నొసగు (Vote) హక్కు గలిగి ప్రతియెన్నిక సంస్థయు గ్రామ సౌకర్యములను చేకూర్చు వారిని ఎన్నుకొనును. ఇతడు, వీనిపై శాసనసభ కిదే విధముగ సభ్యు నెన్నుకొనును. ఇట్టి ప్రత్యభి వృద్ధికిని ప్రభుత్వము మీకు తోడ్పడుటను మీరు గాంతురు. ఏలన, నీ మార్గమున మాత్రమే ప్రజాయత్త కార్యములలో పలుకుబడి గలిగి సక్రమ వంగదేశ ప్రభుత్వమున కమూల్య సేవ గలిగించు ప్రజాయత్తపు టెన్నిక సంస్థలు మనకుండునని నేను విశ్వసించెద. విద్యాధికులగు ప్రజల సాయము గల ప్రభుత్వముకంటె చక్కని ప్రభుత్వ మెద్దియు నుండజాలదనియే రాజ్యాంగ తత్వసామాన్య సిద్ధాంతము, కాబట్టి మీరు గావించు సక్రమ కార్యమున మీతో నేకీభవించు వారెల్లరు నేడు ప్రభుత్వమును, ప్రజలను నెదుర్కొనిన కష్టములగు రాజ్యాంగసమస్యలు పరిష్కరింప నమూల్య సేవ చేసిన వారగుదురు. ఈ క్రిందివిషయము డన్నింగుమ్యాక్లొడుగారి "Elements of Banking" నుండి యుదాహృతము "స్కాట్లాండు దేశాభివృద్ధికిని, సంపదలకును కారణములగు పరపతితెగల నిపుడు

వర్ణింతము. గత శతాబ్ద్యారంభమునుండియు స్కాట్లాండు బ్యాంకు పౌ 1 నోట్ల నచ్చొత్తింప మొదలిడెను. 1727 వ సంవత్సరమున రాయల్ బ్యాంకు అను మఱి యొక బ్యాంకు స్థాపింపబడెను. నాటి సంకుచితస్కాచ్ వ్యాపారమున బ్యాంకుల పరపతిని గ్రహింప గలిగినన్ని వ్యాపారపు బిల్లులులేవు. అనగా వారికి పరపతియెక్కు వగ నిలువయుండెను. రాయల్ బ్యాంకు దీనిని ప్రవ హింపజేయు మార్గములు కనుగొనెను. "తగినంత నమ్మకము లభించునపుడు, గౌరవనీయులు, విశ్వాస పాత్రులునగు వారికి పరపతుల నొసగుటకిది సమ్మతించెను."

డబ్బుపరపతియన నొక వ్యక్తి కేర్పరించిన ఖర్చు ఖాతా (Drawing account). ఇందుపై నాతడు సామాన్యమగు ఖర్చుఖాతావలెనే వ్యవహారము జరుపు కొనవచ్చును. కానియొక్క భేదముమాత్రముగలదు. అది యేదన; మనస్కాట్లాండులో సామాన్యముగ వ్యక్తి తన ప్రతిరోజు నిల్వకువడ్డి పొందుటకు ముందుగా, తన ప్రతిరోజుఖర్చు నిల్వఖాతాకు వడ్డీ చెల్లించును. ఈవిధ ముగ నిది తలక్రిందులుగ నున్న ఖాతాలెక్కయై యున్నది (Reverse Drawing Account.)

"ఈఋణములన్నియు, బ్యాంకుయొక్క సొంత నోట్లరూపముగ నొసగబడును. ఇవి లోగడ వ్యవహారములపైనాధారపడి యుండవు.

"సొమ్ము పరపతులు మారకపు బిల్లులుకాని ప్రత్యేక వ్యవహారములపయి నాధారపడియున్నవి. వీనివిధానము నిపుడు స్పష్టముగ వివరింతుము.

"స్కాట్లాండులో వ్యాపారముసేయు ప్రతియువకుడును సొమ్ము పరపతితో నారంభించును. ఉదా:- ఆంగ్లదేశమున, ప్రథమమున తనవృత్తి నారంబించుటకు న్యాయవాదికి ధనముండవలెను. ఏలన, తనకు కేసు నిచ్చుఖిరియాదీలనుండి (lientsc) ధనమును స్వీకరించుటకు పూర్వ్యమతడు కొన్నిఖర్చులను చెల్లింపవలయును. కాని స్కాట్లాండులో నిది తనమిత్రులచే 'విశ్వాసపాత్రుడ'ని సిఫారసుచేయబడిన సొమ్ము పరపతి వలననే జరుగుచున్నది.

"ఈసొమ్ము పరపతులు భాగ్యవంతులకు, పేద. లకు, సకల సంఘములలోని సమస్త జనుల కొసగబడును. అంతయు శీలముపయి నాధారపడియుండును యువకులు తమవృత్తులలో నిశ్చలత్వమును, న్యాయపరాయణతను బ్రకటించి, తమమిత్రుల నాకర్షింతురు. ఈ మిత్రులు, వీరు తీసికొనుసొమ్ము పరపతికి హామీగ

నుండుకు. ఇది వారికి ధనమునంటిదే. కావున నప్పుడు వారు తమ శక్తి సామర్థ్యముల కొలది యభివృద్ధి గాంచుట కవకాశములుండును. "ఈవిధముగనే వంశ పారంపర్యముగ స్కాట్లాండులో వ్యవసాయ మభివృద్ధి గాంచెను. బంజరుభూములు, నిరుద్యోగజన మధికముగ నుండెను. గాని తమవృత్తి సాగింప మూలధనము లేకుండెను. ఈస్థితిగాంచి, బ్యాంకులు దేశమున వివిధ భాగములయందు తమశాఖలనుస్థాపించి, పానునోట్లను విరివిగ బంపి, రైతులకు సొమ్ము పరపతులనొసగెను. ఈనోట్లను నాణెములవలెనే యందరు స్వీకరించిరి. రైతులు తాముకొనిన వస్తువులకును, కార్మికుల కూలి కిని వీనినే యొసగిరి. చాలచవుటి భూముల నీధనముతో బలపఱచి, ఫలవంతములు గావించిరి. ఈ పానునోట్లు నాణెమును తొలగించి దాని స్థానము నాక్రమించలేదు. ఇదివఱకున్న నాణెములను తొలగించియు నుండలేదు. ఇదివరకున్న ధనముతో నివిచేరెను. ఇది బంగారు నిర్మాణమునకు సమానముగ నుండెను.

"కాబట్టి యీసొమ్ము పరపతులసాయమున క్రమముగ వ్యవసాయ, వ్యాపారము లభివృద్ధిగాంచెను. ప్రజాదృష్టిలోగూడ వీనికి సమాన వినియోగముగలదు. ఈసొమ్ము పరపతుల వలననే ప్రజాయత్త కార్యము

లన్నియు గావింపబడెను. రాయల్ బ్యాంకొసగిన పౌ 40,000 సొమ్ము పరపతులతోడనే ఫోర్తు, క్లైడ్ కాలువ త్రవ్వబడెనని యొకరు నుడివిరి. ఇక్లే బాటలు వంతెనలు, కాలువలు, రైళ్లు, ఓడరేవులు మొదలగు ప్రజాయత్త కార్యములకు నేదోయొక బ్యాంకు నుండి యీ పరపతులు స్వీకరింపబడుచుండెడివి.

"స్కాట్లాండు అనాగరకదశనుండి 150 సంవత్సరములలో నభిమాన పాత్రమగు నేటి స్థితికి దెచ్చిన యద్భుత కార్యములన్నియు నాపరపతి ఫలితములే. 1688 వ సంవత్సరపు విప్లవమునాడును, స్కాట్లాండు బ్యాంకు స్థాపన కాలమునను మఱియేదేశము ననుభవింపని సంకటముల పాలగుటవలనను నాగరక ప్రపంచమునకు దూరముగనుండుటవలనను, మానవత్వము నొసగు వ్యాపారమునకు దూరముగనుండుటవలనను, రక్త, భాషలయందు భిన్నములగు రెండు తెగలచే రెండు దేశములుగ విభజింపబడి యుండుటవలనను నీదేశము యూరపులోనికెల్ల నెక్కుడనాగరకముగను, అరాజకముగను నుండెననుట సత్యము. దాని సభ్యతాభాగ్యముల యభివృద్ధికి జాతీయ విద్య, బ్యాంకుల విధానమును నవి రెండే ప్రబల కారణములనుట వాస్తవము. బ్యాంకు విధానము వెండి, బంగారు గనులకంటె వేయి

మడుంగు లధికముగ సేవ యొనరించెను. అమూల్యము లగు లోహపు గనులు దాని ప్రజలనవిపరీతి పరులుగ గావించెడివే కాని యందలి బ్యాంకు విధానము మాన వోచిత శీలములను, సత్ప్రవర్తనముల నభివృద్ధిపఱచెను. తన ప్రజల శీలమునందును, నిశ్చలత్వమునందును, సంఘీ భావమునందును, గౌరవమునందును, పేరు, మెక్సికోల, గనులకంటె నెక్కుడు లాభదాయకమగు భాగ్యము నది గనుగొనగలిగెను.

"ఇట్టి యద్భుత ఫలముల నొసగినసొమ్ము పర పతులులోగడ కృషిపంబుగాని, యీవరకే యున్నవస్తు వుల మూరకముపంబుగాని యాధారపడి యుండలేదని మనకు స్పష్టమగుచున్నది. ఇవి లేనిదే లభింపజాలక నాణెపుధనము లభింప నంతవఱకు నుత్పత్తిచేయజాల నట్టి భావివస్తువుల యుత్పత్తికొఱకై యివి నిర్మింపబడినవి. బ్యాంకులును, తత్ కర్తలును మూరకపుటాస్తిని (పౌ 1 నోట్లును) విరివిగ స్పష్టించిరి. ఈయాస్తి వెండి బంగారములు చేయుకార్యమునుజేసి జూపించినది. ఇది తనకార్యమును నెఱవేర్చిన పిదపదన్ను నిర్మించినవారి చేతనే నిర్మూలముకాగలదు.

"ఇట్లు మానవునియిచ్ఛయే శూన్యస్థితినుండి యపారభాగ్యమును నిర్మించెను. తరువాతధన మూల

"ఇట్లు మానవునియిచ్ఛయే శూన్యస్థితినుండి యపార భాగ్యమును నిర్మించెను. తరువాత దన మూలమున గావలసిన పని నెఱవేరినంతనే యది నిర్మాతల యిచ్ఛచే దిరిగి తన శూన్య స్థితికి బ్రాపించినది. కొంత కాలమునకు కది యంతర్ధానమై మహావాయుమండలమున గలిసిపోయెను."

"కాని స్వప్నములో గాన్పించిన నిరాధారములగు వస్తువులవలె వీని ఫలములు మాత్రము నిర్మూలములుగావు. తద్వ్యతిరిక్తముగ దీని మూలమున బ్రసిద్ధవ్యవసాయము, గ్లాసుగో, పెయిస్లే యుత్పత్తి పదార్థములు, నిర్నిరోధములగు క్లైడ్ స్టీమరులు, కాలువలు, రైలుమార్గములు, బాటలు వంతెనలు, మొదలగు సర్వవిధములయిన బ్రజాయత్తకార్యములు నెఱవేఱెను. పేదయువకులు, వ్యాపారశ్రేష్ఠులుగ మార్పబడిరి."

వాల్టరుబ్యాగ్ హాట్టుయొక్క "లాంబార్డు స్ట్రీటు"నుండి యుదాహృతము.

"నిల్వలబ్యాంకులు గావించు బ్రథమ కార్యము బ్రజావిశ్వాస పాత్రమయినది. ఇట్టివ్యాపారము సాగింప గలిగినపుడే నిల్వల బ్యాంకువిధానము త్వరితముగను, విశాలముగను వ్యాపింపగలదు. ఈవిధానమువలన దేశము

నకు కాగితపునోట్లు విరివిగ లభించును. కాని, యిందు వలన నేను నానియమముల నతిక్రమించి, కోశసమస్యలు తర్కింప బోవుటలేదు. ఏరూపమున సక్రమమగు కాగితపు నోట్లు దేశమున కొసగవలయునను ప్రశ్ననుగూర్చి నేనిట వితర్కింపను. నే ననుమానాస్పద విషయములు విడిచి, కేవలము చరిత్రాత్మకవిషయములనే పొందుపఱచెద. నాణెములకు మించినకొలది విలువగల కాగితపు నోట్లు ప్రకటించుహక్కును బ్యాంకు దారుల కొసగుట చేతనే ప్రజలయందు బ్యాంకు విధానమును వ్యాపింప జేయగలము. అనగా ప్రథమమున తమ కార్యమును చక్కబెట్టుకొని, బ్యాంకులో ధనము నిలువచేయువారేర్పడు వఱకును, బ్యాంకును కొనసాగించు కొనుటకు సహాయధనముగ నుండును. నిలువల బ్యాంకు విధానము నెక్కుడుగ వృద్ధిపఱచిన దేశము స్కాట్లండు దేశమే. ఇచట ముఖ్యమగు లాభములు ధన వ్యాప్తివలననే లభించినవి. స్కాటిష్ బ్యాంకు ఋణములో నోట్లప్రకటనము నేడ ప్రధానవిషయము. కాని యొకప్పుడు మాత్రమిది వారి ప్రధానాంశమును, లాభములకుమూలమునై యుండెను. కొలదికాలము క్రింద ప్రకటింపబడిన యొక గ్రంథమునందీ విషయము విపులముగ చర్చింపబడెను. 1763 వ సంవత్సరమున స్థాపించిన స్కాట్లండు బ్యాం

కుతో కలుపబడుటకు 8, 9 సంవత్సరములకు పూర్వము డండీబ్యాంకునకు నిలువ లధికముగనేయుండెను. కాని యది స్థాపింపబడినప్పటి నుండియు 20 సంవత్సరముల వఱకును నిలువలే లేవు. ఇది పూర్తిగ నోట్లప్రకటనము వలనను, తన వ్యాపారమువలన లభించిన కొలది ధనము వలనను మాత్రమే జీవింప గలిగెను. 30 సంవత్సరములకు అనగా 1792 వ సంవత్సరమునుండి మాత్రమే యిది నిలువలను సంపాదింపగలిగి, తరువాత త్వరితముగ వీనిని వెంపొందించుకొన గలిగెను. జిల్లాబ్యాంకుల లెక్కలు స్పష్టముగ లేకపోయినను, ఆంగ్లదేశపు బ్యాంకుల చరిత్రగూడ నిట్లేయున్నది. 1830 వ సంవత్సరము వఱకును, ఆంగ్లదేశమున ముఖ్య లాభములు, వ్యాపనము (Circulation) వలననే లభించెను. చాలసంవత్సరముల వఱకును నిల్వలపద్ధతి యప్రధానముగ భావింపబడెను.

నిల్వలకంటెను పూర్వము బాంకులో కాగితపు నోట్లుండు విధానమునకు కారణము విశదమే. ఇది సులభమగు మార్గము. ఎక్కుడుగ లాభమును గడించుబ్యాంకుదారు నోట్లప్రకటనమున కొంతసాయము చేయగలడు. అతడు తానొసగెదనని వాగ్దానముజేసిన యరువులను, కార్యనిర్వహణములకు జీతములను, తానీయవలసిన ఋణములను సులభముగ చెల్లింపగలడు.

కాని నిల్వలను సంపాదించుటలో నతడు వెనుకబడును. నోట్లప్రకటన యతనిపయి యాధారపడియుండును. కాని నిల్వలన్ననో ఋతరుల కటాక్షముపయి యాధారపడి యుండును. ప్రజలకుకూడ నీమార్పు కడుసులభసాధ్యము. ఒకేబ్యాంకులో చాల నిల్వలనుంచుట పెక్కుర యభ్యాసము. కాని నోట్లప్రకటన ప్రవాహాభివృద్ధిని గావించినచో పెక్కురతో నవసరములేదు. తమ వ్యాపారములకే బ్యాంకునుండి నోట్లను స్వీకరింతురు. కాని వీరు వీనిని బ్యాంకునకు తీసికొనపోయి వానికి బదులుగ నాణెముల నడుగకుండుటయే వారు గావింపవలసిన సహాయము. ప్రజలు కష్టములను వాంఛింపనిచో, కాగితపు నోట్లప్రవాహము వెంటనే స్థాపనమగును. కాగితపు నోట్ల ప్రవాహము ప్రజల కృషిలేకయే బ్యాంకువారి చేతనే యారంభింపబడును. కాని యీ ప్రకటనము గావింపబడిననోట్ల నంతమొందించుటకు ప్రజలు కృషి గావింప వలసియుందురు. కాని నిల్వలబ్యాంకు విధానము బ్యాంకువారిచే నారంభింపబడజాలదు. ఇది ప్రజల యొక్క ప్రత్యేకకృషిపయి యాధారపడియుండును. కాబట్టి బ్యాంకునిల్వలకు స్వభావసిద్ధమగు నారంభము కాగితపునోట్ల ప్రకటనమే బ్యాంకువారి యీనోట్ల ప్రకటనము వసతుల నేర్పరచు విధానమని విశదమే.

ఒకవ్యక్తి పూర్తిగ బ్యాంకునోట్లున్నపు డాతడు బ్యాంకును పూర్తిగ నమ్ముచున్నాడని స్పష్టమే. కాని వానివలన నత డేవిధమగు వడ్డీని సంపాదించుటలేదు. నాణెములు కూడబెట్టుటవలన, పోగొట్టుకొనుట, దొంగిలింపబడుట యను నష్టములుకలుగు రీతిగ నీనోట్ల విషయమునగూడ ప్రమాదములు తటస్థించును. కావున నతడు ధనమును బ్యాంకులో నిల్వయుంచినచో, బ్యాంకునాశనమువలన నష్టమును బొందడు. మఱియు ధనమును తనయొద్ద నుంచుకొనునపుడు సంభవించు ప్రమాదములనుండి రక్షింపబడును. అజ్ఞానులు విద్యావిహీనులీ స్వల్పసత్యమును గ్రహించుటకు కొంతకాలముపట్టును. తమ ధనమును దాచుకొనవలయునను వాంఛ ప్రజలయందు బలవత్తరము. కాబట్టి కొంతకాలమువఱకును వీరు తమ నోట్లను తమవద్దనేదాచుకొందురు. కొలదిమంది చాల కాలమువఱకు దాచుకొనవచ్చును. కాని తుదకు సామాన్య విజ్ఞానమే జయము గాంచును. అప్పుడు బ్యాంకునోట్ల ప్రవాహము క్షీణించి, నిల్వలవిధానము బెంపొందును. ఈ నోట్లవలన బ్యాంకుదారుల పరపతి వ్యాప్తిజెంది ప్రజలు సమ్మతించినవెనుక నోట్ల ప్రకటన మాగిపోయినను ఈ పరపతి చాల ప్రాముఖ్యముగ బ్యాంకువారి కుండును.

"ఈ పరపతియొక్క విలువ, నోట్ల ప్రకటన హక్కునుబట్టియే యుండును. పరాసు బ్యాంకువలె నొకే బ్యాంకుదారునకీహక్కు ఉన్నచో దేశమంతటను చాల కష్టముతో వ్యాపనమగును. గాన తనబ్యాంకును కూర్చి ప్రజలలో నెమ్మదిగనే ప్రకటన గావింపగలిగియుండును. దీనికి కారణము కేంద్రధనాగారము ప్రధానపట్టణములలో నుండుట. మండలధనాగారములో విశ్వాసము పరిచయము గలిగినవారిచే స్థాపింపబడియుండును. నోట్లప్రకటనము ఋణముల నొసగుటతోడనే యారంభమగునుగాని యప్పుడు చెల్లింపవలసిన నిలువలుమాత్రముండవు. గ్రామములలో మొత్తములుగ ఋణములు దీసికొనుటయేయుండును. వట్టపుబిల్లులు చాల స్వల్పముగనుండును. ఋణములను దీసికొనువాడు కొలది యాస్తిగలవారుగను, గ్రామములలో నెరిగినవారుగను నుందురు. వారు తాకట్టు బెట్టదలచునాస్తివిలువ గ్రామపరిస్థితులను బట్టియే యుండును. కావున నదేమండలములో నివసించుచు, నామండల చరిత్రనంతయు పూర్తిగ నెఱిగి యచటిమార్పులను గమనింపగలిగిన, నామాండలికు డచటధనమును సురక్షితముగ ఋణములొసగగలడు. కాని కేంద్ర ధనాగారమునుండి యేర్పరుపబడిన మ్యానేజరు (వ్యవస్థాపకుడు) ఇట్లుగావించుటలో బెక్కుసంకటములకు

గుఱియగును. దగాకోరు లతనికడకేగి ఋణము లడుగుదురు. ఆడంబరప్రియులకు, వాచాలురకాతని యజ్ఞానముబాగుగ తావొసగును. కాబట్టి, యతనికి ఋణములొసగుట కచటిప్రజల స్వభావము తెలియమిచే, దూరప్రదేశముననున్న బ్యాంకుధనప్రవాహ వ్యాపకము నందు విపత్పరంపరలకు గుఱియగును.

"కావున నోట్లప్రకటన విధానము, ఎక్కుడు నిల్వల బ్యాంకువిధానమునకు ప్రధానమార్గము. ఇంత వరకు చరిత్రాత్మకముగ నిదియొకటియే మార్గముగ నున్నది. మొదట నోట్లప్రకటనమును గావింపక నిల్వల నభివృద్ధిపఱచు బ్యాంకువిధానము నేదేశమునందును నింతవఱకును స్థాపింపలేదు. కావున నోట్లప్రకటనవ్యాప్తికి మండలములోనుండుచు, నచటిపరిస్థితుల బాగుగ నెఱిగిన వారావశ్యకము.

లాంబార్డుస్ట్రీటు జీవించుటకిదియే ప్రధానకారణము. ఇందువలననే యాంగ్లదేశము పెద్దధన విపణిగ (మార్కెటుగ) నున్నది. ఇతర పాశ్చాత్యదేశములుకూడ నిట్లేయున్నవి కాని యాంగ్లదేశముతో పోల్చిన చాల స్వల్పము. ఆంగ్లదేశమునందును, స్కాట్లాండునందును నోట్ల ప్రకటన ప్రవాహవిధానము, సర్వప్రదేశములందును బ్యాంకుల స్థాపనమున కవకాశము నొసగెను

ఈబ్యాంకులలో నచట గడింపబడిన లాభములీ బ్యాంకుల ద్వారా లండనునకు బంపబడును. ఇట్టివిధానము మఱి యేదేశమునను గావింపబడకపోవుటచే లండను ధనముతో నిండిపోయెను. దీనితోబోల్చిన యూరపులోని యుతర పట్టణములకేమియు ధనములేదని చెప్పవచ్చును. మఱియు, లాంబార్డు స్ట్రీటుయొక్క రాచరికమునోట్ల ప్రకటనమువలనగూడ నేర్పడినది.

## కాగితపునోట్లు.

హిందూదేశపు వ్యాపారప్రజలు సర్. విలియమ్ మేయరుగారి కాగితపు నోట్లయు, రూపాయనోట్లయు ప్రకటనమును సమ్మతించినందులకు సంతసించెదరు.

ఈ క్రిందప్రకటించు గొప్పవారి యుద్దేశములు గ్రేటు బ్రిటనున నోట్లప్రకటనకు నేమిగావించినదియు లండను పట్టనమును కోశములకు ప్రపంచ కేంద్రముగ గావించిన నిల్వల విధానము నెట్లు ప్రోత్సహించినదియు జూపును. అట్టి ఫలితములనే, యిచట చూపినచో హిందూదేశము తన కృతజ్ఞతను జూపును.

ప్రభుత్వపు కాగితపు ధనమునకు దేశమునగల సర్వవస్తువులయు, వెండిబంగారములయు శక్తి, బలములు గలిగియుండును. ఇది బలమును స్థితిస్థాపకత్వముతో (Elasticity) కలిపి, 32 కోట్ల ప్రజలయు-వృద్ధియగు

చున్న వాంఛల దీర్పదగిన కోశవిధానమై యుండును. ఈ క్రింది యుద్దేశములనుబట్టి, కాగితపు ధనసక్రమాభి వృద్ధికి, వలసిన ప్రదేశములకెల్ల ధనమును ప్రవహింప జేయుటకు, దేశమునందంతటను గ్రామతాలూకా ధనా గారముల శాఖలు వ్యాపింపజేయు టత్యంతావసరము. మఱియు నీధనమును సురక్షితముగ వీనిద్వారమున మండలములయందును ప్రజలయందును, వ్యాపింపజేయ వచ్చును. దేశము నందంతటను కాగితపునోట్లు విరివిగ వ్యాపింపబడే, ప్రపంచమున లండనువలె కోశౌన్నత్యము నొసగిన నిలువల బ్యాంకువిధాన మేర్పడజాలదు. ఇట్టి నిలువలబ్యాంకు విధానములేనిదే హిందూదేశ మితర దేశములతో బాటు వృద్ధిగాంచ జాలదు. యుద్ధఋణము లకు బదులుగ నది యూరపునుండి స్వీకరించు చుండిన కోట్లకొలది విలువగల బంగారు బలముతో ప్రపంచకో శౌన్నత్యమునకయి అమెరికా, ఆంగ్లదేశముతో పోటీ చేయ జూచుచున్నది. బంగారమేకోశశక్తియనిభావించు నంతదనుక తన కోశాభివృద్ధిని నిలుపుకొనుటకు తన యుత్పత్తి పదార్థముల నభివృద్ధి గావించుటయే సక్రమ మార్గమని యాంగ్లసామ్రాజ్యము గ్రహింపనగును. అందువలన నెగుమతులు వృద్ధియై వానికి బదులుగ బంగారము దిగుమతి యగుచుండును.

ఈబంగారు ప్రవాహమును దిగుమతి గావింపగల శక్తి సామ్రాజ్యమునగల హిందూదేశములోని 32కోట్ల ప్రజలకేగలదు. ఏలన; చౌకగ ధనోపలబ్ధి సౌకర్యములను గావించినచో, నీప్రజలు పంటలనధికముగ బండించి, యెగుమతులెక్కుడు చేయగలరు.

కావున నాంగ్లసామ్రాజ్య మిదివఱకుగాంచిన కోశోభివృద్ధిని నిలువబెట్టుకొన వాంఛించుచో, ప్రజల ద్వారములకడకు చౌకధనమును తీసికొనివచ్చు బ్యాంకుల వివిధశాఖలను హిందూదేశమున నెల్లెడల శీఘ్రముగ వ్యాపింప జేయుటత్యావశ్యకము.

మండలములతోడను, తత్ప్రజలతోడను సక్రమ సంబంధము గలిగియుండు బ్యాంకుల శాఖలు సహకార పరపతిసంఘములు మాత్రమే వీనిని సాధ్యమయినంత శీఘ్రముగ నీక్రిందిఫలితములకొఱకు వ్యాపింపజేయనగు.

(1) కాగితపునోట్ల ప్రకటనాభివృద్ధికి.

(2) నిల్వలబ్యాంకు విధానాభివృద్ధికి.

(3) ప్రపంచ కోశౌన్నత్యము నాంగ్లసామ్రాజ్యమున కాపాదించుటకు,

కలకత్తా; 5 మార్చి, 1917 డి. యమ్. హేమిల్టన్.

## అనావృష్టి—క్షామము.

1878-79. వ. సంవత్సరమున చెన్నరాజధాని యందు గొప్పకఱవు తటస్థించెను. అది యాంగ్లప్రజలకు విచారము గలిగించెను. ఈప్రకరణవిషయమును హిందూదేశముతో గాఢమగు సంబంధములేనివారును, దేశమున కొన్నిప్రాంతములతోడనే సంబంధమును గలవారును బాగుగ గ్రహింపజాలరయిరి. అప్పుడప్పుడు సంభవించు కఱవు సర్వకాలముల యందునుగల యాహారపదార్థముల లోపమువలననేయని గమనింపనగును. అనగా హిందూదేశమున కొన్నిప్రదేశములందు గలిగెడి దుర్భరములగు కఱవు, సామాన్యముగ ప్రతిసంవత్సరమును పంటలక్షీణతవలన సంభవించుకష్టముల ప్రతిబింబమే, దరిద్రావస్థయు, క్షుద్బాధయు, ప్రతిసంవత్సరమును హిందూదేశము నందనేక ప్రదేశముల సంభవించుచునే యుండును. వర్షస్వభావము అగమ్యముగనుండుటచే, వర్షముపంబు నాధారపడియుండు వ్యవసాయపుపంటలు విపరీతముగ మాఱుచుండును. ఆంగ్లకర్షకులు ఋతుపరివర్తనముచే బాధనొందక ప్రతిసంవత్సరమును ఎకరమునకు 28-32 బుషెలుల ధాన్యమునుకూర్చుకొనుచుండుటవలన నాపంటల మార్పును గమనింపజాలకుండిరి. పిమ్మట నీవిషయముతో వారికిగొంత పరిచయమేర్పడినది. కాని,

యొకప్పుడు పంటలుబొత్తిగా బండకబోవచ్చును; పండెనా యెకరమునకు 20 బుషెలులుధాన్యము పండవచ్చును. ఇట్టి స్థితులలో సాగుచేయుడని మనమాంగ్లరైతులను కోరుదుమేని, వారు పరిస్థితులనాలించి, నిర్ఘాంతపడుదురు. ఈ విపరీతమగుమార్పును, తత్ఫలితములనెదుర్కొనుట యెట్లనుసమస్య చాలదుర్ఘటము. కొంతవరకీసమస్య హిందూదేశమున పరిష్కరింపబడినది.

అదనువర్షింపని భూములవైశాల్యమును నిర్ణయించునపుడు రెండు తరగతులభూములను గమనింప నవసరములేదు. అనగా నిరంతర వర్షసంపన్నములగు ప్రదేశములు, అనావృష్టియుతములగు ప్రదేశములు. అనావృష్టిగల ప్రదేశములుగూడ కఱువులకు గురిగావనుట ప్రథమమున నాశ్చర్యమును గొలుపవచ్చును. కాని కొంచెము దూరదృష్టితో విచారించినచో, మొక్కలకు జీవితావశ్యకమగు వర్షములేని ప్రదేశములందు జలాధారసాహాయ్యమును, చెమ్మయులేనిచో సాగుచేయుట యసంభవమని తెలియగలదు. కావున సాగుచేయబడు పంటలవిషయమున, సింధు, పశ్చిమరాజపుత్రస్థానము, పశ్చిమపాంచాలము నందలి సాగుచేయబడు భూములు పంటలులేక ఎన్నడునుండవు. ఏలన,నవి, బావి, కాలువ, నదీ, తటముయొక్కచెమ్మ మున్నగువానిలో నేదియో

యొకదాని సాయము లేకుండ సాగుచేయబడవు. ఈభూము లలో కొన్నిసమయములందు పశువులమేతకూడకాక పోవచ్చును. ఈవిషయమటుంతము. వంగరాష్ట్రము, అస్సాము, మధ్యపరగణాలు, అరేబియా సముద్ర ప్రాంతమందలి పడమటికనుమలలోని భూములలో నెడతెగని తేమగలిగియుండుటచే, మంచిపంటలువచ్చును. మనమిట్లు సురక్షితభాగములవిడిచి, భద్రస్థితిలేని భాగ ముల అనగా వర్షనిశ్చయము లేని ప్రదేశములనుగూర్చి విచారించుచో, నచట 10 సంవత్సరములలో 9 సంవ త్సరములు పంటలుపండి ప్రజలయాశాలతనువికసితమొ నర్చి పదియవసంవత్సరమున అనావృష్టిచే నెండిపోవు చుండును. అనావృష్టివలన దారిద్ర్యమును, ఘోరబాధ లును సంభవించు భద్రస్థితి లేని ప్రదేశములకును, మంచి తేమగాని, జలాధారములుగాని గలిగి సురక్షిత ముగ పంటలనొసగు ప్రదేశములకును మాధ్యమికస్థితి యందున్న ప్రదేశముల పంటలును, బాధలును తరగతుల వారీగ గలవు.

చారిత్రిక కారణములవలనను, చాలప్రదేశముల యందు ప్రకృతితో పెనుగులాడవలసిన భయంకరపరిస్థి తులవలనను, హిందూదేశపు రైతులకు ప్రపంచమున గల రైతులెల్లరికంటెను చాలవరకెక్కువ ఓర్పును,

కష్టసహిష్ణుతయు, బుద్ధిసూక్ష్మతయుగలదు. కష్టముల కలవాటుపడియు, జీవయాత్రను మితాహారముచే నిర్వహించుట కభ్యస్తులయి, కొలదిదుస్తులతో కాలము పుచ్చుచుందురు. అందువలన స్వల్పఫలమునకే శ్రమపడెదరు. తత్ఫలితముగ దేశమున వ్యవసాయము రక్త మాంస పూరితమగునట్టియు, ఆవిరి, లోహయంత్రముల కంటె చాల చౌకయైనట్టియు, మానవదేహ యంత్రము చేతనే నిర్వహింపబడు చున్నది. హిందూదేశమున జీతముల మట్టము మానవుల యొక్కయు, దుర్బల పశువుల యొక్కయు సమష్టికండర శక్తి, కనీస స్థితి యందుండిన యంత్రము కంటెను మించియుండదు. జీతములు వృద్ధి గాంచుచున్నవి. సభ్యతాభి వృద్ధిని గాంచు ప్రదేశముల నివి మఱింత పెచ్చు పెరుగును. కాని, యివి యభివృద్ధిని గాంచువఱకును దేశీయములగు పంటలను యంత్రసాయముచే, నభివృద్ధినిపఱప వాంఛించు సమస్యప్రధానముగ నుండవలయును. ప్రధానమున్న,రక్తమాంసపూరితములగు నీరెండు యంత్రముల(మానవుల, పశువుల,)పరిశ్రమశక్తి నెంతవఱకు వృద్ధిజేయగలిగి, తన్పైగల మానవనైతిక ధర్మమును, వ్యవసాయ భాగ్యాభివృద్ధినిగావించు ధర్మమును ప్రభుత్వమునిర్వహించునా అనునదియే ప్రధాన సమస్య. వ్యవసాయవిధానము స్వల్పఖండముల భూము

లవిధానమైయున్నది. దేశము 5 ఎకరముల ఖండఖండ ములుగ విభజింపబడినదనుటలో నతిశయోక్తిలేదు. ఈ చిన్నఖండములభూములుగల రైతులలో చాలమంది శిస్తును ప్రభుత్వమునకును, ఎక్కుడుమంది తమకును, ప్రభుత్వమునకును, మధ్యగల జమీందారులకును చెల్లించు చుందురు. సహజముగ రైతు తన 5. ఎకరముల సరిహద్దు లలోనే, యావశ్యకమగు కృషియంతయు గావించు చుండును. ఇచటమాత్రము పరులుతనతో జోక్యమును కలుగజేసికొనినచో రైతుసహింపజాలడు. కాని తన 5. ఎకరముల బయటమాత్రమేమియు చేయజాలడు. మధ్యవర్తిగనుండిని జమీందారు (కొంతమంది మంచి వారుగలరు) లేమియు జేయరుగావున,

(1) వ్యవసాయయంత్రి (రైతు, పశువులు) కృషి శక్తిక్షీణతను తగ్గించుట (2) దానికృషిశక్తి నభివృద్ధి గావించుట మున్నగువానివిషయమై ప్రభుత్వము తగిన చర్యల దీసికొనుబాధ్యతను వహింపవలసియున్నది.

"ప్రజలు క్షుద్బాధచే మరణించు నవకాశ మొసగజన"దను సందేశమును ఆంగ్లదేశము 187౹వసం॥న హిందూదేశమునకు బంపెను. కాని, యీ సందేశమును గొనివచ్చిన సభ్యులు, "క్షామకాలమున క్షుద్బాధా పీడితులగు ప్రజలమునహారము నొసగుటకంటె గావింప

వలసిన కృషిగాలగలద"ని నుడివిరి. రైతులబలారోగ్య ములను వృద్ధిపఱచుపరిస్థితులు గలిగించుటావశ్యకమని వారు సూచించిరి గ్రామసంఘసంఖ్యలు తమకార్యదర్శి సాయముచే (సర్ చార్లెస్ యెలియటి) పరిపాలనలోని సర్వశాఖల మార్పులను సూచించుచు నొకనివేదికను ప్రకటించిరి. ఈ సర్వశాఖలమార్పు గ్రామసమస్యకు సంబంధించినదిగ ప్రథమమున గన్పింపకపోయినను, సూక్ష్మముగ పరిశీలించినమీదట దీనితో చాల సంబంధ మున్నదని తేలెను. ఏలన, దేశమంతయు '5 యెకరము' లను జాలచేనిర్మింపబడుటచే, "నెంతక్లిష్టముగనున్నను. పాలనసమస్యల నన్నిటిని శాఖలుగ విభజింపనగు. అందు 5 యెకరముల పరిమాణముగల భూమియు, నా 5 యెక రముల హక్కుదారు (రైతు) యొక్క భాగ్య మను నదే సర్వప్రధానసమస్య యని తెలియనగును.

ఈ గ్రామ సంఘసభ్యుల కృషి మూలమున హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగారు ఆర్థిక జీవిత పరిస్థితులను పరిశీలించుటకును, దేశమున పంటల నభివృద్ధి గావించి, కఱవులను దగ్గించుటకును క్రమవిచారణ చేయదలంచెను. రిప్పను ప్రభువుగారు దేశమునకొసగిన సందేశమున రైతులస్థితి చక్కబట్టు

రైతును బలవంతునిగావించుటయే వ్యవసాయభాగ్యము నభివృద్ధిగావించు ప్రధానసమస్య"యని నుడివెను.

వ్యవసాయకార్యములను చక్కగ నిర్వహించుట యన వ్యవసాయ పరిశ్రమను పోషించి, వ్యవసాయా వసరముల బూర్తిగ దీర్చుటయే. హిందూదేశమున నిల్లు గావించుట యన రైతులకు, వారికుటుంబములకు, పశువులకు నాహారమును పెట్టుటయేయని గ్రహింపనగు. శ్రమను, జలాధారపు వసతులను,వ్యవసాయోపకరణము లను పూర్తిగవారికి లభింపజేయవలెను. ఆహారలోపము, యంత్రరూపమగు వసతులులేమి (జలాధారములు మొ॥) పరిశ్రమయొక్క శక్తిని తప్పక తగ్గించును. అందువలన దేశపుపంటలు తగ్గును. కాబట్టి పన్నులభారమువలన గాని, పన్నులు వసూలుపఱచు విధానలోపమునగాని, మూలధనము సక్రమమగు వడ్డీకి దొరకకపోవుటచే గాని, ఋతుధర్మలోపముచేగాని, శ్రమపోషణకును, భూమి వసతులకును వలసినదానికంటె తక్కువపంటలు పండుచో (ఈ కారణములులేనిచో పంటలుబాగుగ పండును) నిట్టివ్యవసాయఫలక్షీణతనరికట్ట సక్రమమార్గముల నవలంబించుట ప్రభుత్వ ధర్మము. మఱియు వ్యవ సాయ కార్యముల నభివృద్ధిగావింప నేవేనిమార్గము లున్నచో వీని మూలమున శ్రమను పోషించుటకును,

యంత్రనిర్మాణ కార్యములు వృద్ధిగావించుటకును నెక్కుడు పంటలు లభించును. మఱియు భూమిశిస్తును చెల్లింపనవకాశముండును. ఈ సిద్ధాంతముల సక్రమా చరణమువలననే, దేశమునపంటల యుత్పత్తి వృద్ధిగా గలదు. మఱియు పైనజూపబడిన భయంకర పరిస్థితు లందే ఇవి మిక్కిలి యవసరము. ఇట్టి సౌకర్యములు లేనప్పుడును, ఇతర కష్టకాలములందును, నివి జయప్రద ముగ రైతును నిలువబెట్టగలవు. ఇప్పుడు ప్రభుత్వమును, జమీందారులును మానవయంత్రముయొక్క పరిపూర్ణ కార్యశక్తిని నిలువబెట్టుటకును, ఈయంత్రశక్తి నభివృద్ధి పఱచుటకును గావించుచుండిన విషయముల నిట వివరింతము.

(1) రైళ్ళయభివృద్ధి (2) కాలువసేద్యపుటభి వృద్ధి. (3) బావిసాగు అభివృద్ధి. (4) బంజరుభూములను సాగుచేసి వంటచెఱకునకును, పశువుల మేతకును బీళుల నభివృద్ధిపఱచుట. (5) వలస. (6) అవసరమగు చోట్ల రివెన్యూపన్నుల విధానముల యభివృద్ధి. (1) మొత్తముమీద రైళ్ళయభివృద్ధి నిమిత్తము ధనమును వ్యయపఱచి క్షుద్బాధనుమాన్పుట జలాధారనిర్మా ణము మొదలగు నభివృద్ధులకంటె నెక్కువగ జరిగినది. అనిశ్చయములగు వర్షవాయువుల వలన గలుగు జలా

ధారముల కొఱంతను దొలగించుటకు కాలువలను, బావులను నభివృద్ధిగావించి సాగుచేయుట. అనగా పర్వత శ్రేణులవద్దను, భూముల లోపలను కడచిన వర్షవాయువులవలన నిలువయుండిన నీటిని వినియోగించుట. కడచిన 14 సంవత్సరములలోను కాలువలయు, బావులయు, సౌకర్యము చాలవఱకు గావింపబడినదిగాని, యింకను గావింపవలసినది చాల గలదని విశదమగును.

పంటల నభివృద్ధిపఱచునట్టి ద్వితీయవిధానము బంజరు నేలల సాగుచేయుటయు, వంటచెఱకునకును, గొడ్ల మేతకును బీళ్ళ నేర్పఱచుటయును. ఈ రెంటిని జత పఱచుటకు కారణము వర్షపాతములేనిచో చాల ప్రదేశములను పంటలు పండించుటకు వినియోగించుటకు మాఱుగ పచ్చిక బీళ్లుగానుంచుటయే లాభదాయకము. గ్రామసంఘసభ్యులు బ్రిటిషుఇండియా రాష్ట్రిములందు 100000000 యెకరములకంటె నెక్కుడుగ వ్యవసాయమునకు తగిన బంజరు భూములు గలవనియును, నందు సగమునకు జలాధారములు లేవనియును నుడివియుండిరి. మఱియు చాల లక్షలయెకరములు సాగునకు తగినదికాదని చెప్పిరి. అందు చాలభాగ మనావృష్టి సమయమున మేతలేమివలనగలుగు పశువుల మరణములను దగ్గించుటకు బీళ్ళుగామార్పవచ్చును.

రక్తమాంసమయ యంత్రములలో జేరిన పశువులను గూర్చి నుడివెద.

దురదృష్టవశమున, రైతులుగాని, జలాధారములుగాని పశులకాహారము నొసగజాలకున్నవి. రైల్లును, జలాధారములును మానవయంత్ర జీవనమునకే వినియోగించును. కాబట్టి మేతకువినియోగించుచెట్లను నాటి పచ్చికబీళ్లను నాశముగాకుండ జేయవలెననుటయే ప్రధానవిషయము. ఈ విధానము పశువులకుతగినంత మేతనొసగుటయేగాక యెరువుల నభివృద్ధిపఱచియు, నెరువును వంట చెఱకుగ వినియోగింప కుండులాగున వంటచెఱకును లభింపజేసియు, నిదివరకు వ్యవసాయమును గావించుచుండిన భూములకు బలముచేకూర్చును.

యూరపు, ఆస్ట్రేలియా, అమెరికా మొదలగు దేశములలోవలె శాస్త్రసమ్మతములగు వ్యవసాయ విషయముల నాచరణయందుంచుటకు ప్రభుత్వము చిర కాలమునుండి తలంచుచుండెను గాని యితర దేశములకును, హిందూదేశమునకునుగల పరిస్థితులభేదమును, హిందూదేశమునందలి వివిధభేదపరిస్థితులును, దీని నాచరించుట కింతవఱకు నాటంకములుగనుండెను.

ఈవిషయమును 1891 వ సంవత్సరములో ప్రభుత్వముతరఫున డాక్టర్ అగస్టసు వొయెల్కరుగారు

జాగరూకతతో పరిశీలించిరి. ఈఫలితము [illegible] కొన్ని ముఖ్య పద్ధతులయభివృద్ధిని సూచించునని భావించెదను.

### హిందూదేశమున వ్యవసాయము నభివృద్ధిపఱచు మఱియొకపద్ధతి.

విరివిగ ప్రజలు నివసించు ప్రదేశములనుండి, ప్రజలయొత్తిడిలేని ప్రదేశములకు హిందూదేశములోనే వలసబోవుటగాని, కార్మికులు తాము వాంఛించు నితర ప్రదేశముల కేగుటగాని మైయున్నది.

ఇక, చట్టపుమార్పులవలన రైతుల రివెన్యూ, పన్నులవిధానమును నభివృద్ధిగావించుట. హిందూదేశ ప్రభుత్వమును, వర్షవాయువుల మార్పులకు గుఱియగు చుండు రాష్ట్రముల నేలు రాజులును పంటలుపండనపుడు తమశిస్తులను పూర్తిగాగాని కొంతభాగముగాని వెంటనే తగ్గింపవలెననియు, రైతుజనుల భారమును తగ్గించుటకీ విధానమావశ్యకమనియు నుడువుట యవసరము. ఈవిషయమున పండిన పంటలలో కొలదిభాగమును దీసికొను ప్రాచీనహైందవాచారము కొంతవరకవలంబించిరి. ఈ సిద్ధాంతము చాలమంచిదే కాని దీనినిర్వాహణమునకై యుద్యోగులకగు వ్యయము హెచ్చుటయు, యవినీతిప్రబలి రైతులకుసంకటములు సంప్రాప్తమగుటయుసంభవించెను.